ఓం

నారాయణాయ నమః

# గణపతి రామాయణసుధ

యుద్ధకాండ 2వ భాగము, ఉత్తర కాండ





వడ్ల గణపతిశాస్త్రి

# గణపతి రామాయణ సుధ

యుద్ధకాండము-ఉత్తరార్థము,

ఉత్తర కాండము.



## చర్ల గణపతిశాస్త్రి

వెల - 15 రూ॥

విషయ సూచిక

పుట

# ఉత్తర కాండ

పుట

# రామాయణసుధ

(యుద్ధకాండ – ఉత్తరార్ధము)

అవల ఘనతేజుఁడు వానరాధిపతియు
నయిన సుగ్రీవుఁడిఁక ముందు నాచరింప
వలయు కృత్యములు సమస్తములు కరంబు
మనవిచేయుచు హనుమంతుఁ బలికె. 1

కుంభకర్ణుడు కొమరులు కూలినారు
కనుక రావణుఁడనికి నిర్గమన మిపుడు
చేయుఁడిఁక మహాకపుల్ సిద్ధమగుచు
కొఱవులనుబూని లంకకు నరుగుడనఁగ. 2

అపుడర్కుండును నస్తమింపఁ గపులత్యంతోగ్రమౌ సంధ్యయై
నపుడగ్నుల్గొని లంకపై నరిగినా, రవ్వారి వీక్షించి లం
కపురిన్ గాచెడు రాక్షసాళి పరవంగా గోపురాల్ పురాం
తిక సౌధాలను వీధులన్ వలభులన్ నిప్పంచఁ గాలెన్ త్రుటిన్. 3

గిరులఁబోలు ప్రాసాదముల్ ధరను బడియె
నచ్చటి యగురులు గంధపు లగ్నిఁగాలె
మణులు ముత్యాలు కెంపులుం బగడములును
పట్టుపుట్టాల్ దుకూలాలు భస్మమయ్యె. 4

మేలికంబళ్ళు నున్ని చేలాలు పసిడి
పాత్రలాయుధా లశ్వాల భాండములును
జీనులును నేగ్గు గొలుసులు చెన్నుమీఱు
కవచములు ఖడ్గములు గదల్ కాలిపోయె. 5

సారమహార్హ గంభీర గుణాఢ్యమై
హైమ చంద్రార్ధ చంద్రాభశాల
లతి చిత్రరత్న గవాక్షములొప్పి సూ
ర్యునిదాకు సౌధ విద్రుమ శయనము
లంగభూషల మయూరాదుల వీణల
స్వానాల నినదంబు సల్పు నిండ్లు
గిరితుల్య వేశ్మలు మెఱుపుల మేఘాల
రహి జ్వలించెడి తోరణము లెల్ల

అగ్నిచే బూదియైపడి యడగుచుండె
ఆ విమానాలఁ బంపు వరాంగు లేద్వ
తగులఁబడి యిండ్లు దీప్తౌషధి గురువనాభ
హిమగిరి శిఖరాలటు దౌల నెంతొ తోచె. 6

తళుకుం బంగరు వల్వలూని, పువులందా లొల్క భూషల్ భుజం
బుల మేనన్ ధరియించి, త్రాగితిని కైపుం బొంది యూగాడి కాం
తల వస్త్రిలను దాల్చు రాక్షసుల సద్మల్ శూలముల్ కత్తు లీ
టెలు చేఁ దాల్చిన వారి యిండ్లు కడు ధాటిన్ గాల్చె న్నాయగ్నియున్. 7

విలువౌ పాన్పుల నిష్ట దారలను కీవిం గూడి నిద్రించు వా
రల గేహంబులు భీతిబిడ్డలను చేరందీసి పర్వెత్తు కాం
తల యిండ్లున్ మతిలంకలో మెఱయు నాదైత్యాళి వేలు సూ
ఱులు వాసంబులు బూదిగాగ నన లార్చుల్ చేసె శీఘ్రంబుగన్. 8

మంటలచే కాలి మహిత సౌధాగ్రముల్
చిగిరించు మోదుగుచెట్లఁ బోలి
మావ టేండురచేత మాపులన్ గరులచే
లంకచరన్మ్ణ కరాబ్ధిఁబోలి

ముక్తాశ్వము గజము పొడగని కయొముక్త
గజము గని హయము గాసి మరలి
లంక తగులఁబడు నింక నీడలతోడి
జలధి రకోదక జలధిఁబోలి

కపులచే దగ్ధమౌ లంక క్షణములోనె
ప్రళయకాల దీప్త ధరిత్రివలెఁ దనర్చె
పొగలతో నిండి మండుచుఁ బొగులు స్త్రీల
యార్తనాద మడరెఁ బది యామడలకు. 9

మేను తగులఁబడఁగఁ బాఱు మేటి రాక్ష
సుల స్వనము, పోరఁగఁ గోరి చొచ్చు కపుల
గొప్ప ఘోషలు దశదిశల్ గూడనలమె
పెను సముద్రముగూడ క్షోభింపఁజేసె. 10

ఇఁక విశల్యులౌ రాముడు నితని భ్రాత
భ్రాంతిలేక ధనుస్సులు పట్టినారు
రాముఁడు ధనుస్స సారింప రాక్షసులకు
భయముగూర్చ పెనుఘోష వ్యాప్తమయ్యె. 11

రాముడు విలుసారించి విక్రమము చూపె
వేదమయు ధనుస్సున రుద్రు విధముతోప
వానరుల ఘోషయును దైత్య భయద నదము
రెంటి దాటెను రాముని వింటిఘోష. 12

వానరులఘోష దైత్యుల భయదనదము
రాముని వింటిఘోష దశాశలను గ్రసించె
రాముని శరాలు కైలాస రమ్య శృంగ
ములనుబోల్ పురగోపురములను గూల్చె.

వ. ఇట్లు రాముని శరములనుచూచి విమానములందు గృహములందు నున్న రాక్షసేంద్రుల సన్నాహము తుములమయ్యె. వారి సన్నాహముచేతను సింహనాదములచేతను ఆ రాత్రి రాక్షసేంద్రులకు రౌద్రియయ్యె. మహాత్ముఁడైన సుగ్రీవునిచేనిట్లు వానరేంద్రులు ఆజ్ఞాపింపబడిరి. మీరుపోయి రావణుని యంతఃపుర ద్వారముదగ్గఱ యుద్ధముచేయుడు. ఎవడయినవచ్చి మీ పనికి అడ్డువచ్చినచో ఆరాజశాసన దూషకునివధింపుడు అని. అంత వారలా సుగ్రీవుని యాజ్ఞచే మండుచున్న కొఱవులనుదాల్చి రావణుని యంతఃపురమును సమీపింపగానపుడు రావణునిలోఁ గ్రోధము ఆవేశించెను. ఆ రావణుఁడట్లుగాత్ర విక్షేపము చేయగాఁ పదిదిక్కులు వ్యాకులమయ్యెను. ఆతని గాత్రములందు మూర్తిని దాల్చినట్లు కోపమువెడలెను. అంతనతడు కుంభకర్ణుని పుత్రులయిన నికుంభ కుంభులను అనేక రాక్షసులతోపాటు యుద్ధమొనరింప ప్రోత్సాహపఱచెను. రావణుని యాజ్ఞచే కుంభకర్ణుని కొడుకులతోపాటు యూపాక్షుఁడును, శోణితాక్షుండును, ప్రజంఘుఁడు, కంపనుడును బయలుదేరెరి. అంత రావణుడు మహాబలులయిన రాక్షసులను ఇప్పుడే మీరుపొండు శీఘ్రమే జయముపొంది రండు అని ఆజ్ఞాపించె. అట్లు ఆజ్ఞాపించి పంపబడిన రాక్షసులు ఆయుధము జ్వలింపఁగా గర్జించుచు లంకను వెల్వడిరి. రాక్షసుల భూషణంబులందలి ప్రభల తోడను తమ ప్రభలతోడను వానరులు అగ్నులతోప్రభ చిమ్మిన యాకసమును ప్రభలుగలదానిగా జేసిరి. అందు తారాధిపుని కాంతియు ఆకాశ కాంతిని నాలుగింతలు చేసె. చంద్రకాంతి భూషణములకాంతి మండుచున్న గృహముల కాంతియు కపిరాక్షసుల సైన్యములను ప్రకాశింపఁజేసెను. పైకి మండుచున్న గృహముల ప్రభలచే సముద్రము ఇంకను పాతాళమునంటి చలోర్మియై ఎక్కువగా భాసించెను. 14

ధ్వజ పతాకలతోడఁ బరశు ఖడ్గములతో
భీమాశ్వరథగజ వితతితోడ
క్ష్వేడి కాల్బలముతో దీటగు విండ్లతో
ఖడ్గ తోమర శూల గదలతోడ

శత కింకిణీక్వాణ సంకులమాలతో
స్వర్ణ భూషణను భుజాలతోడ
ఘూర్ణితాస్త్రములతో ఘోర చాపములతో
గంధ మాల్య సుమహాంగాలతోడ

కూడు శూర జనంబులఁగూడి యుండి
ఘన జలధర ధ్వనులుగల్గి కదలివచ్చు
రాక్షసుల బలంబునుజూచి ప్లవగబలము
నుచ్చ నాదాలతోవచ్చి పెచ్చుపెరిగె. 15

జవముతోనెగిరి రాక్షస మహాసైన్యము
లరిబలాగ్ని మిడుతలట్లు వ్రాలె
బాహుప్ఫళించుచు పరిఘల త్రిప్పుచు
రాక్షసబలమెల్ల ప్రభలఁజూపె
అటు పిచ్చివారట్టు లాజికై వానరుల్
తరు శైల ముష్టులఁ బఱపినారు
పైఁబడెడి కపుల వరశీర్షముల రాక్ష
సులు ఖడ్గములతోడఁ జూచికొట్టి.

రదలఁ గపులును పండ్లతోఁ జెవులఁ జీల్చి
గుప్పిడులతోడ తలలను గుమ్మిరాల్చి
శిలలతో నంగములఁ బిండి చేసివేయ
దైత్యులిటునటులు చరించి తరలినారు. 16

కొందఱు ఘోరరాక్షసులు కూల్చిరి కత్తుల వానరేంద్రులన్
కొందఱు వానరేంద్రులను గొట్టిరి రాక్షసులన్ తరస్వులన్
కొందఱు కొట్టువానిఁ గడుగొట్టిరి కూలెడివానిఁ గూల్చిరే.
కొందఱు దూఱదూఱిరిక కొందఱు నిమ్మనిరిత్తు నందురున్. 17

ఆగుమి యేలకొట్టుదుర యంచును నొండొరు పల్కుచుండిరా
లాగున వల్వలూడ నటులన్ కవచంబులు వ్రీలునట్టులన్
వేగమె ప్రాసముల్ విసరివేతురు యష్టిగదాసి కీర్ణమై
ప్రోగగు దైత్యవానరుల క్రూరరణంబు కఠోరమై తగెన్. 18

పదుగుర నేడ్గురన్ గపులఁబట్టియుఁ గొట్టిరి దైత్యులాజిలో
పదుగురనేడ్గురన్ దితిజపంక్తిని గొట్టిరి వానరేంద్రులున్
వదపడి కేశవస్త్రముల బాగుగనూడగ వర్మముల్ చెడన్
పదపదయంచు దైత్యులనుబట్టి క్రమ్మఱచుట్టుముట్టిరిన్ 19

అటులన్ సంకుల ఘోరవీర జనతాత్యంత క్షయంబందు ను
ద్భటుడౌ నంగదుఁడంత కంపనుని యుద్ధావిష్టుఁడై పైకొనెన్
పటు కోపంబునఁ గంపనుండు గదతో వైళంబ కొట్టంగఁదా
నటు కొట్టంబడి యంగదుండును గరం బవ్వేళసోలెన్ భువిన్. 20

పిదపన్ తేఱి సుతేజుఁ డంగదుఁడు నావేశంబుతోఁ గంపనున్
కుధరాగ్రంబునఁ గొట్టఁ గంపనుఁడు నాక్షోణిన్ బడన్ చూచి యం
గదు వేగంబున శోణితాక్షుఁడెదురంగా వచ్చి నిర్భీతి ను
న్మదుఁడై కాలమహాగ్ని తుల్యశిత బాణాల్ కుర్పికొట్టెన్ పడిన్. 21

అటులన్ పింగలి కత్తివంటివియు శస్త్రాకార మర్ధేందు దు
ర్ఘట మహాచున్ గరవీర పత్రిసదృశాలై వత్సదంతా కృతిన్
పటు వైహారుణ కంకపత్త్రి నిశితంబౌ బాణధారల్ హుటా
హుటి నాయంగదుఁ గొట్టె నంగదుఁడు తానొక్కుమ్మడి దైత్యునిన్. 22

బలిమైఁ యుగ్రధనుస్సు నమ్ముల పడిన్ భగ్నంబు చేయంగఁగ
త్తులు చర్మంగొని శోణితాక్షుఁ డెగురం దూర్ణంబ యంగదుం
డల ఖడ్గంబుల లాగివైచి కడు బాహాదండమున్ కత్తి ధా
రల ఛేదించియు జందెముల్ వలెను, పోరన్ మీఱె తారేయుడున్. 23

రణరంగంబున నంగదుండు కరవాలంబూని గర్జించిపై
కొన హైమాంగద శోణితాక్షుఁడు నముః కూటంబయో పెన్గదన్
గొని మీదంబడు నాప్రజంఘుయుతుఁడై క్రోధానయూపాక్షుడున్
తనపెన్ స్యందన మెక్కి యంగదుని నంతన్ గొట్టవచ్చెన్ వెసన్. 24

అనురి విశాఖా నక్ష
త్రములు నడుమఁ జంద్రుఁడట్లు రాక్షసులకు మ
ధ్యమహితుఁ డంగదుఁడు నిలువ
క్షమత ద్వివిద మైందులకనిఁ గాచిరి కాంక్షన్. 25

అసిచర్మల్ గదలున్ ధరించి మువురున్ యత్నంబుతో రోష మొ
ప్పెసలారన్ ప్రతియత్నవంతులు మహోత్కృష్టాంగులై రాక్షసుల్
వెస నావానరము ముఖ్యులన్ మువుర వేవే విక్రమింపన్ గడున్
రస కందాయము గారణంబు జరిగెన్ రౌద్రాతి రేకంబుతో. 26

వానరుల్ వృక్షాలు పైవంగఁ గత్తితో
ఘనబలుడు ప్రజంఘుఁడెనసి దునిమె
కపులశ్వ రథములఁ గని వృక్ష గిరులేయ
శరములన్ యూపాక్షుడరసి కూల్చె
ద్వివిదమైందులు చెట్లు పెల్లగించి విసర
శోణి తాక్షుఁడు గదన్ వాని విఱిచె
అరి మర్మములను కోయు నసి నెత్తివేగమె
యంగదుని ప్రజంఘుఁ డపుడె యెదిరె

దరికివచ్చు ప్రజంఘుని నరసి యపుడు
అశ్వకర్ణతరునఁ గొట్టె నంగదుండు
కత్తిపట్టిన యాప్రజంఘాసురేంద్రుఁ
గరము గుప్పిట నంగదుం డెఱిగి కూల్చె. 27

అటులన్ గల్పానుబోలు క త్తివడ వజ్రాభంబ యౌమీఱు గు
ప్పిట నయ్యంగదు ఫాలమున్ బొడవఁగా వెవ్వెంటనే నేలనం
తట మూర్ఛిల్లియు లేచి యంగదుఁడు చేతంగ త్తిఁవేఁ బూని యా
పటువౌ వీరుఁ బ్రజంఘు శీర్షము పడన్ వై చెన్ సుతేజస్వియై. 8

పెనతండ్రిన్ హతుఁ జూచి యశ్రువులు వేవేగాఱు యూపాక్షుతో
మ్మున బల్మిన్ దివిదుండు వీరుఁడు కరమ్మున్ గొట్టిచేఁ బట్ట బ్రా
తను నాదుఃస్థితిలోనఁ జూచి బలుఁడై శోణితాక్షుండు వెం
టనె లోహంపుగదన్ విదిర్చి ద్వివిదున్ ధట్టించె వేగంబుగా. 9

గదదెబ్బన్ ద్వివిదుండు సోలి త్రుటిలో గాటంబుగా నాగదన్
గదియంబట్టి యులాగె, నాక్షణములోనన్ మైందుఁ డత్యుగ్రుఁడై
హృది యూపాక్షుని గొట్టి యార్వనట వెంతే శూరులై చేసి రు
న్మద యూపాక్షుడు శోణితాక్షుడని సుత్సాటాది కాకర్షముల్. 10

వ. అంత ద్వివిదుండు శోణితాక్షుని ముఖమును గోళ్ళతోఁజీల్చి భూమి పై బడవైచి కొట్టి ముద్దచేయు యూపాక్షుని గూడ మైందుఁడు బాహులచేఁబీడించి భూమిపైని పడవైచె అపుడా వీరులు హతులుకాఁగా రాక్షససేన కుంభకర్ణుని పుత్త్రుడున్న వైపుగా వెళ్ళె. అంత పాఱివచ్చు రాక్షససేనను జూచి యూరడించి పైపై కి విజృంభింపవచ్చు వానరసేనను మహావీరులు చనిపోఁగ మిగిలిన రాక్షససేనను జూచి తేజస్వియైన కుంభుఁడు రణమున సుదుష్కరమైన కర్మ యాచరించె. ధనుర్ధారులలో శ్రేష్ఠుఁడైన కుంభుఁడు సర్పములఁ బోలు బాణములను విడిచె.

అపుడాతని ధనుస్సు శరంబుతోగూడి * విద్యుద్దై రావతములతోడఁ నర్పిస్సుగల రెండవ యింద్ర ధనుస్సువలెఁదోచె. ఆ కుంభుడు కర్ణములవరకు

* విద్యుద్దై రావతావివ = రఘువంశము చూ॥ 2వ సర్గ.

లాగివిడచిన స్వర్ణపుంఖముగల బాణముతో ద్వివిదునిగొట్టఁగా నాతఁడు కాళ్ళు శిథిలములుగాఁగా అద్రికూటమునవలె నేలకూలుటయు నాఘాతయుగు ద్వివిదుండు పడుటచూచి మైందుఁడొక పెద్దబండశిలను గ్రహించి వేగముగాఁ బరుగెత్తి మహాబలుడయిన కుంభునిమీద విసరనాతండు దానిని అయిదు ప్రసన్న బాణములచే భేదించె. అపుడు మరియొక సర్పమువంటి బాణమును తీసికొని మహాతేజుడగు ద్వివిదుని సన్నిహితుగు మైందుని వక్షమునఁ గొట్ట ఆతండు మర్మములకు అదితగుల నేలపయిఁబడె. అంతసంగదుడు మేనమామలిరువురు నేలకూలుటచూచి వింటినెత్తి ఎదుర్కొను కుంభునిపై పుపరువిడె. అట్లు మీదికివచ్చు నంగదునిజూచి కుంభుడు కనకభూషణములుకలిగి అకుంఠధారలుగల వాడియైన అయిదు లోహబాణములచే తోమరములచే మదపుటేనుగునుబోలెఁ గొట్టుటయు నాతండు చలింపక కుంభకర్ణుని కొడుకు కుంభుఁడు వానినన్నిటిని భేదించె. అట్లు భేదించి కుంభుడు ఉల్కలచే కుంజరమునుబోలె బాణముల రెంటిచే నంగదుని కనుబొమ్మలపైని గొట్టె. 31

అటులన్ గుంభునిచేతఁ గన్బొమలపై నాఘాతముం బొంది నె
త్తుటఁ గన్నుల్ తడియుంగఁ గన్నులను తోడ్తోఁ జేతితోనొక్కియుం
తట నాయంగదుఁ డొంటిచేతఁ బెనుస్కంధంబొప్పు చెట్టొండు కొ
ట్టుటకై పీకియువంచి కొట్టెనట బిట్టున్ కుంభు నేన్గుంబలెన్. 32

రామునికిన్ నివేదనము ప్రస్ఫుటరీతి నొనర్ప రాముఁడున్
భీములు జాంబవత్ప్రముఖ వీరులకానతి యీయ వేగ ను
ద్దామ పరాక్రమంబెనయుఁ దత్క్షణమంగదుఁ గావఁ జెట్టులన్
జెమల రాళ్ళఁగైకొని సుషేణుఁడు వ్రాలెను జాంబవంతుఁడున్. 33

దరికిన్ వచ్చుచు మీఁద మీదఁబడు నుద్దామ ప్రభాయుక్త వా
నర వీరాళినిజూచి కుంభుఁడట బాణౌఘుంబుచే, చెట్టుచే
నగనుంబోలెను నావఁ గుంభుని శరాసారం బెదుర్కోఁగ వా
నర వీరాగ్ర్యులు చాలమిన్ హరివలెన్ బర్వెత్తె సుగ్రీవుఁడున్. 34

పెలుచన్ గొండలు నశ్వకర్ణ ధవముల్ వేవేగ నన్యద్రుమం
బులు నెన్నెన్నియొ పెల్లగించి విసరన్ భూమిం దివింగప్పు నా
పలుచెట్లున్ వడిఁగుంభుఁ డంపగమిచే వారించి ఛేదింపఁ జె
ట్టులు ఘోరంపు శతఘ్నులట్లుచట బిట్టున్మండి పెల్లెన్దివిన్. 35

అటులన్ గుంభునిచేత భిన్నమగు వృక్షాసారముంజూచి యు
ద్భట సుగ్రీవుఁడు బాధపొందకయె తద్బాణాల వర్షంబు ము
చ్చటగా సైచుచుదూకి కుంభుని మహాచాపంబు చేపట్టి యం
తట వేగంబుగ లాగివైచి విఱిచెన్ తచ్ఛక్ర చాపాభమున్ 36

అట శీఘ్రంబ సుదుష్కరంబయిన కార్యంబున్ వెసన్‌జేసి యు
త్కట కోపంబున భగ్నశృంగమగు నాగంబున్‌వలెంబా హుటా
హుటి వీక్షించియనెన్ నికుంభ ఘనుడా సోయన్న! వీర్యాన ను
త్కటుడా నీకునునన్న రావణుని కేతత్శౌర్యంబు నాశ్చర్యమౌ. 37

అల ప్రహ్లాద బలీంద్ర వైశ్రవణ తుల్యోజుండ, వొక్కండవే
బలవృత్తంబునఁ దండ్రిఁబోలితివి, చాపంబూను నాజాను బా
హు, లసద్వీర్య నరిందమున్ నిను సురల్ యుద్ధాన వశ్యాత్మ-ఆ
ధులు వోలెన్ గెలువంగలే రిపుడె చూతుంగా విజృంభింపుమీ. 38

వరదానంబున నీపితృవ్యుఁ డసుర స్వర్గావాసులన్ సైచెఁగా
సురలన్ దైత్యులఁ గుంభకర్ణుఁడనిలో శూరుండయై సైచెఁజూ
శర సంధానములోన నింద్రజితుతో సామ్యంబు నీకొప్పు ని
ద్ధర నారావణుతోడఁ దుల్యుఁడవు దైత్యశ్రేష్ఠుఁ డీవున్నతిన్. 39

అనిలో నీకుఁగలట్టి యద్భుత మహాగ్ర్యంబు నీప్రాణు లి
మ్మున వీక్షించుత శక్రశంబరులకున్ బోలెన్, మహాస్త్రంపు పై
పుడిఁ జూపించితివింక నీపయుతులంపుం గర్మ గావించి క్ర
న్నన నావానర భీమవీరులను గ్రిందంగూల్చి నావేగదా. 40

ఇతరులతోడ యుద్ధమొనరించిన శ్రాంతుని జంపెనన్న నిం
ద తగులకుండ నీవిపుడు తద్దయుఁజల్లగ విశ్రమించి నీ
సుతులబలంబు చూవుమని యాకపిరా జన సావనూన స
త్కృతి సహియింప కాజ్యమది వేల్చిన నిప్పటుమండె నాతఁడున్. 41

అట సుగ్రీవుని గేలఁబట్టుకొని శౌర్యంబొందు కుంభుండు, నె
క్కటి కయ్యానకుఁ జేవిదుల్చుకొని వీకన్మీఱు సుగ్రీవుఁడున్
పటు నుత్తేభములట్లు మాటికిని నిఃశ్వాసంబులం దీయుచున్
విట తాటంబుగ నొండొరుల్ దివుచుచున్ వేపోరిరా యిర్వురున్. 42

తమ వక్త్రంబులవారు జ్వాలలుపొగల్ దర్పంబుతోఁ గ్రక్కుచున్
శ్రమఁబాదంబులఁ దన్నుకొంచు వడిఁబోరన్ భూమిక్రుంగెన్ సము
ద్రము వ్యాఘూర్ణితవీచి మాలికలతోఁ బ్రాజిల్లి క్షోభిల్లె, శౌ
ర్యముతోఁ గుంభునిఎత్తి వార్ధితలిఁ జేరంగూల్చె సుగ్రీవుఁడున్. 43

అటులబ్ధిన్ వడిఁగుంభుఁడున్ బడఁగ నాయంబోధి పైపైకి ను
త్కటమై క్షోభిలి వింధ్యమందర సమాకారంబుతో పొంగె నం
తటఁ గుంభుండును పైకిపైకెగిరి క్రోధంబొప్ప సుగ్రీవు ను
ద్భటుఁడై రొమ్మున వజ్రవేగము దలిర్పంగొట్టెఁ బెన్గుప్పిటన్. 44

అటులన్ రొమ్మునఁగొట్ట; వజ్రహతి స్వర్ణాద్రిన్ బయల్దేఱు నం
తటి జ్వాలల్ వెడలంగ వజ్రసమమై తత్సూర్య రశ్మిప్రభా
పటుపై యుర్చులమీఱు గుప్పిటను వేబంధించు సుగ్రీవుఁడం
తట నాకుంభుని రొమ్ముపైని వడిగా ధట్టించికొట్టెన్ వెసన్. 45

అప్పుడాదెబ్బతోఁ గుంభుడర్చి చనిన
యుగ్నివలె విహ్వలుండయి యవనిఁగూల
గుప్పిటను గొట్టఁబడిన యాకుంభుడంత
అనుకొనకె పడుర క్తార్కుఁ డట్టులయ్యె. 46

గుప్పిడుల దెబ్బతిని పడు కుంభురూపు
రుద్రుచేఁ బట్టుబడిన సూర్యుండు వోలె
నెసఁగ భీమవిక్రమ వానరేశుచేత
కూలఁ గుంభుఁ డసురులతో నేలవడఁకె. 47

ఇటు సుగ్రీవుఁడు కూల్చినట్టి యనుజున్ వీక్షించి కోపంబుతో
నట సుగ్రీవుని దగ్ధుఁజేయు నటులై యంతన్ నికుంభుండు ను
చ్చటఁ బూమాలలు దీర్చియున్న హిమవచ్ఛైలాభమౌ స్వర్ణపుం
బటకా గల్గిన వజ్రపుంబరిఘు శేపంబట్టె వ్రేళ్లైడిటన్. 48

అటుల యమదండమునుబోలు హడలుగొట్టు
నింద్రధ్వజమట్టి పరిఘమునెత్తి నోరు
తెఱచి తేజస్వియు నికుంభు డఱచి విసరి
గర్జనముచేసె శత్రుభీకరము గాఁగ.

పాణులంగదంబుల తొమ్ము పతకమునను
చెవులుకుండలాల, స్రజంబుచేత గళము
పరిఘచే భూషలనొందల్ దనరు నికుంభుఁ
డలరె మెఱపింద్ర ధనువొప్పు జలదమట్లు 50

అమహాబలుని పరిఘాగ్రమపుడు తగిలి
ఆహవాది వాయుస్కంధ మ పిసిపోయె
ధ్వని యొన్పడి పొగలేని వహ్నియట్లు
నిప్పులనుగ్రక్కి జ్వాలలన్ నిండిపోయె.

అలకాపురి నమరావతి
నలరెడి గంధర్వ మందిరాదులు దివిఁదా
రలు గ్రహములు చంద్రుండును
గల మింట నికుంభపరిఘ కలఁచెడు నటులౌ. 52

పరిఘాభరణ ప్రభలన్
వఱలు నికుంభాగ్ని వెలయుఁ బ్రళయాగ్ని వలెన్
అరయుచుమనిరి, యసురులు వా
నరులు కదలలేక యచట నణంగిరి మిగులన్. 53

హనుమంతుఁడైతె తన ఱొ
మ్మును నొడ్డి ధృతిని నికుంభు ముందుగ నిలిచెన్
ఘనపరిఘఁ బరిఘ సముభుజుఁ
డు నికుంభుఁ హనుమగుండె డుల్లగఁ గొట్టెన్. 54

స్థిరముగ నొడ్డిన మారుతి
యురమునఁబడి నూఱుముక్కలొగినయి యచట నా
పరిఘ పడి నూఱు నిప్పుల
కొఱవులు గలిగించివెలిగె భువిపై దివిపై. 55

మన వానరుఁడు మహాబలి
హనుమంతుండట్టి గొప్పదగుదెబ్బ పడం
గను భూకంపం బరుదెం
చిన తఱి గిరివలెఁ జరించి స్వప్రతిగనెఁ బిదపన్. 56

తన గుప్పిడి నెత్తి యపుడు
ఘనతేజుండయి నికుంభు కఠినంబగు ఱొ
మ్మునఁ గొట్టమండె మెఱపటు
ల నికుంభుని చర్మపగిలె రక్తముగాఱెన్. 57

తీవ్రముగఁ గొట్టినట్టి యాదెబ్బచేత
వడి నికుంభుఁడు చలియించి స్వస్థుఁడగుచు
ఘన బలుఁడగు మారుతిని బట్టుకొనగఁజూచి
యపుడు లంకాపరివాసు లఱచి రెలమి. 58

అటులఁ గుంభకర్ణసుతుచే నపుడు తీసి
కొనియెపోఁబడి పిడుగట్టి గుప్పిటఁ గడుఁ
గొట్టి తన్నను విడిపించుకొని ధరిత్రి
నిలఁబడి నికుంభు మథించి నలిపివైచె. 59

పిదప భువిపైని పడఁగొట్టి వెస నతండు
నెగిరి వాని ఱొమ్మునఁబడి మిగులఁ బిండి
చేసి కేలబట్టుకొని చెచ్చెరను మెడను
ద్రిప్పివైచి యార్చుచుండ వ్రీల్చెశిరసు. 60

ఇటుల హనుమంతుఁడు నికుంభునటనె చంప
రాము మకరాక్షులకు ఘోరరణము నుగ్గ
మయ్యెఁ గపులు ముదమునొంది రఱచె దిశలు
ధర వడఁకె దివిపగిలి దైత్యాళి హడలె. 61

కుంభుఁడును నికుంభుడు నాజిఁ గూలిచావఁ
దెలిసి రావణుఁ డగ్నియట్టులను మండి
క్రోధశోకాల మూర్ఛిల్లి కొంతదేఱి
ఖరసుతుల మహాక్షు మకరాక్షు నరసిపలికె. 62

వెళ్ళునాయన! నాయాజ్ఞ వేగ సేనఁ
దీసికొని రాములక్ష్మణుఁ బ్రముఖ కపులఁ
జంప మనశూరమాని నిశాచరుండు
నట్లయని రావణుని ప్రమొక్కి యరిగె వలగ. 63

వ. అట్లు రావణుని వలగొని మకరాక్షుండు దరిగానున్న సైన్యాధిపతిని సైన్యము రప్పింప నానతిచ్చి యాతండుతెచ్చిన రథమునకుఁ బ్రదక్షిణముచేసి దానివధిష్టించి వేగముగా రథముతోల సూతునికి ఆజ్ఞఇచ్చి రాక్షసులతో మీరు నాముందుగాబోయి యుద్ధముచేయుడు. రామలక్ష్మణులఁజంప రాక్షసరాజు

రావణుడు నాకాజ్ఞయిచ్చెను. నేను రామలక్ష్మణులను శాఖామృగమైన సుగ్రీవుని నితర వానరులను నాయుత్తమ బాణములచే వధించి అగ్ని యెండు కట్టెలనువలె వానరసేనను దహించివైతును. అని మకరాక్షుకానతీను బట్టుపెడ్ బోసికొని కామరూపులు మహాదంష్ట్రులు పింగళేక్షణములుగలుగు రాక్షసులు మాతంగములువలె ఘీంకరించుచు మహాకాయులయి మహాకాయుడగు మకరాక్షుని జుట్టుకొని భూమినిద్దరిలజేయుచు బయలుదేరిరి. అంత వేలకొలది భేరులు శంఖములు మ్రోగుచుండ జబ్బలుచఱచుచు చిటికెలువేయుచుండ గొప్పశబ్దము మ్యెను. ఇంతలో అమకరాక్షుని సారథిచేతినుండి కొరడాజారిక్రింద బడెను. ఐండా ఎగిరిపోయెను. గుఱ్ఱములు కళ్ళనీళ్ళతోనిండి విశ్రమించక కాళ్ళు తొట్టుపడ దీనముఖములైనవి. రౌద్రుండయిన మకరాక్షునియెదుట దారుణమైన దుమ్ముతో గాలివీచెను. ఇట్లు అపశకునము లగుచున్నను వీర్యవంతులయిన రాక్షసులా వానిని లెక్కపెట్టక రామలక్ష్మణులున్న చోటికి మేఘ గజ మహిషంబులవంటి శరీరములతో మాటిమాటికి గదల కత్తుల దెబ్బతిన్న వారైసను యుద్ధకౌశలముతో నేనుముందు నేనుముందనుచు ధ్వనులుచేయుచు అన్నివైపులనుండి బయలువెడలిరి. 64

మకరాక్షుండిటు విక్రమంబు మెఱయం బైన్నేర వీక్షించి పో
రికి నుత్సాహమునతోడ నేగియు మహోత్కృష్టాత్ములై దేవ దై
త్యని కాయుంబటు పోరినారలు కరంబావేశమొప్పంగ, దే
వని కాయుంబు సురద్రవజం బెటులు దీవ్రంబొప్పఁ బోరాడిరో. 65

తరువుల్ శూలములన్ గదాపరిఘలన్ దట్టించుచున్ వేయుచున్
కరవాలంబులు శక్తికుంతలము లుగ్రంబైన నిర్ఘాత ము
ద్గరముల్ కఱ్ఱలు భిండిపాలము లనిన్ గైకొంచు దైత్యాళి వా
నరులన్గూడి రణంబుచేసిరి యమమంద ప్రౌఢిమన్ జూపుచున్. 66

ఖరపుత్రుండిటు బాణముల్ వయిచి యుగ్రంబారఁ బోరాడ భీ
కర తచ్ఛౌర్యము సైపలేక మదిలోఁ గంగారు పుట్టంగ వా
నరులున్ బోఁటుటచూచి రాక్షసులటన్ శౌర్యంబుతో రెచ్చి బి
ట్టుఱుమన్ ధైర్యముచెప్పి వానరుల; కెన్నో రాముడేసెన్ శరాల్. 67

అటు రాముండును దైత్యులన్ నిలువ క్రోధావిష్టుడై తెచ్చి యుం
తట వీఁకన్ మకరాక్షుఁడిట్లు పలికెన్ దద్రాము వీక్షించుచున్
ఇటు నీవుండుమురా ను! నీకిపుడె యెంతే ద్వంద్వయుద్ధంబు ము
చ్చటగా నిచ్చెద నమ్ముమేసి యు విలాసన్ దీతు నీప్రాణముల్. 68

అటునాఁ డీవల దండకాటవిని మా యయ్యన్ ఖలా! చంపినా
విటు నాముం దటువంటి నిన్ గనిన నాకెంతేని రోషంబు హె
చ్చుట నా దేహము మండిపోయినది దుష్టుండైన నిన్నప్డు చం
పుటకున్ వీల్పడలేద నేఁడు కలిగెన్ పోకార్చు భాగ్యం బిటుల్. 69

నా యదృష్ట వశంబున నాకు నీదు
దర్శనపు భాగ్య మబ్బెను తప్పకుండ
ఆఁకలిగొను సింహమునకు నన్యమృగము
వోలె నేఁడిట్లు దొరకినావుర ! దురాత్మ ! 70

ఇపుడు నా బాణవేగాన నిట్టి నీవు
యముని యింటికిపోయి నీవదివఱకును
దండకాటవిఁ జంపిన దండి మగలఁ
గల్సికొనుటకు పోయెదుగదర రామ ! 71

వేలమాట లేలకు రామ ! విను మదుక్తి
ఆజి నిను నన్ను లోకంబు లరయుఁగాక
గదను నస్త్రాల బాహులన్ గాని నీవు
ఏది నేర్చినదాననే యీవు పోరు. 72

మకరాక్షుం డిటు మాటమాట మిగులంబల్కంగ నాలించి యా
యకలంకాత్ముఁ డిటుల్ కరంబుపలికెన్ హాసంబు తొల్కాడ,నే
లకు నిన్నున్ స్తుతియించుకొంచును ననర్హంబైన వాక్కుల్ వచిం
తు కనుంగొమ్ము రణంబుచేయక వృథోక్తుల్ వల్కఁగా నేమగున్. 73

అనిలోనన్ బదునాల్గు వేవురగు దైత్యానీకమున్ నీదు తం
డ్రిని నాదూషణు వీరుఁడౌ త్రిశిరునిట్లే నేనటన్ జంపితిన్
కనుమీవేళను గృధ్ర జంబుకములున్ గాకుల్ స్వపత్త్రిలచే
త, నఖాలన్ దిని నీదు మాంసములఁ దృప్త స్వాంతమౌఁ గావుతన్. 74

ఇటు రాముండనఁగన్ ఖరాత్మజుఁడు నెన్నో బాణముల్ రాముపై
పటు శౌర్యంబునవేయ నెల్ల శరముల్ పైశంబ రాముండు ను
త్కట బాణంబులఁ గ్రుమ్మ నన్నియును బంగారంపుఁ బుంఖాల ను
ద్భటమౌ నాశరముల్ వెసన్ ధరణిపైఁ దత్కాలమందే పడెన్. 75

దశరథు పుత్త్రుఁడున్ ఖరసుతాగ్ర్యుడు నంతఁ బరస్పరంబు తే
జసు మెఱయన్ మహారణము సల్పిరి మింటను మేఘముల్ వలెన్
పసమెయి వారివిండ్ల వెలువడ్డ స్వనంబును యుద్ధభూమిలో
వెస వెఱగొల్పఁ గిన్నరులు వేల్పులు కోరిరిచూడ దైత్యులున్. 76

ఒకరినిమించి యొక్కొకరు నుద్ధతనొందౌరు స్వాంగసీమలన్
ప్రకటితరీతివేసి ద్విగుణంబుగ వర్ధిల రాముఁడేయు వా
డి కల శరాల రాక్షసుడు లీలగ భిన్నముచేయ రాముడున్
మకరుని యమ్ములన్ దునిమి మానక కప్పె శరాళి నేలపై. 77

కడునలుకన్ మహాభుజుడు కాంచి రఘూద్వహుఁడంత నారియె
క్కిడి యసురుండు దాల్చువిలు కృత్యవిదుండయి వేగఁద్రుంచి బల్
కడిమిని నెన్ని దమ్ములను గ్రమ్మన సూతునిగొట్టి వారువంబులన్
బుడమినిగూల్చివేయ రథముంబడ దైత్యుఁడునిల్చె నేలపై. 78

ధర భూతాళికి భీతిగొల్పుచు యుగాంతాగ్నిన్ కడుంబోలు భీ
కర శూలంబును చేతఁబూని మకరాక్ష క్రూరదైత్యుండు గ
ర్గిర దానిన్ వడిఁద్రిప్పి రాముపయిఁ బేర్మిన్‌వేయుఁ రాముండును
క్కఱ దానిన్ స్వశరాల బల్గతిని నాకాశంబునన్ గూల్చెన్. 79

వ. అంత నాదివ్య స్వర్ణభూషలతో నలంకరింపఁబడిన యాశూలము క్రిందఁ బడిపోవఁ జూచి క్షేమ క్షేమఅని సకలప్రాణులు ఘోషించెను. అంత ఆశూలము పడుటఁజూచిమకరాక్షుడుఆగుఆగుమనిరామునితోఁబలికిరాగా పైపైకివచ్చుచున్న మకరాక్షునిజూచి రఘునందనుండునవ్వి ఖంట పావకాస్త్రమును సంధించివేయ ఆమకరాక్షుఁడు ఆయస్త్రముచేఁ గొట్టఁబడి హృదయముపగిలి నేలకూలిచచ్చెను. అట్లు పడిన మకరాక్షునిజూచి రాక్షసులందఱు రామబాణములచే బాధపడి లంకవైపునకె పరువిడిరి. అంత సురలు వజ్రాయుధముచే శీర్ణమయిన గిరినివలెఁ జూచి మిగుల సంతోషించిరి. 80

—: రావణుఁడు ఇంద్రజిత్తును పంపుట :—

అటు మకరాక్షుఁడున్ బడుట నాప్తులవల్లను నాలకించి నే
పట పట పండ్లన్‌గొఱికి బాగుగమండియు రావణాసురుం
డట నెది కార్యమంచు మదియందుఁ దలంచియు నింద్రజిత్తు కా
దట ననికేగ నాజ్ఞయిడె దైత్యవిభుండును జంప భ్రాతలన్. 81

వీర! మహాబలాఢ్యులగు వీరుల భ్రాతల రాములక్ష్మణున్
వీరతమీఱఁ జంపు కనిపించియొ కన్పడకుండనో యనిన్
వీరులలోన శ్రేష్ఠుఁడవు వేగ సురేంద్రునె గెల్చినాఁడ వీ
ధారుణి లెక్కయే నరులు దర్శనమాత్రనె చంపెదివికన్. 82

నలువైపుల్ శరపత్రతోమరములన్ స్వాహ్నిన్ దరిందీర్చి కా
ర్ష్ణలుపై యొప్పెడు మేకపోతు బ్రతికుండన్ దెచ్చి తత్కంఠమున్
నులుమంబట్టెను మంది వెంటనె పొగల్ నూల్కొని నిప్పుల్ పిరా
జిల నాచిహ్నము లెల్లయున్ జయము సూచించెన్ శుభంబై కడున్. 83

అగ్నియును ప్రదక్షిణావర్త శిఖలొప్ప
మేలి బంగరు సమమోలి నగుచు
స్వయముగనట లేచివచ్చి హవిస్సు
తాప్రతి గ్రహించెఁదన కరాల 84

వ. అంత నాయింద్రజిత్తు,

ప్రేల్చి యగ్ని దానవదేవ తృప్తి చేసి
మాయమై శుభంబగు మేలి యరద మెక్కె
రథమొ గుఱ్ఱాలతో సుశరాలతోడ
గొప్ప విండ్లతో భాసిలి కొమరు మీఱి. 85

తనువుచే నొప్పి హాటకాస్తరణ మెసఁగ
అర్ధచంద్ర చంద్రమృగ చిత్రాంచితమయి
రథము నదె మీఱె స్వర్ణవలయము దనర
అగ్నిఁబోలి, వైడూర్యాన నలరెఁ జెండ. 86

అంత సూర్యతుల్యమగు బ్రహ్మాస్త్ర మెంతొ
రక్షయిడ నింద్రజిత్తె దుర్పంగ రాని
ఘన బలుండయి బైల్దేఱి కానరాక
విధిగ రక్షస్సు మంత్రాల ప్రేల్చ యనియె. 87

ఎవియో వంకలులోనఁ బెట్టుకొని పైకీరూపుతో వచ్చు రా
ఘవులన్ బోరునఁ జంపి నిష్కపిగ నీక్ష్మామండలిన్ జేసి నేఁ
డె, వెసన్ నాప్రియుఁడైన తండ్రికి జయుంబేఁ గూర్చి సంప్రీతి గౌ
రవమున్ గూర్తు నటంచు నింద్రజియె లీలన్ మాయమయ్యెన్ ద్రుటిన్. 88

తన పిత్రాజ్ఞను నింద్రజిత్తు తలమీఁదన్ దాల్చి తీవ్రాస్త్రముల్
ధనువున్ గైకొని శీఘ్రమే త్రిశిరసుల్ భాసిల్లు సర్పంబులో
యనరాజిల్లి శరాళిఁ గుమ్మి కపిమధ్యన్ నిల్చియున్నట్టి ల
క్ష్మణు రామున్ గని వారు వీరె యని స్వస్వాంతంబు నందెంచుచున్. 89

తన విల్లెక్కిడి మేఘముంబలెను శస్త్రాస్త్రాల వర్షించుచున్
విను వీధిన్ గనిపింపకే రథములోనే యుండి క్రొవ్వాడి యా
ఘన శస్త్రాలను రామలక్ష్మణుల పయిన్ గాటంబుగా గప్పఁ గ
న్గొని దివ్యాస్త్రము లెన్నొ వేసి రచటన్ యోజించి యాభ్రాతలున్. 90

వినువీధిన్ శరజాలముల్ మిగుల దోర్వీర్యంబునం గప్పి రై
నను సూర్యాభశరాలు నస్త్రములు నైనంగాని యాయింద్ర జి
త్తును నేమాత్రము తాకవా చతురుఁడున్ ధూమాంధకారంబు మిం
టను గల్గించుచు మంచు చీఁకటులతోడన్ గప్పె నాదిక్కులన్. 91

అతఁ డాకాశమునన్ జరించు తటిఁ దజ్జ్యా ఘోషముంగాని చ
క్రతురంగోచ్చ ఖురాల యాస్వనములుంగానీ చెవిన్ దాక వు
గ్రతదాకారముగాని కన్పడదు, మేఘవ్యాప్తమౌ చీకటిన్
తత బాణంబుల వర్ష మింద్రజితు వింతల్ తోపఁగూర్చెన్ గడున్. 92

వ. ఇట్టు లాయింద్రజిత్తు బ్రహ్మ నుండి మిగుల వరములు పొందిన వాడు గాన సూర్యతుల్యములైన బాణములచే రాముని సర్వగాత్రములందుఁ గోపముతోఁ గొట్టెను. వర్షధారలచే పర్వతములువలె బాణములచేఁ గొట్టబడుచుఁ

గూడ వానరవ్యాఘ్రములు హేమపుంఖములు వక్రములైన బాణములు ప్రయోగించిరి. అవి ఆకాశమున నింద్రజిత్తు పయిఁ బడుచు రక్తముతోఁ దడిసి పోయినవి. వానరోత్తములు మిక్కిలి శరవర్షముచేత బాధపడుచుఁ గూడ అనేక ఖడ్గములచే వానినిఁ దెగఁగొట్టిరి.

ఆ యింద్రజిత్తు వేసిన బాణములు కనిపించినచోట నెల్ల అదాశరథులు ఉత్తమాస్త్రముల స్పృశించిరి. ఆరావణ పుత్రుఁడు అతిరథుఁడై తనరథముతో సర్వదిక్కులందు చలించుచు హస్తలాఘవమున ఆరామలక్ష్మణుల బాధింపఁ దొడగెను, అతని సుస్థు నిర్మిత హేమపుంఖ బాణములు తగిలి పూచినమోదుగు చెట్లవలె ఆనరకుమారులు ప్రకాశించిరి. మబ్బులు గ్రమ్మగా సూర్యుఁడు గనిపింపనట్లు ఆకాశమున సంచరించు నాయింద్రజిత్తు రూపముగాని గతిగాని కనిపింపదయ్యె. ఆయింద్రజిత్తుచేఁ గొట్టఁబడి వానరులు భూతలమున ప్రాణములు వీడి పడిరి. అంత లక్ష్మణుఁడు క్రుద్ధుఁడై "నేను సర్వరాక్షసులను జంపుటకై బ్రహ్మాస్త్రమును ప్రయోగింతును. అనెను. అది విని రాముఁడు శుభలక్ష్మణుఁడగు లక్ష్మణునితో నిట్లనియె "ఒకనికై యీపృథ్విగల రాక్షసులను జంపరాదు. యుద్ధము చేయని వానిని దాగిన వానిని చేతులు జోడించిన వానిని శరణుఁ జొచ్చిన వానిని పరువెత్తు వానిని ప్రమత్తుని ఎపుడు జంపరాదు" సర్పములవలె మహావేగము గల అస్త్రముల నాదేశించి వీని వధకై ప్రయత్నింతము. మాయావియై రథముతోపాటు అంతర్ధానము పొందిన వీని వానరులు చూచి చంపెదరులెమ్ము. ఇతఁడు భూమిపైనున్నను స్వర్గమును గాని పాతాళమునుగాని ఆకాశమునుగాని చొచ్చినను నిగూఢుఁడై యున్నను వీనిని నాయస్త్రములు ప్రాణములుపోవ దగులఁబెట్టునులెమ్ము. అని పలికి మహాత్ముఁడు రఘువీరుఁడు వానరవరులు చుట్టుకొన అవిరుద్ధకర్మయగునాయీ యింద్రజిత్తు వధకై వీక్షింపసాగెను. 93

ఆ మహాత్ముఁడౌ రాముని స్వాంత మెఱిఁగి
యుపట నుండి యింద్రజి మర్లి యరిగె పురికి
పడి గలుగు దైత్యుల వధంబు నెడఁదఁ దలఁచి
పలుకఁగను లెబ్బవడ ద్యుతి యలర నేగె. 94

రాక్షసులు కూడ రాఁగ శౌర్యంబు గలుగు
నింద్రజిత్తు పౌలస్త్యుఁడు నింక నరిగి
పశ్చిమద్వారమున, బోరపచ్చు రామ
లక్ష్మణులఁ జూచి మాయను బ్రకట పఱచె. 95

స్వీయ రథము పయిని మాయసీత నుంచి
ఎంతొ బలిమి నామెను వధియింపఁ గోరి
అందఱను మోహపెట్టఁగ నాత్మఁదలఁచి
సీతఁ జంపఁబూని కపుల చెంతఁ జేరె. 96

పురమందుండియు బైలుదేఱు దితిజున్ మున్ముందు వీక్షించి వా
నరులల్కన్ శిలలన్ గ్రహించి యెదురన్ రాఁగా హనుమంతుఁడు
ద్ధురతన్ శృంగము నెత్తి వారలకు ముందున్ బోయి యా యింద్రజి
త్తు రథంబందొక వేణితోఁ గుములుచున్ దుఃఖించు సీతన్ గనెన్. 97

ఉపవాసంబులఁ జిక్కి దీనయయి యెంతో నల్గి గాసిల్లి యొం
టి వయిన్ వస్త్రమొకటి దాలిచి తలంచే లేక కుళ్ళొచు దు
మ్ము పయిన్ గప్పిన మేనితో నలరుపూఁ బోడిన్ విలోకించి త
చ్ఛ పలాక్షిన్ తుది సీతగాఁ దలచి చింతన్ మున్గె నాతండెదన్. 98

పగచే గ్రుక్కియు దీనమౌచు నరదం బందున్ నిరానందయై
మిగులన్ రావణ పుత్రుచే పడిన యామెన్ సీత నీక్షించి యే
మగు నీయింద్రజిభావ మిట్టిపుడు చేయంగా నటుంచున్ మదిన్
బగ నామారుతి యింద్రజిత్తు నెదురం బర్వెత్తె రాఁగాఁ గపుల్. 99

ఇక నావానరసేన నింద్రజియుటన్ వీక్షించి యుల్కన్ భయా
నక ఖడ్గం బొరనుండి దీసికడు దైన్యస్వాంతయై యున్న జా
నకి జుట్టున్ గ్రహించి వాటు గనుచుండన్ రామరామాయటం
చకటా యేడ్చుచునుంత గొట్టఁ గపి దైన్యం బొంది దుఃఖింపఁగన్. 100

రాము పట్ట మహిషియు ప్రాణదయిత
చారు సర్వాంగియౌ సీత తీరు చూచి
అలుకతో మండిపోయియా హనుమ యపుడు
ఇంద్రజిత్తుతో వేగమె యిట్టులనియె. 101

ఓదురాత్మ! నీవుక్షయంబు నొందు కొఱకు
ఇట్టి లేమను జుట్టును పట్టుకొనెదు
నీవు బ్రహ్మర్షు లింట జన్మించి కూడ
నిట్లు రాక్షస గృహమాశ్రయించినావు. 102

బుద్ధి గడ్డి ని యిటు పాపుండ వైతి
క్షుద్ర! పాపపరాక్రమ క్రూర! దుష్ట!
ఛీ! యిటుల నీదు కర్మను చేయుచుంటి
నిర్ఘృణా! నీకుఘృణలేదె నీచబుద్ధి! 103

ఇంటనుండి రాజ్యమునుండి యిటుల వెడల
గొట్టఁబడి రాముచేతి నుండి కూడ జాఱి
ఏమి నీకుఁ గావించెరా యిట్టు లిపుడు
ఈమెను వధింపఁ బూనితివేల! నీచ. 104

సీతఁ జంపఁబ్రదుక లేవు క్షితినిచిరము
ఇట్లు చంపఁ దగనది గావించి
రాము చేతిలోఁ బడితి వనార్య! బ్రదికి
ప్రాణులతోడఁ బోలేవు పరమనీచ! 105

అటుపైఁ బైఁబడు క్రోధి సేనలను మాటోప మేపార ను
ద్భట నౌద్ధైత్యాల సేనలడ్డి నపుడున్ దద్వానర శ్రేష్ఠుఁ డు
ద్భటుఁడౌ మారుతిఁ గాంచి బాణములుపేల్ వర్షించి యం
తటన్నాయింద్రజి మారుతాత్మజునితో వాక్రుచ్చె నీరీతిగా. 106

ఎవతె కోసము సుగ్రీవుఁడీవు రాముఁ
డిక్కడకు వచ్చిరో యట్టి యాలతాంగి
సీత నిప్పుడె నీవు వీక్షించు చుండ
చంపివైచెదఁ జూడుమీ సత్వరముగ. 107

ఈమెఁ జంపి లక్ష్మణు రామునింక నిన్ను
వేగ సుగ్రీవు ఖలుని విభీషణునిదె
చంపెదను వానరా! స్త్రీలఁ జంపరాద
యంటి, వరివొంచునది చేయనర్హమె సుమి. 108

ఇంద్రజిత్తిట్లు వల్కుచు నేడ్చుచున్న
మాయమయియైన సీతను మంచివాడి
యైన కత్తిచే స్వయముగ నపుడె కొట్టె
నామె జందెముఖు పడె దీనాత్మ యగుచు. 109

వ. ఇట్లు ఇంద్రజిత్తు ఆమెను జంపి హనుమంతునితో నిట్లనెను. ఇదిగో నేను రాముని భార్యను కోపముతోఁ జంపితిని ఆమె చనిపోయినదె. కాన నింక మీశ్రమయంతయు వ్యర్థమె "అని యింద్రజిత్తు పలికి రథమెక్కి గర్జించెను. అంత దగ్గఱనున్న వానరులు ఆగర్జన ధ్వనిని దుర్గమగు రథమును ఆశ్రయించి హృష్టుడై యున్న యింద్రజిత్తును చూచి విషాదముతోఁ బరువులెత్తిరి. 110

పెను వజ్రాయుధనాద మట్లు భయదంబే యైన యా యింద్రజి
త్తుని నాదంబును నాలకించి కపులెంతో భీతిఁ బర్వె త్తగా
హనుమంతుం డది తెల్సి దీనముఖులౌనా వానరశ్రేష్ఠులన్
గని తానిట్లనె దీనులై యెటకు వేగన్ పాఱుచున్నారసీ! 111

అని కుత్సాహము చూపరేల భవదీయుంబైన శౌర్యం బెటుల్
చని యెన్ ముందుకుఁబోవు నన్ననుసరించన్ రండిటుల్ పాఱిపో
వను మీవంటి కులీన శూరులకు నావంతేని మర్యాదయే
యునె నా మారుతి ధీరవాక్కులకు వా రానందమున్ పొందుచున్. 112

గిరిశృంగంబులు కొండలన్ కరములం గీలించి గర్జించి వా
నరు లుత్సాహముతో ముదానఁ గడు హన్మన్‌జుట్టిగొంచున్ భయం
కర యుద్ధావనికేగ మారుతియు వేగన్ మండు భీమాగ్నియై
యరిసేనన్ దహియించె నట్టి ప్రళయాగ్నిన్ యమున్ బోలుచున్. 113

ఒకపై పుత్రగతఁగ్రుద్ధు డౌచునొకపై పుద్దామ శోకంబునన్
వికలుండై కడు నింద్రజి ద్రధముపై వేగన్ హనుమంతుఁడే
యొక భీమంబగు బండఱాయిగొని యెంతో బల్మి పై వంగ నా
వికటం బౌ శిలఁ జూచి సూతుడు రధంబే ద్రిప్పె దౌదవ్వుగా. 114

ఎపుడైతే నరదాన సూతుఁ డటు దవ్వేగెన్ కడున్ శీఘ్రమే
అపుడే యా శిల భూమిఁద్రెళ్ళి మిగులన్ వ్యర్థంబుగాఁ గూలగా
అపుడందున్న నిశాచరుల్ క్రుధను యుంపే నుండిపోవగా
నపుడా వానరులంతఁ జెట్లు శిల లత్యంతంబు వర్షించుచున్. 115

అని ఘోషించుచుఁ గేకలేయుచుఁ గపుల్ ప్రౌఢోద్ధతిన్ పోరుచున్
రణభూమిన్ విహరించి రాక్షసుల శౌర్యంబొప్ప మర్దింపగాఁ
గని యా యింద్రజి యాయుధంబుగొని వీకన్ గ్రుద్ధుఁడై శత్రుసే
న నెదుర్కొంచు శరాలఁ గ్రుమ్ముచును దున్మన్ సాగె దైత్యావళిన్. 116

కరవాలంబులు పట్టిసంబు లశనుల్ గైకొంచుఁ గూటాలు ము
ద్గరముల్ త్రిప్పుచు రాక్షసుల్ కపుల వేగంగొట్టి దైత్యాళిసె
ల్లరతోడం హనుమంతుఁ డెన్నొ గిరిసాలాల్ పట్టి యుద్ధంబు భీ
కర రీతిం బొనరించి యుద్ధుకొనుచున్ వక్కాణించె ఏరాళితో. 117

వ. ఓ వానరులారా ! మీరు రామునికిఁ బ్రియంబు చేయ ప్రాణములు నైన లెక్కకుఁ గొనక యెవ్వరికై యుద్ధము చేయుచున్నారో యా జానకి చంపఁబడినది. ఈ సంగతి రామునికి సుగ్రీవునికి విన్నవించి దీనికి బదులు ఏమి చేయవలెనో పిదపఁ జేయుదము" అని పలికి తన వానరుల నెల్లరను యుద్ధమునుండి వారించఁగా నా వానరసేన లన్ని మెల్లమెల్లఁగా మరలెను. ఇట్లు రాముని దగ్గఱకుఁ బోవుచున్న హనుమంతుని జూచి యాగము చేయఁ దలఁచి నికుంభిల యనుపేరు గల దేవాలయమునకు ఆ దుష్టాత్ముఁ డైన యింద్రజిత్తు మరలి యట నికుంభిల నధిష్ఠించి యగ్నిని వ్రేల్చఁదొడఁగెను. మాంస శోణితము భుజించుచు నగ్నిహోత్రము యథావిధిగా హోమము చేయఁబడుచు జ్వలించెను. హోమ శోణితములచే తృప్తి పొంది తీవ్రముగా అగ్ని మండెను. అప్పు డాయగ్ని సంజ కెంజాయగల సూర్యునివలె నుండెను. అంత యుద్ధములతో కృత్యాకృత్యములఁ దెలిసిన రాక్షసులు ఆ హోమమును జూచుచు అటనే యుండిరి. 118

రాముఁడుగూడ నంత విపులంబగు దైత్యుల సేనఁ జూచి సం
గ్రామ నినాదముల్ వినుచుఁ బ్రక్కనె యుండిన జాంబవంతునిం
కిట్లనెఁ బల్కె సౌమ్య ! యిదె యిప్పుడు మారుతి దుష్కర క్రియన్
ఆ మహి చేసియుండు విను మల్లనె భీమపు టాయుధ ధ్వనుల్. 119

కనుకన్ నీవు బలంబుతోఁ జని, యనిం గావించు నా వాయు సూ
నునికిం సాయము చేయు ఋక్షవిభు ! యన్నుం రాముఁ డాడనమరు
త్తనయుం డుండిన కోట పశ్చిమదిశా ద్వారంబు ఋక్షేశుఁడుం
గని, నిట్టూర్చుచు పోరివచ్చు కపి సంఘంబున్ పథిం గన్గొనెన్. 120

ఇటు లా వానరరాజుతోడఁ ద్వరగా నేతెంచు నా హన్మయుం
తట సాయానికి వచ్చు ఋక్ష బలమున్ మర్లించి యారాము చెం
గటకున్ శీఘ్రమె వచ్చి యిట్లనె రిపుఘ్నా ! రామ ! మేమెల్ల సం
డటఁ బోరాడుచునుండ మా యెదుట నేమయ్యెంగదో విన్మిటుల్. 121

ఎల్లరము మేము కనుచుండ నింద్రజిత్తు
ఏడుచున్న సీతనుపట్టి యిట్టె చంపె
గని యదియు మా మనసులు కంగారుపడగ
చింత, మనవి చేయంగ వచ్చితిమి యిటకు. 122

అని యా మారుతి చెప్పఁగా వినుచు దివ్యజ్యోతి రాముండు చిం
తను మూర్ఛిల్లియు మూలమున్ నఱక గ్రిందం గూలు వృక్షంబు లా
గునఁ గూలంగని నల్గడన్ గపు లటన్ గుంపౌచు పర్వెత్తి రా
మునిపైఁ జల్లిరి యబ్జగంధులు జలమ్ముల్ మండు నగ్నిం బలెన్. 123

త్వరగా లక్ష్మణుడంత బాహువుల భ్రాతన్ రాముఁ గౌఁగింట న
త్తఱి వేఁగ్రుచ్చుచు స్వస్థతం గనని భ్రాతం గూర్చి హేత్వర్థసం
భరితం బౌనటు పల్కె "నన్న ! శుభమౌ మార్గంబునం దుండు నిన్
వరబుద్ధిన్ విజితేంద్రియున్ ధరణిఁ గావంజాల దీ ధర్మమున్. 124

జంగమ స్థావరంబులు జగతిలోన
మనకుఁ బ్రత్యక్షమగుఁ గాన నవ్వి కలవు
వానివలెఁ ధర్మ మెపుడుఁ గన్పడమ గాన
ధర్మమే లేనిదిది నా మతంబు సుమ్ము. 125

స్థావరము లెట్లు ప్రత్యక్షమై వెలుంగు
అట్లె జంగమంబులును ప్రత్యక్ష మగును
ధర్మ మట్లు ప్రత్యక్షమై తనర దెపుడు
అదియె యున్న నిబోటులాప దనె గనరు. 126

ఇక నధర్మ మన్నదె యున్న యెడల నెపుడు
రావణుఁడు పడి నరకాన మ్రగ్గవలదె
ధర్మ మాచరించెడి నీవు ధర్మ మున్న
నిట్టు లిన్ని పాటు లనుభవింపవు గద. 127

వాఁడు నెన్నఁడైనను కష్టపడుట లేదు
నీవొ యిట్లు పాటు లనుభవించుచుంటి
అందుచే ధర్మమె యధర్మ మగుచు నుండె
ధర్మమొ నధర్మమె విరుద్ధంబు గాఁగ. 128

ధర్మమున ధర్మఫలం బది తనరు నెడల
ఆ యధర్మమున నధర్మ మగు ఫలంబు
గలుగునెడ నధర్మము చేసి వెలయు వారు
నిల నధర్మఫలపు బాధ నెనఁగి యుంద్రు. 129

వ. ధర్మముచేత ధర్మఫలమగు సౌఖ్యమె పొందినచో జనులు అధర్మరతు లెందు కయ్యెదరు ? అధర్మమునకు ఫల మగు కష్టము కలుగుచున్నచో అధర్మము చేయుకుందురుగదా. ధార్మికులు కానివారి యర్థములు సిద్ధించుచున్న వి ధర్మశీలురు బాధ పొందుచున్నారు. కావున ధర్మాధర్మములువాస్తవములు కావు. వాని ప్రకారము నడచుట నిరర్థకము. పాపము చేసిన వారు అధర్మమైనరూపవ క్రూర కర్మచే బాధింపఁ బడుదు రని యనినచో ఆ యధర్మ కర్మ గూడ ఎంతో కాలము ఉండదు. ఉన్నచో మూఁడు క్షణా లుండును. అంతకంటె ఎవడు ఎప్పుడును ఉండని యధర్మముచే నతనిని బాధించును. పోనీ విధిచే వీడు వధింపఁ బడును. ఇదియే అన్యుని బాధించును అన్నచో అపుడు ఆ విధికే ఆ కర్మ అంటుకొనును గాని కర్తకు అంటుకొనదు. అరిదమునుని అదృష్ట కారణమైనది యప్రత్యక్షమైన లేనిదైన పదార్థమును అయిన ధర్మముచేత శ్రేయస్సు పొందుటకు ఎట్లు శక్యమగును ? 130

ఓ సత్పురుషశ్రేష్ఠ! ధర్మమనెడు సత్పదార్థమన్నది యున్నచో నీకు అసత్తు అనఁగా అనిష్టము కొంచెముగూడ రాక యుండవలసినదే. నీవిటువంటికష్టము అనుభవించుచున్నావు గనుక సత్పదార్థము అనగా ధర్మము ఉన్నదని దాని వల్ల సత్ఫలితము గలుగునని తలఁచుట సరియైనదిగాదు. పోనీ అందుకని యూ

దుర్బలుడయిన కాతరుడు ధర్మమె బలమని దానిని అనుసరించును. కనుక స్వర్గాదుపులగా ధర్మమె ఫలప్రదమగునను దుర్బలుడు సేవింప దగ్గవాడు కాడని నా యాశయము. పరాక్రమములో బలముకంటె ధర్మము అంత ముఖ్యముగాదని నీవు తలతువేని ధర్మకుననమాని ధర్మమువిషయములో నీవి పుడు వర్తించుచున్నయట్లే బలమువిషయములో వర్తింపుము. సత్యవాక్యమె కనుక ధర్మమయినచో ఓ పరంతపా! మొదట తండ్రి నీకు పట్టాభిషేకము చేయుదుమని పిదప రాజ్యమునుండి వెడలగొట్టి అనృతవాక్యమాడి కరుణలేని వాడయ్యెను. ఆతండ్రిని నీవేల బంధింపకైతివి? ధర్మమెగాని అధర్మమె ఆచ రించదగనిదయినచో అప్పుడు ఇంద్రుడు విశ్వరూపుడను మునినిజంపినమైనను యాగము జేయకుండ నుండియుండవలయును. లేక ఒక్కయాగమునే చేసి యుండవలసినది. అధర్మమె చేయవలసినచో అపుడు మునినిజంపి యాగమును చేయక యుండవలసినది. ఒకవధనె చేసియుండ వలసినది. లేదా కాలమును బట్టి రెంటినయినను చేసియుండ వలసినది. అధర్మమును ఆశ్రయించిన ధర్మమునుగాని, ధర్మమును ఆశ్రయించిన యధర్మమునుగాని కర్తను నశింప జేయును. కనుక ధర్మాధర్మములకు సంబంధించిన సర్వకర్మలు నరుడుస్వేచ్ఛ ప్రకారము చేయుచున్నాడు. కనుక అన్నయ్యా! స్వేచ్ఛగా మన యిష్టము వచ్చినట్లు చేయుటయే ధర్మమని నాయుద్దేశము. అప్పుడు రాజ్యమును వదలి పెట్టి నీవు ధర్మమూలమును భేదించితివి. అందువల్ల అప్పుడప్పుడు ప్రాప్తించి వృద్ధిపొందిన యర్థములనుండి పర్వతములనుండి ప్రవహించు నదులవలె దానాది క్రియలు ప్రవర్తించును. అర్థములనుండి విడిపోయిన యల్పతేజసుగల వాని నుండి గ్రీష్మమున చిన్నకాలువలువలె సర్వక్రియలు విచ్ఛిన్నమగును. కనుక సుఖముగా పెరిగినవాడు ప్రాప్తించిన యర్థమును పరిత్యజించి సుఖములను గోరుచు అన్యాయాది పాపములను చేయును. అపుడు వానికి దోషము సంభ వించును. కనుక—

వేనికి నర్థము లుండునొ
వానికె స్నేహితులు నుండ్రు బంధులు గూడన్
వేనికి నర్థములుండునొ
ఆ నరుఁడే జగతిఁ బురుషుఁ డతండె బుధుండున్. 132

వేనికి నర్థము లుండునొ
వానిదె విక్రమము వాడె పరబుద్ధియు నె
వ్వానికి నర్థములుండునొ
యానరుఁడె మహాగుణుఁడు మహాభాగుండున్. 133

ఏనరుఁ డర్థము విడునో
యా నరునకు నర్థములివి యుగునని యుందున్
ఈనిఖిలరాజ్యము విడు
ఈ నీమతిచేత వచ్చెనిటు లీపాటుల్. 134

అర్థమెవనికి నర్థ కామార్థమగునొ
అతనికన్నియు ననుకూలమై యొసంగు
ధనములేనట్టి యర్థకామునికి శ్రేయ
మరసి వెదకినన్గాని శక్యంబుగాదు. 135

దమమున్ దర్పము సుక్రోధము
శమమున్ గామంబు ధర్మ సంతోషము ల
ర్థము వల్లనేయివి సమ
స్తమును ప్రవర్తించుఁజుమ్మీ ధరణీనాథా! 136

దొరికిన యర్థాలు వడిచి
ధరలోఁ జరియించునట్టి ధర్మాత్మునికె
త్తఱి నర్థమ్ములుచెడు నం
బరమున దుర్దినమున గ్రహపంక్తులు వోలెన్. 137

పితృవాక్పరిపాలనచే
క్షితి రాజ్యము విడి యిట్లుచెడి వనిఁదిరుగన్
దితిజునిచేతన్ బ్రాణద
యితయును నీరీతి నపహరింపఁగఁ బడియెన్. 138

వ. కనుక వీరా! నేనిపుడే యింద్రజిత్తుచేసిన మహాదుఃఖమునకు ప్రతీకారముగ వీరవిహారముచేసి యీకష్టమును దొలగించెదను. రామ! లెమ్ము. నరశార్దూల! లెమ్ము. దీర్ఘబాహూ! దృఢవ్రతా! లెమ్ము. మహాత్ముడవై నీయాత్మను నీవెఱుఁగకున్నావు. ఇదిగో ఇప్పుడే నీ ప్రియమునకై జానకిమరణమును తలచి నేను రథరాజ గజ రాక్షస సహితముగా లంకను నాబాణములచేఁ బడగొట్టెదను. 139

తగ సౌమిత్రియు భ్రాతృవత్సలత భ్రాతన్ రామునోదార్చుచుం
డఁగ నావేళ విభీషణుండు కపిసేనన్ వ్యూహముల్ దీర్చి న
ల్వగు పల్కాటుక ప్రోగులోయనుగజాలన్ గూడి హస్తీంద్రుడ
ట్లుగ నానాయుధులౌ నమాత్యులును నల్వుర్ రాఁగవచ్చెన్ వడిన్. 140

అయిలవచ్చి లక్ష్మణు నొడియుందునోలి
యార్తి భరమునస్రుక్కు మహాత్ము రాము
బాష్ప పర్యాకులాక్షులౌ వానరులను
కని యిదేమని వెత విభీషణుఁడు పలికె. 141

ఆ విభీషణుమోము సుగ్రీవుఁ గపుల
సరసి లక్ష్మణుఁడనె నశ్రుభరముఖాన
ఇంద్రజిత్తు సీతనుజంపె నిపుడయనుచు.
హనుమచెప్ప రాముఁడు మూర్ఛనందె సౌమ్య. 142

ఇటుల సౌమిత్రి యనుచుండ నతనినాపి
యావిభీషణుఁడనె రాజ! హనుమ యేది
చెప్పినది నిజంబని నేనొప్పుజుమ్మి
జలధి యెండిపోయెనటన్న పలుకువోలె. 143

అ దురాత్ముఁడౌ రావణు నాశయంబు
నెఱుఁగుదును మహాభుజ! సీత నెప్పుడైనఁ
బంపఁ బూనడు సీతఁ ద్యజింపు మనుచు
హితము నేఁ జెప్పినను నొనరింపఁడట్లు. 144

దానమున సామమునను భేదానఁ గాం
ఆమెను గనుటకైన శక్యంబు గాదె
ఇంక రణమునఁ గాని యేయితరుఁడైన
అమె నెటుదరియఁ గలండు భూమి పయిని. 145

వీఁడు వానరులను మోహపెట్టి వేగ
నట నికుంభిల పేరుతో నరుల చైత్య
మునకుఁ జనెనందె యింద్రజిత్తును జపించి
హోమమునుజేయగఁ గలఁడుహూత వహునికి. 146

అతడె గనుక హోమముచేసినట్ల యైన
నింద్రుతోఁగూడ దేవతలేగుదెంచి
పోరినను రావణసుతుండు పోరునందు
ఎదురుకొన రానివాఁడె యోచించిచూడ. 147

ఈతడిఁక మోహపెట్టుచు నిట్లె మాయ
పన్నినాఁడిట్టులైనచో వానరులకు
విక్రమమ్ము చూపుటలోన విఘ్నమగును
అనితలచి యిట్లు గావించెననుచు నెఱుఁగు. 148

ఇంద్రజిత్తుయాగ మది పూర్తి సెనయకుండ
సైన్యములతోడఁ జనుదము సత్వరముగ
ఈ మనుజవర్య విడుమిట్లు వృధగ తావ
మెసగెఁ గుందు నిన్ గనఁగ క్షీణించు బలము. 149

రామ ! స్వస్థచిత్తుఁడ వయి ప్రబల శక్తి
వగుచు నిటనుండు లక్ష్మణు నంపు మిపుడె
ఇతఁడు సేనతోఁ జని యమ్ముతేసి వాని
హోమము చెఱచు నంత వధ్యుండె యగును. 150

అతని తీవ్రమౌ వాడియౌ నెల్ల శరము
లతని నెత్తురి ద్రాగును పక్షులట్లు వేగ
కనుక నిపుడె మహాబాహు ! వినుత లక్ష
ణుఁడగు లక్ష్మణుఁ బంపు నింద్రుఁ డశని నటు. 151

కాలమింక మనుజవర ! గడపవలదు
రిపుని ఁజంప వేళ యిదె యిమ్మిపుడె యాజ్ఞ
అతఁడె యిష్టి ముగించిన నతఁ డదృశ్యుఁ
డయి సురాసురుల కవధ్యుఁ డగును జుమ్ము. 152

ఆర్తిచేతఁ జిక్కిన రాముఁ డా విభీష
ణుని వచస్సుల విని యేమి యొనరుపవలె
నొస్ఫుటంబుగ నెఱుఁగంగ నోపక ధృతి
గనియు గూర్చున్న యా విభీషణుని కనియె. 153

దనుజ విభు ! విభీషణ నీవె యనిన మాట
తిరుగఁజెప్పు నీ భావము నెఱుగఁ దలఁతు
అనుచు రాముఁడు పల్కె వాక్యజ్ఞుఁడైన
యా విభీషణుఁడనె నంద ఱాలకింప. 154

ఓ మహాబాహు ! సైనికవ్యూహ రచన
నీవు శాసించినటు లాచరించినాను
ఆ బలములెల్ల నెల్లెడ ననువుగాను
భాగములు చేసి కూర్చిపైచినాను. 155

ఇకను విన్నవించవలసిన దెంతొ కలదు
ఓ మహాయశుడ ! వినుమి యేమి హేతు
వుండకయె నీవు తపియింప నున్న కపులు
నేము తాప మొందితిమి త్యజింపు వ్యథను. 156

అరుల సంతోషపెట్టు నీ యార్తి విడుము
వీర ! యుద్యమింపుము ముదంబీవు పొందు
సీతనె గనుక పొందవల్సినద యేని
వినుము చెప్పెద నాదగు మనవి వినుము. 157

ఇపుడె సౌమిత్రి చక్కఁగా సెల్లబలము
తీసికొని నికుంభిలఁ జేరి తీవ్రమైన
పామువంటి బాణములేసి యాధ
నుర్ధనుం డింద్రజిత్తును దునుముఁగాక. 158

అట్టి యింద్రజిత్తు తపంబు నాచరించి
బ్రహ్మవరమున బ్రహ్మశిరంబు నాఁగ
అస్త్ర మొకటి పొందెను వాని యశ్వములును
కామగమనంబు గలవి సుమ్మో మహాత్మ ! 159

ఇంద్రజిత్తు సేనలతోడ నిదె నికుంభి
లకు వెడలె నట యగ్నిహోత్రమున వాఁడు
వ్రేల్చి లేచినచో నింక వినుమి యెల్ల
మనము హతులమౌదు మని యెదను తలఁపు. 160

"ఆ నికుంభిలకును పోక యగ్నియందు
హోమమును జేయక రిపు వధోద్యమందు
చేయఁబోయెడిని న్నింద్రజిత్తు! ఎవఁడు
చంపునో నాఁడె నీ వినాశంబు కలుగు". 161

అని మహాబాహు ! యా భువనధిపతియు
వరమునిచ్చెఁ గనుక నా వధయు నిట్లె
జరగవలెఁ గాన లక్ష్మణుం డరుగఁ బంపు
వాఁడు చావఁ జచ్చినట్టె రావణుడు గూడ. 162

ఇటు విభీషణుఁ డన రాముఁ డిట్లు పలికె
సత్యవిక్రమ ! యా రౌద్రు సకలమాయ
లెఱుఁగుదును నా మహాబలుం డెంతొ మాయ
కాఁడు బ్రహ్మాస్త్ర మెఱుఁగును వాడు పోర. 163

వరుణుతోఁగూడు సురల సంగరమునందు
స్మృతి విహీనులఁజేయును మింటియందు
మబ్బులవి క్రమ్మ సూర్యగమనము వోలె
వానిగతి నెఱుంగము రథంబునందు తిరుగ. 164

వ. అంత దురాత్ముఁడయిన శత్రువు మాయాశక్తిని తెలిసికొని రాముడు కీర్తిసంపన్నుడగు లక్ష్మణునితో నిట్లనియె "లక్ష్మణా! ఈ వానరేంద్రుని బలముతోడ హనుమంతుఁడు మొదలగు యూధపులతోను ఋక్షపతియగు జాంబవంతునితోను వెళ్ళి మాయాబల విశారదుడఁగు రాక్షసకుమారుని జంపుము. మహాత్ముఁడయిన విభీషణుడు ఆ ప్రదేశమెరుగును కనుక తన మంత్రులతో నీ వెనుకగా వచ్చును" అని రాముఁడు చెప్పగావిని విభీషణుతో బయలుదేరి అత్యద్భుత పరాక్రమము గలవాడై తన శ్రేష్ఠమైన బంగారు ధనుస్సును గ్రహించి కవచముతొడిగి ఖడ్గముశరములను గైకొని రామునిపాదములకు నమస్కరించి సంతోషముతో రామునకిట్లనియె. ఇపుడె నావింటి నుండి విడువఁబడినశరములు

రౌద్రుండయిన రావణకుమారునిజీల్చి సరసిలోకి హంసలవలె లంకను ప్రవేశించి చంపగలవు. అనిపలికి ద్యుతిమంతుడయిన లక్ష్మణుండు అన్న యెదుటనే యింద్రజిత్తును జంపంగోరి త్వరగా బయలుదేరి పిదప మరల అన్నపాదముల వ్రాలి ప్రదక్షిణముచేసి అన్న శుభప్రయాణ సన్నాహముచే విభీషణునితో వెళ్ళెను. అట్లు వీర వానర సహస్రములతో సాహాత్యుడగు విభీషణునితో అంగదునితోడను ఋక్షబలముతోను గూడ తనబలమును దారినడచినపిదప వ్యూహములుగా వన్నబడిన రాక్షసరాజు బలమును సుమిత్రానందనుడగు లక్ష్మణుండు చూచి ఈ యింద్రజిత్తు మాయకాడనితెలిసి ధనుర్ధరుడై బ్రహ్మచెప్పిన ప్రకారముగా నికుంభిల హోమము పూర్తికాకముందే శస్త్రములతో ప్రకాశించుచు ధ్వజములతోనిండి గహనమై మహారథములతోఁ గూడిన శత్రుబలమును చీకటిని వలె ప్రవేశించెను. 165

పిదవ రావణుభ్రాత విభీషణుండు
శత్రువుల కహితముఁగ లక్ష్మణుని కనియె
అదిగొ మబ్బులవలె నల్లనగు దైత్య
సేన కనిపించుఁ గపులతో దానిఁబోరు. 166

ఈ మహా దైత్యసేన భేదింపఁబడిన
నింద్రజిత్తు కండ్లకుఁ గానిపించుఁ జూడు
అతని యాగము పూర్తికానంతలోనె
యీవు వజ్రాభ శరముల నెదురుకొనుము. 167

మాయయే గొప్పధర్మమై మదిని దలచు
నధికుఁ గ్రూరు సర్వజగ ద్భయంక రాత్ముఁ
జండుఁ జంపుమని విభీషణుండు పలుక
రావణేపయి లక్ష్మణుడు శరాలు కురిసె. 168

తరువుల్ గోళ్ళును నాయుధాలగు కపీంద్రశ్రేణిబుక్షావళుల్
తరులన్ గొండలఁగొంచుఁ బర్వి కడ దైత్యవ్రాతముం బాణతో
మరముల్ శక్తులు తీసికొంచు గపులన్ బ్రమందిపం బైబ్డేఱ సం
గరమెంతో తుములంబ యయ్యె కపిరక్షశ్రేణి పల్ఘోషలన్. 168

తరుశైలంబులచే శితాస్త్రములచేతన్ శస్త్రబాణాల సం
బరమెల్లం గడునిండిపోయె దనుజుల్ బాణమ్ములన్ శస్త్రినుల్
తఱుచొప్పం గురిపించి భీతికరయుద్ధంబంత గావింప వా
నరులున్ చెట్లను సద్రిశృంగ తరులన్ వర్షించి రత్యంతమున్. 169

అతికాయుల్ ఘనశూరులౌ కపులుబుక్షాళుల్ వడిన్ క్రూరులౌ
దితిజవ్రాతముఁ జంపుచుండఁ గడుభీతిక్లేశముల్ గల్గుటన్
దితిజాధ్యక్ష కుమారు డింద్రజియుఁ దత్సేనన్ విషాదపున్
స్థితినుండన్గని లేచెయాగమది పూర్తి జెందకే యుండగన్. 170

తరు గాఢాంతమంబునుండి కడుఁ గ్రోధంబెచ్చ నాయింద్రజి
త్తు రథంబెక్కి భయంకరోగ్ర ధనువుల్ దూర్ణంబ చేదాల్చియున్
అరుణాస్యాక్షుల రెచ్చియుంతకుఁడౌ నా నాదేశమే పార ను
ద్ధురుఁడై రాఁగని లక్ష్మణాహతులు దైత్యుల్ నిల్చిరంతన్ ధృతిన్. 171

అపుడు హనుమ దుర్వారమైనట్టి చెట్టు
నెత్తి యద్రిసముడయి దైత్యేంద్రు సేన
నింకగాని చెట్టులతోడ నెదురుకొనుచు
స్మృతియె లేకుండఁగొట్టి గర్జించి మించె. 172

అటుల హనుమంతుడా సేన సణచుచుండ
శక్తిధరులు శక్తి తతిచేఁ జక్రధరులు
చక్రములచేత నొకరు పట్టిసములచేత
గదలఁ బరిఘలఁ గొట్టిరి కదనమందు. 173

పరశుల్ తోమరముల్ శతఘ్నులు గదల్ వజ్రాభముష్టుల్ మహో
కఠ వాలంబులు భిండి పాలశరముల్ కాలాయసంబైన ము
ద్గరముల్ గైకొని రాక్షసుల్ మిగుల గోత్రాకారు నామారుతిన్
పరి వారించియుఁ గొట్ట నాతఁడు త్రుటిన్ వారించి పోరెన్ గడున్. 174

వ. అపుడా యింద్రజిత్తు తన శూరులను జంపుచున్న పర్వతమువంటి హనుమంతుని జూచి వీనిని ఉపేక్షించినచో మన రాక్షస క్షయము గావింపఁ గలఁడు కాన వీఁడున్న చోటికి రథము నడుపుము అని సారథితో చెప్పనాతఁడును పరమ దుర్ధర్షుఁడైన యింద్రజిత్తుతోఁ గూడ హనుమంతుడున్న చోటికి రథమును నడపెను. 175

అతఁ డంతన్ జని ఖడ్గశూల శరశస్త్రాసారముల్ వేగ మా
రుతి శీర్షంబునఁ జిమ్మ నాతఁడును నాక్రూరాస్త్రముల్ పట్టి యు
ద్ధృత రోషంబున నిట్లనెన్ గుమతి ! నీవే శూరుఁడై తేని పో
రితమున్ జేయుము మారుతిం దరిసి యోరీ పోవు ప్రాణాలతో. 176

అనిలో నీవిట ద్వంద్వయుద్ధమును జేయన్ గోరుదేన్ నేడు వెం
టనె యీ బాహులతోడఁ బోరియిఁకనీ వావేగమున్ సైచు మం
తనె నీవాసుర ముఖ్యుఁడౌదువన హన్మన్ గొట్ట విల్లెక్కి పె
ట్టిన యాయింద్రజితున్ విభీషణుఁడు నిట్లే చూచి జాగ్రతతో. 177

ఇటు పల్కెన్ మిఁద్రజిత్తిదె రథంబే యెక్కి యామారుతిన్
పటు చాపంబునఁ గొట్టఁ జూచుఁ ద్వరగా ప్రాణంబులం దీయు ను
త్కట శత్రుఘ్నములైన బాణతతి వేగన్వైచి యాయింద్రజిన్
పటు శౌర్యంబునఁ గొట్టుమంచు బలుకన్ బ్రాజ్ఞుండు సౌమిత్రియున్. 178

వెస విభీషణుఁడు రిపు విభీషణుండు
అనిన మాటలను విని మహాత్ముఁడగుచు
పర్వతముఁ బోలి రణమును భయము గొలుపు
నింద్రజిత్తును వీక్షించె నెంతొ శ్రద్ధ. 179

ఇటు విల్లాల్చిన లక్ష్మణున్ గొనుచు నెంతే హృష్టుఁడౌచున్ హుటా
హుటి ఆ దగ్గరనున్న గొప్ప విపినంబుత్సాహియై చొచ్చె యం
తట యాకర్మ, శితాభ్రతుల్య భయద న్యగ్రోధవృక్షంబు ముం
దటఁ జూపించి విభీషణుండనె నమందౌజస్వి సౌమిత్రితో. 180

ఇట భూతంబులకున్ బలుల్ వయిచితానీపైని యుద్ధంబు చే
యుటకై పూనును నప్పుడెల్లర కదృశ్యుండౌచు బాణాళిచే
పటుశక్తిన్ రిపుఁ జంపు మట్టి తరువున్ వాఁడున్ ప్రవేశింప నం
తటిలోఁ దద్రథవాజి సారథుల బాణాళిన్ వధింపంజనున్. 181

అటులే యంచు మహౌజసుండగు సుమిత్రానందనుం డంత ను
త్కట చిత్రంబగు విల్లుసాచి నిలవంగా వహ్ని వర్ణంబుతో
పటు మైనట్టి రథంబు నెక్కి ధనువున్ వర్మంబుమైఁ దాల్చి యు
ద్భటమౌ కేతువుతోడ నింద్రజియుఁ జెంతం గంటికిం గన్పడెన్. 182

ఇంతవఱకోటమే యున్న దెఱుఁగ నట్టి
యింద్రజిత్తుతో ఘనతేజమొనయు లక్ష్మ
ణుఁడనె నినుబిల్చుచుంటి రణోర్వి కిపుడె
సరి యయిన యుద్ధమును నాకొసంగు మింక. 183

—: ఇంద్రజిత్తు విభీషణుని నిందించుట :—

ఇటు పల్కన్ విని యావిభీషణు నటన్ వీక్షించి తేజస్వి యు
త్కట మానాన్వితుఁ డింద్రజిత్తనియె లంకం బుట్టి వర్ధిల్లి నా
విటు సాక్షాత్తుగా నాదుతండ్రికను జుండీవిట్లు నీబిడ్డకిం
తటి ద్రోహంబును పిన్న తండ్రి వయియుం గావింతువే రాక్షసా. 184

జ్ఞాతుల మన్న భావమును సౌహృదయంబును గాని జాతియేన్
భ్రాతృ సుతుండు వీఁడనిన బంధుతగాని స్వధర్మమేని నీ
వీతఱిఁ జూడ వెల్లమును వీడియు నన్యుని దాస్య మొంది దు
ర్నీతివి సాధునింద్యుఁడవు దృష్టుఁడ వైతె యధర్మ ! దుర్మతీ! 185

నీచబుద్ధిచే నెఱుఁగనేరవు నీవిటఁ దారతమ్యముల్
నీచ పరాశ్రయంబెచట నీస్వజనంబుల వాసమెచ్చటన్
చూచుటకున్ బరుల్ గుణాల చొప్పున స్వీయులు నిర్గుణాత్ములై
తోచినఁ గాని శ్రేష్ఠులవుదుర్ సుమిస్వీయులె; యన్యులన్యులే. 186

ఎతఁడు స్వపక్షమున్ విడిచి స్వేతరపక్షము సేవ చేయునో
అతఁడు స్వపక్షమున్ క్షయము నంద హతుండగు వారిచేతనే
దితిజుడ! యిట్లు నిర్దయత ధృష్టత చూపుచునుంటివే గదా
క్షితి స్వజనుండ వాప్తుఁడవు చెల్లెర నీకిటు రావణానుజా! 187

ఇటు భ్రాతృవ్యుఁ డనన్ విభీషణుఁడు తానీరీతి వాక్రుచ్చె ముం
దటి నా శీల మెఱుంగన ట్లిటుల నాత్మ శ్లాఘఁ గావించుకొం
దిటు, రక్షోవిభుపుత్ర ! నాదుగురుతన్ వీక్షించి పౌరుష్య మిం
తట వర్జింపు మనార్య ! నేనయితె జన్మంగంటి దైత్యుండనై. 188

క్రూరకర్ములౌ దైత్యుల కులమునందుఁ
బుట్టిననుగాని నరులలో మొదట గుణమె
ముఖ్యమగు; నాదు శీలమొ మొదటినుండి
రాక్షసుల శీలమేగాదు పట్టి చూడు. 189

దారుణపుఁ గర్మలందు నధర్మమందు
నా మనస్సెపుడు ప్రహర్షమంద కుండు
కనుక విషమశీలుండగు ననుజుచేత
ననుజుఁ డగు నేను నిరసింపనవుదు నెట్లు ! 190

వ. హస్తము నుండి పామును విడచి సుఖించినట్లు జనుఁడు ధర్మముల నుండి శీలమును జారిన పాప నిశ్చయుఁడగు పురుషుని వదలి సుఖించును. హింసకుని, పర ధనాపహర్తను, పరస్త్రీ గమనుని, దురాచారుని అంటుకొనిన యింటిని వలెఁ త్యజింపవలయు నండ్రు. పర ధనాపహరణము, పరస్త్రీ గమనము, సుహృదులందవిశ్వాసము యీ మూడు క్షయముగూర్చు దోషములు. మహర్షులను ఘోరముగా వధించుట, దేవత లందఱితో విగ్రహించుట, అభిమానము, కోపము, వైరిత్వము, ప్రతికూల భావము అను నా సోదరు నందలి దోషములు జీవితమును, ఐశ్వర్యమును నశింపఁజేయునవి. మేఘములు పర్వతములను వలె పై దోషములు గుణములను కప్పివేయును. ఈ దోషములను బట్టి నా యన్నయగు నీ తండ్రి విడవఁబడెను. ఇంక యీ లంక యుండదు. నీవు గాని నీ తండ్రి గాని యుండరు. ఓ రాక్షస ! నీవు దురభిమానివి, బాలుఁడవు, దుర్వినీతుఁడవు, కాలపాశముచే బంధింపబడి యుంటివి. నీ యిష్టము వచ్చినట్లు పలుకుము. ఇదిగో ఇప్పుడే నీకు వ్యసనముసిద్ధమైనది. ఇఁక నీవేమి యనగలవు ? రాక్షసాధమా ! ఇప్పుడు ఇంక ఆ వటవృక్షము ప్రవేశింపలేవు. రామలక్ష్మణులకు హాని చేసి జీవింపలేవు. రణములో నరదేవుఁడగు లక్ష్మణునితో యుద్ధముచేసి చచ్చి యముని ఇంట నరకయాతననుభవింతువులే. నీబలము చూపుము. నీ యాయుధములు బాణములును వ్యయపరుప నెత్తి ప్రయోగింపుము. లక్ష్మణుని బాణముల పాలయి ఇంక ప్రాణములతో దప్పించుకొనఁజాలవు. 191

ఆ విభీషణు పలుకులు నాలకించి
ఇంద్రజిత్తు కోపమున నోళ్ళెఱుఁగకుండి
వెసను నెగిరి యాయుధముల నసిని నెత్తి
నలుపు గుఱ్ఱాలు గల రథం బలరి యెక్కె. 192

మిగిలి కాలాంతక సముఁడై మిగులఁ బెద్ద
వాడిగల విల్లు సారించి వైరిఁ జంపు
బాణములు గొని రథమున వడిగ నలరి
అరి దమను డైనట్టి రామానుజుఁ గని. 193

ఇంద్రజిత్తు తేరున నలంకృతుఁడై యగుచు
హనుమ వీపునఁ దగి యుదయార్కు ప్రభలఁ
దనరు లక్ష్మణుఁడు విభీషణుని ప్రక్క
వఱలఁజూచి లక్ష్మణుఁ గపివరులఁ బలికె. 194

ఇదిగోఁ జూడుఁడు నా పరాక్రమము నిప్డే యీ ధనుర్ముక్తమౌ
పదునౌ నా శర వర్షమున్ దివముపై వానన్ బలెన్ వేపదే
పదె నిల్పుండెది చూత మిత్తజీని మద్బాహు ధనుర్ముక్తనౌ
పదనౌ నమ్ముల గాలి మాదిని వలెన్ బాధించు మీమేనులన్. 195

శరముల్ తోమర శక్తి ముష్టి ధనువుల్ సారించి మిమ్ముండఱన్
త్వరగాఁ జీల్చెద; హస్తలాఘవమె యొప్పన్ జిమ్ము బాణాల ముం
దర, గర్జించు మొయిళ్ళ ముందర వలెన్ ధైర్యాన నిల్చుండ నే
ర్తురె వీక్షించెదఁ గాక యెయ్యవొ భవద్వీర్య మిప్పట్టునన్. 196

మును రాత్రిన్ రణమందు వజ్రసమ మమ్ముల్ వేసి మిమ్ముం ధరి
త్రిని పై తన్యమె లేక పండునటులన్ లీలంగ గావించినాఁ
డను గాదే యది జ్ఞప్తి లేదె యది స్పష్టం బిందె పైఁబడ్డ పా
మును బోలెన్ నను లేప వచ్చితివి నేముం దంతకుం డాడుఁబో. 197

అని యా యింద్రజి యార్చి పల్క విని పేరల్కన్ భయుంబే యెలుం
గని సౌమిత్రియు నింద్రజిత్తుగని వక్కాణించెఁ గావింపఁ జా
లని కార్యంబులఁ గూర్చి రాక్షసుఁడ! బీరాల్ పల్కె దీ విట్లు, క
ర్మను గావించిరె కార్య మంతు గను నా మర్త్యుండె ధీమంతుడా. 198

పని గావింపఁగలేని హీనుడవు యెవ్వాడేని గావింపఁజా
లని కార్యంబును చేయు బీరములె చాలన్‌బల్కి సాఫల్యమొం
దిన యట్లెంతువు, యాజిఁ గన్పడకయే స్తేనుండవౌలెన్ పొన
ర్చిన శూరుండవు, వీరసమ్మతమ యెట్లేన్‌గాదయీ మార్గమున్. 199

ఇదిగో నీశరసాళి కెట్టయెదురై యేనుంటి రారమ్మి యీ
యుదనన్ నీపగు తేజ గన్పుటవుమీ వ్యర్థంబునిన్ మెచ్చుకొం
చెదొ యేదోకడు ప్రేలెదేలయున నెన్నేఁ బోరులంగెల్చు దు
ర్మదుఁడౌ నింద్రజి భీమచాపమును కేలంబట్టి సారించుచున్. 200

ఉరగంబుల్‌వలె వేగబోయెడి శరాలొక్కుమ్మడిన్ వేయ న
త్తఱి నాలక్ష్మణునవ్వి పొంది యహిబృందం బట్టులన్‌పోయి క్ర
మ్మఱి కొట్టన్ రుధిరంబుచేఁ దడిపి శ్రీమంతుండు సల్లక్షణుం
డురు శౌర్యుండగు లక్ష్మణుండలర జ్వాలోద్ధూమ వహ్నింబలెన్. 201

తన గావించిన యట్టి గొప్పకుఁ గృతార్థత్వంబు గొన్నట్లు గ
ర్గ్గాని గర్జించుచు నింద్రజిత్తరె నిటుల్ గ్రొవ్వాడియౌనా మహా
ఘన చాపచ్యుత బాణముల్ క్షణములోఁగా లక్ష్మణా! నీదు జీ
వనముల్ దీయును డేగనక్కలును రాబందుల్ పడున్ నిన్‌దినన్. 202

వ. మఱియు పరమ దుర్బుద్ధియైన రాముఁడు, క్షత్రబంధువును అనార్యుఁ డవును భక్తుడవు సోదరుఁడవునయిన నీవు రణములో నాచేఁజంపఁబడగానిపుడే చూచును. లక్ష్మణా! కవచము ముక్కలుకాఁగా భూమిపైని చాపముపడిపోగా తలలేని నిన్ను రాముడు చూచునులే.అట్లావేశముతో పరుషముగా పలుకుచున్న రావణు కొడుకయిన యింద్రజిత్తుతో యుక్తియుక్తముగా లక్ష్మణుడిట్లనియె ఓరి దుర్బుద్ధీ! వాక్శూరత్వముల్విడువుము. రాక్షస! నివు క్రూరకర్ముడవు. ఎందు కిట్లు ప్రేలెదవు. పనిచేసిచూపు. ఆచరింపక ఏల నిన్నునీవే పొగడుకొందువు. నేను నీవింతవాడవు అని నమ్మినట్లు పనిచేయుము. నిన్నేమియు పరుషములు

పలుకక ఆక్షేపింపక నన్నునేను పొగడుకొనక నిన్నిపుడె వధించెద చూడుము. అని లక్ష్మణుడు అని ఆకర్ణాంతముగా అయిదు శరములను పూరించి రాక్షసుని రొమ్మునకొట్టెను అపుడవి సుపత్రములతో సూర్యకిరణములవలె మండిన పాములవలె రాక్షసుని వక్షమునబడెను. అట్లు రావణాత్మజుండు లక్ష్మణునిచే గొట్టబడి రోషముతో మూడుబాణములేసి లక్ష్మణుని గొట్టెను. ఇట్లు సింహముల బోలి ఒకరినొకరు జంపగోరు యా లక్ష్మణేంద్రజిత్తులమధ్య భయంకరమైన యుద్ధముజరిగెను. వారిద్దరు బలసంపన్నులె. వారిరువురు విక్రమశాలులె. సర్వశస్త్రాస్త్ర కోవిదులయిన విక్రాంతులెఆయుభయులు. పరమదుర్జేయులై అసమాన బలతేజులయి ఆకాశమందలి గ్రహములవలె యుద్ధముచేయదొడగిరి. సింహములువలె శక్రవృత్రాసురులువలె ఎదుర్కొనరాక వారు పోరాడిరి. ఉత్సాహముతో నుప్పొంగి ఈ వీరసింహులిద్దరు వెనుదీయక పెనగిరి. వారు మేఘములవలె ఒకరినొకరు గెల్వగోరి ధనుర్ధరులయి శరవర్షముల గురిపించిరి. శబలిత వాసవులవలె ఆ యుద్ధకోవిదులు కత్తులు దండములు శస్త్రములు ధరించి పెచ్చుకొట్టుకొనసాగిరి. 203

## —: లక్ష్మణేంద్రజిత్తుల యుద్ధము :—

అరిదమునుండు లక్ష్మణుడు నమ్మును నెక్కిడి బుస్సకొట్టు పె
న్నురగము బోలె గ్రుద్ధుండయియొక్క మొగిన్దనుజేంద్రుం గొట్టనా
యురువగునారి ఘోషమును నాకొని యింద్రజి తెల్లంబోయిచె
న్నెఱు మొగమొప్ప లక్ష్మణుని నంతట మోమును నెత్తిగన్గొనెన్. 204

తెల్లంబోయిన యింద్రజిన్ముఖముం బల్ దీవ్రంపు యుద్ధంబుకై
యుల్లాసంబున నున్న లక్ష్మణుని యుద్ధోత్సాహముం జూచి సం
పల్లీలాప్తి విభీషణుండనె మహాబాహూ! వెసంగొట్టుమీ
యెల్లన్ రీతుల వీడు భగ్నుడయి ఘోషమైన్ సూచనల్ చెప్పెం జూ, 205

అవలన్ లక్ష్మణుఁ డెక్కుఁ పెట్టి యనలాఢ్యంబైన బాణంబులన్
సవిషంబౌ భుజగాలఁ బోలె విడువన్ శక్రాశని వ్రాతము
ట్లు వెలుంగొప్పెడి బాణజాలములఁ గొట్టన్ మూర్త మొక్కండె తా
స్వవశంబున్ విడి యింద్రియాలరుగ క్షోభం జెంది వేసోలియున్. 206

త్రుటిలో సంజ్ఞను పొంది యుక్కఁదన ముందున్నట్టి సౌమిత్రి నం
తట వీక్షించి కరంబు రోషమున నేత్రాలెఱ్ఱనై పోవఁబల్
కటు వాక్యంబులఁ బల్కె నీకయిపుడేజ్ఞప్తైతే దెతొల్తన్ మదు
త్కటమౌ విక్రమ. ముర్వి మీరిరువురున్ బన్నుండరే మూర్ఛతో. 207

స్మృతియేన్ లేదనుకొందు లేనియెడ నీరీతిన్ యమావాస మి
ట్టి తటిన్ పొందఁగ నన్నెదుర్కొనుట కిట్లే వత్తువే పోని నా
ధృతి శౌర్యంబును చూడవేని యిదె యిట్టే చూపెదన్ చూడు మం
చతిగా నింద్రజి గొట్టె హన్మఁ బడిటన్ సౌమిత్రి నేడమ్ములన్. 208

అవలన్ నూటిట నావిభీషణుని క్రుద్ధాత్ముండు కొట్టంగ ను
ద్ధవిడిన్ జేసిన యింద్రజిత్క్రమముఁ దత్సౌమిత్రి వీక్షించి తా
నవుచున్ రాక్షస ! యెంత మాత్రమిది సుంతైనా యెదీకాద యం
చు వడిన్ ఘోరశరాలు కూర్చివయిచెన్ శూరత్వ మేపారఁగన్. 209

"అనిలో శూరులు విక్రమింపరిటు నీయుస్త్రంబున్ చొప్పదం
ట్లన నొప్పెన్ శిథిలంబులై మెయికిఁ బూలట్టుల్ సుఖం బేయిడున్
అనిలో గెల్పునుగోరు శూరులిటులాయాజిం బొనర్తించు ల
క్ష్మణుఁ డంతన్ శరవర్షముల్ గురియుచున్ గర్జించె శౌర్యంబుతో. 210

ఇటు సౌమిత్రి శరాల నింద్రజి నెంతేఁగొట్టి యవ్వాని య
ప్పటి జాళ్వాకవచంబు ముక్కలుగ వ్రీల్పన్ మింటిపైఁ జుక్కల
న్నటు లొప్పెన్ గవచంబులేక పెను గాలేర్పడన్ చెట్ల మి
క్కుటమౌ పర్వతమట్టు లింద్రజి తగెన్ గొండాడు బాణాలతో. 211

శరవర్షంబులు లక్ష్మణుండు కురియన్ సంక్రుద్ధుడై యింద్రజి
త్తురుపౌ లక్ష్మణుమేని పెన్కవచమున్ తుత్తుండ్లుగాఁజేసె నొం
డొరులా వీరులునిట్లు కొట్టుకొని నిట్టూర్పుల్వడన్ రోజుచున్
శరపంక్తిన్ బ్రవితాఖిలాంగులయి పెల్చన్బోరి రయ్యాజిలో. 212

రణపాండిత్యముగల్గు వారిరువురున్ రౌద్రంబుగాఁ బోరుచున్
ఘన బాణంబులఁ గ్రుమ్మ్రుచున్ విజయమున్గాంక్షించి పోరన్మెలయాన్
నునుపౌ నెత్తురులుకార నేఁబులటులన్ బొల్పార గర్జించుచున్
పెను కార్మేఘములట్లు బాణములు వేవేకుర్విరత్యంతమున్ 213

ఇటు వారల్ రణమున్బొనర్పఁ గడు నెంతేఁ గాలమేయేగ వా
రెటు పెన్పోటుగాని పెన్శ్రమముగాని పొందరస్త్రజ్ఞులై
పటు శస్త్రాస్త్రములున్ శరాలు దిపై వ్యాపింపఁగాఁ జిమ్ముచున్
పటు యుద్ధంబునుజేసి రాకరలఘుత్వంబొప్పఁ జిత్రంబుగా. 214

తనువందేమి మమత్వమున్గనక సుంతన్ తప్పులేకుండఁ జ
క్కని ఫక్కిందుములంబపోర తలనిర్వాణాల ఘోషంబులున్
వినిపింపన్ వణకించుచున్ జనములన్ పెన్పిడ్గువోలెన్ సుదా
రుణకీర్తిన్ గడుఁబోర మబ్బులటు పోరున్ సల్పిరుగ్రంబుగా. 2,5

వ. వారిరువురు బంగారుపిడులుగల బాణములచే కొట్టుకొని వ్రణములతో రక్తము గారుచున్నను బలవంతులయి కీర్తిమంతులయి జయముపొందుధైర్యముతోనుండ ఆ బాణములు రక్తముతోఁదడిసి క్రిందబడి భూమినిజొచ్చినవి. కొన్ని శరములు ఆకాశమున అన్య నిశితశరములతో సంఘటితములయినవి. వేలకొలది శరములను ఇతరులువిడిచి ఛేదించిరి. ఆ యుద్ధము అపుడు బాణమయమయి ప్రకాశించుచు నెండగన్నులతోఁగూడ యాగమున గుశమయమైనట్లుండెను. వారిద్దరిదేహములు ప్రవీతములయి పువ్వులతోఁగూడిన శాల్మలికింశుకములవలె ప్రకాశించెను. ఇంద్రజిత్తు లక్ష్మణులు పరస్పరము జయమును గోరుచు

యుద్ధముచేసిరి. ఇంద్రజిత్తును లక్ష్మణుడు లక్ష్మణుని ఇంద్రజిత్తు పరస్పరము కొట్టుచు శ్రమమున్న దెఱుగక యుండిరి. శరీరమునను న్న బాణములచే వ్రణితులయి యుద్ధముచేసిరి. శరీరమునందుఁ గ్రుచ్చుకొన్న బాణములతో వారిరువురు వృక్షములతోఁగూడిన పర్వతములవలె ప్రకాశించుచుండెను. నెత్తుటిచేఁ దడిసినవయిన గాత్రములు మండుటగ్నులవలె ప్రకాశించెను. వారిరువురు యుద్ధముచేయ విముఖులుకాక యుద్ధముచేయుచుండ నిట్లు చాలకాలము గడచెను. వారిద్దరిలో యుద్ధవిముఖతగాని శ్రమగాని కనిపింపలేదు. మఱి సమరముఖమున నోడుట యెఱుగని లక్ష్మణునికి యుద్ధపరిశ్రమను తొలగించుటకై ప్రియము హితము గూర్చువాడయి విభీషణుడు మహౌజసుడయి యుద్ధమునకువచ్చి నిలుచుండెను. 216

రణభూమిన్ మదవారణంబులటు పోరన్‌రెచ్చి యాయింద్రజి
త్తును సౌమిత్రి పరస్పరంబు వధకై తూర్ణంబపోరన్ గనుం
గొనువాడౌచు విభీషణుండు రణరంగోర్విన్ వెసన్ నిల్చియున్
తన చాపంబును నెక్కుపెట్టి శరముల్ దైత్యాళిపైఁ గూరిచెన్. 217

అటుపై వహ్నులువోలె బాణములు యుద్ధాగ్రంబునన్ గాల్చుచున్
పటువజ్రంబటు కొండలన్ బలెను దైత్యాళిన్ వడిన్ వ్రీల్చుచున్
విటతాటం బొనరింపఁ దద్భటులు నావీర్యాగ్ర్యులౌ దైత్యులన్
పటుశూలాసి గదోగ్ర పట్టసములన్ బంపించిరంత్యేష్టికిన్. 218

తన దైత్యానుచరుల్ స్వపార్శ్వముల రాదైత్యావళిం గూల్ప వా
రణమధ్యన్ గజరాజటుల్ వెలయుచున్, రక్షోరణంబందుఁ గ్ర
న్ననుసత్సాహముచూపు వానరతతిన్ నడిప్పించుచున్ దద్విభీ
షణుడిట్టుల్ వచియించెఁ గాలవిదుడై సంగ్రామ రంగస్థలిన్. 219

ఇతఁ డొక్కండె నిశాచరాధిపతి కెంతే ముం బయ్యెడిన్
ఇతడే రావణుసేనలో మిగిలి తా నిట్లుండె వానరుల్
స్మృతి లేనట్టుల నట్లు నిల్చెదరు మీ రేల త్ముండెయౌ
నితఁడే కూలిన నింక రావణుఁడెగా కెల్లన్ హతంబయ్యెగా. 220

మును పుత్రుండు ప్రహస్తుఁడో వడె నికుండో ధరన్ గూలి పో
యెను ధూమ్రాక్షుఁడు కుంభకర్ణుఁడు వీక్షింపగా నేగి రే
మనుదున్ కుంభుఁడు జంబుమాలి మహాపార్శ్వుడున్ దీపి తా
శని వేగుండగు తీక్ష్ణవేగుఁడును నా సంగ్రామయుం గూలిరే. 221

వికటుండున్ తపనుండు నిఘ్నుడను పెన్ వీరాగ్నసుప్తఘ్నుడున్
ఇఁక వీరుండగు యజ్ఞకోపుఁడు దమ్రుండి వజ్రదంష్ట్రుండు ను
గ్రకరుండౌ ప్రఘసుండు జంఘుడు ప్రజంఘాఖ్యుండు నింకన్ నరాం
తక దేవాంతకు లగ్నికేతుడును దుర్ధర్షుండు వేచచ్చిరే. 222

ఒగి నా వీరుఁడు రశ్మికేతుఁడును విద్యుజ్జిహ్వుడున్ వేగ హా
హుగతిన్ త్రిపుడు చక్రమాలియు ద్విజిహ్వుండింక దీప్యచ్ఛలుం
డగు నా కంపనుఁ డా యకంపనుడు నాయ్యెన్ సూర్యశత్రుండు వీ
ర గతిన్ బొందిరి వార్ధి దాటితిమి గోష్పాదంబె లంఘింపనా. 223

ఇంక నీ యింద్రజితున్ జయించు టొకటే యీనాఁడు శేషించి యు
న్న కనీసం బగు కార్య మోకపులు క్రిందన్ మీఁద రవ్వంత గాం
చకె పైకొన్న సమస్తరాక్షసులు పెల్చెన్ చేరియున్ జచ్చినా
రిక వీక్షింపఁ పితృవ్యుదన్ గొడుకు నేఁజంప గారాదుగా. 224

జనను జాలికే కనుజు నాత్మజుఁ గూల్చెద రాముకై యికన్
వీనిని జంపఁ గోరు నను వెంటనె వద్దని యశ్రుధారయే
నా నయనాల కడ్డుపడి నన్నును నాపు మహాభుజుండు రా
మానుజుడైన లక్ష్మణుఁడె మానక చంపును లెండు వీనినిన్. 225

మీరును గూడి వీనిదరి మేకొని యుండిన భృత్య దైత్యులన్
మీరి వధింపుఁ డింకనుచు మించి విభీషణు డంత రేపగన్
వా రని విక్రమం బెసగ వానర ముఖ్యులు పొంగి యార్చి రిం
పారఁగఁ దోకలన్ విసరి; యుద్ధములం గని బర్హులట్టులన్. 226

అవలన్ హెచ్చియు జాంబవంతుఁడును సర్వర్క్షేంద్రులం గూడి దా
నవులన్ గోళ్ళను పళ్ళ రాళ్ళఁ గొనుచున్ బాధించి కొట్టన్ భయం
బు విడన్ద్రోసి నిశాచరేంద్రులను నమ్ముల్ కత్తి గొడ్డళ్ళతో
మివులం గొట్టిరి దైత్యులం దునుమఁగా మైకొన్న ఋక్షేశునిన్. 227

ఇటులఁ గపిరాక్షసులకు నెంతేని రణము
తుములమై గల్గె దేవదైత్యులకుఁ బోలె
చెంత హనుమంతుఁడును నల్గి చెట్టు పీకి
పేలకొలఁది దైత్యులతోడఁ బెనగె మిగుల. 228

ఘనుడు నింద్రజిత్తును విభీషణు నెదిర్చి
మరల రిపుహంత లక్ష్మణుఁ గర మెదిర్చె
పిదప నింద్రజి ల్లక్ష్మణు లల్ వేగపడుచి
ఒండొరులఁ గొట్టుకొని పోరి రుభయు లేర్చి. 229

రవియున్ జంద్రుఁడు గ్రీష్మపుం జివర నభ్రశ్రేణిచేఁ బోలె వా
రువడిన్ బాణ గణాలఁ గప్పఁబడి యేరున్ గానగా రారు వా
రు వెసన్ వేయు శరాలు గాని పెను విండ్లున్ గాని గన్పింప నే
రవు వా రెప్డు శరాలు తీయుదురొ మీరన్ వేతురో గానమే. 230

వ. వారు గుప్పిళ్ళు పట్టుట గాని గురి చూచుట గాని వారి హస్త లాఘవమును బట్టి కన్పింప దయ్యె. ధనుర్వేగమున బ్రయోగింపబడిన బాణనులచే ఏరూపములుగాని కన్పింపకుండెను. సౌమిత్రి ఇంద్రజిత్తుపై కి వచ్చి కొట్టుట

గాని ఇంద్రజిత్తు సౌమిత్రిపైకి వచ్చి కొట్టుటగాని యీ యుగ్రావస్థ లేవియు కనిపించుటలేదు. వారు వేసిన బాణములచే ఆకస మంతయుఁ జీకటి గప్పబడి నట్లు వేయుచున్న బాణములలో దిక్కులు, విదిక్కులు నిండిపోయెను. సూర్యుడు అస్తమించినపు డంతయు చీకటి మయ మైనట్లు అంతయు చీకటి నిండెను. రక్తపు టేర్లు వేలకొలది ప్రవహించెను. అక్కడ క్రూర జంతువులు భయంకరముగా అరచుచుండెను. అక్కడ వాయువు వీచదు. అగ్ని మండదు. లోకములకు శుభంబగు గాక అని మహర్షులు పల్కిరి. చారణు లు గంధర్వులతో అక్కడకు వచ్చిపడిరి. అంతట బంగారు భూషలను నల్లని నాలుగుగుఱ్ఱములను సౌమిత్రి కొట్టెను. వాడియైన మహేంద్ర వజ్రము వంటి భల్లమును శక్తికొలది విసరి అక్కడ చరించు సూతుని శిరస్సును సులువుగా తెగగొట్టెను. అపుడు మహాతేజుడగు మండోదరి సుతు డింద్రజిత్తు, సారథిపడుట చూచి స్వయముగా గుఱ్ఱముల నడుపుచు ధనుస్సునుతాకెను. అది మిగుల అద్భుతమై చూచువారికి తోచెను. గుఱ్ఱములను తోలుటలో మునిగి యున్నపుడు అతనిని సౌమిత్రి వాడి బాణములతో చేతిమీద, చేతితో ధనుస్సును పట్టి వేయుచున్నపుడు గుఱ్ఱ ములను కొట్టెను. నిర్భీతిగా చరించు నింద్రజిత్తును సౌమిత్రి శీఘ్ర విక్ర ముడై బాణౌఘములతో గొట్టెను. ఎప్పుడై తే సారథి పడెనో అపుడు ఇంద్రజి త్తుకు సమరోత్సాహము సన్నగిల్లుట చూచి వానర యూథపులు ఎక్కువ సంతో షముతో సౌమిత్రిని మెచ్చుకొనిరి. అపుడు ప్రమాథి, శరభుడు, రభసుడు, గంధ మాదనుడు అను నల్వురు వానర సేనాపతులు లెచ్చి మీదపడిరి. వెంటనే వారు ఎగిరి ఆ ఇంద్రజిత్తు గుఱ్ఱములపై బడిరి. అట్లు వారు పడి కొట్టగా గుఱ్ఱములు నోటినుండి రక్తము వెడలెను. అంత అవి నేలపైబడి ప్రాణాలు వదలెను. వారు గుఱ్ఱముల చంపి రథము పైకి ఎగిరి సౌమిత్రి ప్రక్క నిలచిరి. గుఱ్ఱములు చావగా ఇంద్రజిత్తు తన రథమునుండి ఎగిరి సౌమిత్రిపై కురికెను. అపు డింద్ర సము డగు సౌమిత్రి వాడి బాణములతో గొట్టుచు, నిశితము లగు బాణము లతో ఇంద్రజిత్తును వారించెను.

231

ఘనతేజుండగు నింద్రజిత్తుని తురంగాల్ కూలఁగా మండి నే
లనె నిల్చుండి స్వతేజుతో వెలిగె నిర్ఘాయిర్వ రన్యోన్యమున్
ఘన శస్త్రంబులఁ గొట్టుకొంచు జయ కాంక్షన్ మీఱి యేనుంగుదె
ద్దు సటుల్ పోర రిపుఘ్నులౌ కపులు దైత్యుల్ వీడ రాత్రీశులన్. 222

పిదప సర్వ రాక్షసులకు ముదము గూర్చ
పొగడి వారు హర్షింపగ మిగులఁ బలికె
ఎల్ల దిశలు చీకటిలోన నెసగి యుండె
ఎవరు వరుఁడౌ స్వీయుఁ డెవండౌ యెఱుఁగఁ బడరు. 223

కపుల మోహపెట్టగ మీరు కదన మిపుడు
చేయుడిదె రథంబెక్కి వచ్చెదను నిపుడె
ఏను పురికేగ 'నీ దుష్టు లిందుఁ బోరు
చేయునటు' మీరు చేయుడీ స్వేచ్ఛమీర. 224

అనిపలికి వానరులను వంచనమొనర్చి
అరిదమనుఁ డింద్రజిత్తు రథంబు కొఱకు
లంకపురిఁజొచ్చి రథంబు నలంకరించి
పర హయములసి ప్రాస నిర్భరమొనర్చి 225

అశ్వహృదయంబు తెలిసిన యాప్తుడైన
సారథినిగొంచు యమునిచేఁ బ్రేరితుడయి
త్వరగఁ బురివెల్వడి జవనాశ్వము రథము
తనర నాలక్ష్మణుని విభీషణునెదిర్చె. 226

రథమందుండిన యింద్రజిత్తునట శ్రీఘ్రంబే గనుంగొంచు స
త్వధుఁడౌ లక్ష్మణుఁడున్ విభీషనుఁడు తత్తద్వానర శ్రేష్ఠున్
ప్రథిత ప్రజ్ఞుడెయైన యింద్రజితు ప్రజ్ఞాలాఘవంబెంచి య
త్యధి కాశ్చర్యము పొందినారు విరథుడయ్యెన్ రథస్థుండుకాన్. 227

కడుఁ జాతుర్యముమీఱ నింద్రజియు సంగ్రామంబునం దంత నె
క్కుడు బాణంబులు నూర్లువేలునచటన్ గుప్పించియున్ వంచి యె
క్కిడి చాపంబును హస్తలాఘవముచే సెంత్రేని ఘోరంబుగా
వడినావా నరులన్ వధించుటయు నవ్వారున్ భయంబొందియున్. 239

జనసంఘాలు ప్రజాపతింబలెఁ గపుల్ సౌమిత్రినిన్ జేరియుం
తనె వానిన్ శరణొందమండి రఘుపుత్ర శ్రేష్ఠుఁడున్ వేగనై
పుణి మీరన్ గరలాఘవాన బహుకోపుంతౌచు రా యింద్రజి
ద్ధనువున్ ముక్కలుచేయ నింద్రజి తనంతన్ వేఱువిల్లెక్కెడిన్. 240

అదియున్గూడ ఘనుండు లక్ష్మణుఁడు మూడమ్ముల్ ప్రయోగించి యద
య్యుదనన్ ముక్కలుచేసి యైదగు శరాలాశీషోవిగ్రంబులన్
వదలంగా నవి యింద్రజిత్కవచమున్ ప్రత్యుల్లఁ గావించి వే
గ ధరన్ నెత్తుటఁదడ్సి చొచ్చెను భుజంగశ్రేణివోలెన్ గడున్. 241

కవచంబున్బడ నెత్తుఁగక్కుచు మరొక్కంతౌ ధనుశ్రేష్ఠ మం
త మెసన్గైకొని ఇంద్రజిత్తట సుమిత్రాపుత్రుపై హస్తలా
ఘవమొప్పన్ సురరాజు వర్షమటు లుగ్రాస్త్రాలు వర్షింప ను
ద్ధవిడిన్ లక్ష్మణుడున్ జలింపకయె తదస్త్రాలన్ వడిన్ గూలిచెన్. 241

అటు రామానుజుఁడుం గనంబఱపు నేర్పాశ్చర్యముంగొల్ప మూ
డిట బాణాలొకొక్కనిన్ దఱుముచున్ ఢీకొంచుఁ జాతుర్యమున్
పటుతంజూపుచు నింద్రజిత్తు నటులన్ బాణాలతోగొట్ట వా
డట సౌమిత్రినిగూడ బాణతతిచే నంతన్ వడిన్ గొట్టగా. 242

కడు శక్తుండగు శత్రుఘాతిరిపుచే నాటంబునాఁ గొట్టఁగా
బడి వెన్దీయక యింద్రజిత్తు రఘుపుత్రశ్రేష్ఠు బాణాలచే
పడిఁ గొట్టన్ రథిముఖ్యు లక్ష్మణుఁడు నవ్వానిన్ పధింగూర్చి నె
వ్వడి నా యింద్రజి సూతుశీర్షమునటన్ భల్లానఁగొట్టెన్ బడన్ 243

స. అంత సూతుడులేని రథమును వ్యాకులపడక గుఱ్ఱములు వహించి మండలములుగాఁ బరువిడినవి, అది అద్భుతముగానుండెను కోపగించినసౌమిత్రి దృఢవిక్రమముతో ఆ యింద్రజిత్తు గుఱ్ఱములను భయపెట్టుచుఁ గొట్టెను. అట్లు కొట్టుటను సైపక ఇంద్రజిత్తు బలవంతుడయి పదిబాణములతో ఆ సౌమిత్రిని గొట్టెను! అవి వజ్రతుల్యములయి సర్పవిశ్వములఁబోలె ఆశరము లడ్డులేనివయి సర్పవిషమువలె పోలికలేక, కాంచనపుఁరంగుగల సౌమిత్రికవచముగొట్టి లయము పొందెను. ఆ సౌమిత్రి కవచము అభేద్యమని తలచి రావణ సుతుఁడు మంచి లాఘవముతో మంచిపుంఖములుగల మూడుబాణములతో సౌమిత్రిని కోపించి నుదుటఁగొట్టెను. నుదుటనున్న ఆబాణములచే సౌమిత్రి సమరమును శ్లాఘించిన వాడయి మూడుశిఖరములున్న పర్వతమువలె నుండెను. 244

అటులా లక్ష్మణు నింద్రజిత్తు శితమౌ నమ్ముల్ ప్రయోగించి కొ
ట్టుటచే లక్ష్మణుడైదు బాణముల బిట్టుంగొట్టె నవ్వేళయం
దిటులా వీరులు లక్ష్మణేంద్రజిత్తు లెంతే రక్త సిక్తాంగులై
పటుతన్బోరుచుఁ బూచుమోదుగుల్ ప్రాజిల్లిరయ్యాజిలో. 245

ఎటులైనన్ జయమొంది తీరవలెనంచెంతే మహోగ్రాస్త్రముల్
విటతాటంబుగ సర్వగాత్రములపై వేగన్ప్రయోగించి యు
ద్భటులా యిర్వురు కొట్టుకోదొడఁగి, రంతన్ క్రుద్ధుడై యింద్రజి
త్తటఁ బిత్రవ్యు విభీషణున్ త్రిశరాస్త్రంబుల్ ప్రయోగించియున్. 246

మరియొక్కొక్క శరంబుచే నఖిల భీమాకారులౌ యగ్ర్య వా
సరులం గొట్ట విభీషణుండలిగి యంతన్ పెన్గదం బట్టిత
త్తురగాలన్ బడఁగొట్ట నాసురరదమున్ తూర్ణంబ వర్జించిపై
కురు వేగంబున గంతువైచి యటనేదో శక్తి పైచెన్ వడిన్. 247

ఘోరమైన యమాసురాస్త్రమును జూచి దానిని మహేశ్వరాస్త్రముచే వారించెను. అపుడిట్లు వారియుద్ధము యద్భుతమై చూబట్టెను. అపుడు ఆకాశమందున్న భూతములు లక్ష్మణుచుట్టును చేరెను. భైరవరుతములతోగూడిన యాభయంకర యుద్ధము అద్భుతపడు బహుభూతములచేనావరింపబడెను. ఋషులు పితృదేవతలు, దేవులు, గంధర్వులు, గరుడులు, ఉరగులు, శతక్రతువును ముందుంచుకొని సౌమిత్రిని రక్షించిరి. 250

పత్రముల్ గట్టిన వర్తులంబై యున్న
కణుపు లొప్పారు చక్కగఁ వెలుంగు
కడుఁ బైఁడిదై మెర్పి యొడలంత మొందించు
వారింపరాక సైపంగరాని
దైత్య భీతిద మౌచు దైవాళి దత్తమై
సర్పవిషము వోలెఁ జావు గూర్చు
దేవాసుర రణాన దివ్యతేజుఁడు నింద్రు
డసురులఁ గెల్చిన యైంద్ర మస్త్ర

మాజి సౌమిత్రియును ధనువందు గూర్చి
నారి ప్రయోగించి యీ రీతి నొగి వచించె
రాముఁడిల సత్యరతుఁడు ధర్మాత్ముఁడెదురె
లేనివాఁడేని యీ యమ్ము వీని జంపు". 251

అని పలికి యింద్రజిత్తుపై నైంద్ర మస్త్ర
మేసి తల శిరఃస్త్రాణంబు ఎసగు కుండ
లాలు కూడియుఁ బడఁగొట్ట నేలపైని
నెత్తుటఁ దడిసి సువర్ణ సన్నిభతఁ దోఁచె. 252

తలతోడన్ గవచంబుతోడను శిరస్త్రాణంబుతో భిన్నమౌ
విలు శస్త్రంబులతోడ నింద్రజి పడన్ వీరుల్ కపుల్ ధీరుడౌ
బలవంతుండు విభీషణుండు ముదమొప్పన్ హెచ్చి ఘోషింప దే
వుల గంధర్వుల నప్సరో ఋషుల గుంపుల్ చేరి చేసెన్ ధ్వనుల్: 253

ఇంద్రజిత్తు పడుటఁ దెల్సి యెల్ల దైత్య
సేన విజయగర్విత కపిసేన చేతఁ
జంపఁబడుచుఁ బర్వెత్తి రాక్షసులు తాము
శస్త్రములువీడి స్మృతిలేక చనిరి లంక: 254

పలువిధాల రాక్షసులచేత పట్టిసములు
కత్తి గొడ్డళ్ళు శస్త్రముల్ క్షమను వీడి
ఎల్లదిశలకు భయముచే నెదలు స్రుక్క
వందలుగఁ బారిపోయిరి పరువులెత్తి. 255

కొందరు లంకం జొచ్చిరి
కొందరు కపి బాధితు లగుచుఁ గూలిరి జలధిన్
కొందరు కొండలఁ జేరిరి
కొందరు కాలికొలఁది చని కూడిరి నేలన్. 256

రణభూమిని పడిన రావణు
తనయు నిగని వేలకొలఁది దైత్యులలో వే
రును మచ్చున కయిన నపుడు
గనఁబడకయె చనిరి చెప్పి కాళ్ళకు బుద్ధిన్. 257

రవి యస్తమింప నా రశ్మిలు పోలిక
నింద్రజి పడ దైత్యు లేగినారు

రశ్మిలు చల్లారు రవిపోలెఁ జల్లారు
నగ్నియ ట్లింద్రజి యణగిపోయె

ఇంద్రజిత్తడగంగ లోకంబున
సెల్లబాధ లరిష్టమెల్ల నడఁగె
ఇంద్రజిత్తిటుకూల నింద్రుఁడు సురలతో
పరమ సంతోషంబు పడసె నప్డు

అభ్రమున దేవదుందుభు లన్ని మ్రోగె
ఆడి రప్సరల్ కిన్నరుల్ పాడినారు
పుష్పవర్షము కురిసెను మునులు మెచ్చి
యఖిల మాశ్చర్యకరమౌచు నప్పుడయ్యె. 258

జలములు సర్వదిశలును నిర్మలమయ్యె
దైవ దానవులు ముదంబు గనిరి
బ్రాహ్మణుల్ శాంతులై జ్వరతప్తులుగాక
పొలచుగా కనిరి దేవులును ఋషులు

కపియూథపులు మెచ్చి రపు డప్రతిద్వంద్వ
బలము గాంచి దితిజబల మడంగ
రాక్షస బలములు రక్షణ గాంచక
లంకపైపుగ పారి యింక నరిగె

ఆ విభీషణ హనుమంతు లఖిల కపులు
జాంబవంతుఁడు లక్ష్మణున్ జాలమెచ్చి
రఱచుచును జిటికలువైచి చఱచి బొబ్బ
రెలమి రఘుసుతు చుట్టు నిలచినారు. 259

తోక లెగురవైచుచును గంతులును వైచి
లక్ష్మనునికి జై జైయుగు లక్ష్మనునికి
అనుచు కేకలు వైచుచు నఖిల కపులు
కౌగలిడుచుకొంచు మెత్తురి లక్ష్మణుని కథలు. 260

ఇంద్రశత్రువు వధ విని యెల్ల సురలు
అపుడు లక్ష్మణు దుష్కర మఖిల కపులు
చూచి ప్రియ సుహృదులు మెచ్చి నీచుదైత్యు
దూటి వాని చావునకు సంతోషపడిరి. 261

రక్తమునఁ దడిసియు శుభ లక్షణుండు
లక్ష్మణుం డింద్రజిత్తుఁ బోరను వధించి
జాంబవంతుని హనుమంతు సంతసమునఁ
గలిసి సర్వవానరులతోఁ గదలి యపుడు. 262

అన్న రాముఁడు సుగ్రీవుఁ డున్నచోటి
కా విభీషను హనుమంతు నాని పట్టు
కొనియు రామునికడకేగి వినయమొప్ప
మ్రొక్కి గీష్పతి దరిని నింద్రుడటు నిలిచె. 263

అపు డవ్యక్తవర్ణము లలరఁ బూజ్యు
డన్నకు యింద్రజి ద్వధ నమరఁ జెప్పె
ఆ విభీషణుఁడు మహాత్ముఁడైన లక్ష్మ
ణుఁ డట నింద్రజిత్తును జంపెనని చెప్పె. 264

—: ఇంద్రజిత్తు మృతి విని రాముండు సంతోషించుట :—

ఈ మహారుఁడగు రాముఁ డింద్రజిత్తు
ననుజ లక్ష్మణుఁడ వధించె నంచు వినియు
అతుల మోదము పొందుచు ననుజుఁ జూచి
ఈ విధంబుగ వాక్రుచ్చెఁ గృత్యవిదుఁడు. 265

"మేలు లక్ష్మణ! సంతోష మెంతొ గలిగె
ఎంతమంచి కార్యమును గావించినావు
ఇంద్రజిత్తును వధియించి తీవు గనుక
ఎంచుమిఁక రావణుని వధియించినట్లె." 266

అనుచు లక్ష్మివర్ధనుని లక్ష్మణుని గుచ్చి
శిరము మూర్కొని సిగ్గును జెందుతమ్ము
బలిమి నెత్తి హాసఁ దనతొడపైని గూరు
చుండఁ బెట్టుకొని యట రాముండు మరియు. 267

ప్రేమచేఁ దనయొడియందు వేగఁ జేర్చి
ధృఢముగఁ గవుంగలించుచు దేహమందు
శల్య పీడితాంగములను బక్కఁజూసి
నిదుద తలచి యోదార్చుచును తమ్ముఁ దడవి పలికె. 268

దుష్కరపుఁ గర్మచేసి యెంతో శుభంపుఁ
గర్మ నేడు చేసితివి రాక్షస విభుండు
ఇంకఁ జచ్చినట్లే సుమి యింద్రజిత్తు
చావనేను విజయి నైతి సత్వరముగ. 269

క్రూరుఁడైనట్టి రావణు కుడిభుజంబు
నిపుడ తెగఁ గొట్టితి విపుడె యిశనికాశ్ర
యము విభీషణ హనుమంతులాజి గొప్ప
పని యొసర్చితి రిట్లు మూఁడు దినములందు. 270

ఇంద్రజిత్తును జంపి మీరిపుడు నన్ను
శత్రు శూన్యుఁ జేసితిరింక సత్వరముగ
కొడుకు చావు విని రావణుఁడు బలంబు
నన్నుకొని పైకిరాక తప్పదు నిజంబు. 271

పుత్రవధచేతఁ దప్తుఁడై పురము వెడలు
గెలువరానివాని వధింతు బలమునుగాని
ఈవు సాయమై లక్ష్మణ! యింద్రజిత్తు
వడిదునుమ సీత ధరయు దుష్ప్రాపలగునె.

అటు లోదార్చియు శిమ్ముఁ గౌఁగిటను నొయ్యన్ గుచ్చి సంతుష్టుడై
యటనున్నట్టి సుషేణుఁ బల్కె ఘనప్రజ్ఞా! వీఁసౌమిత్రి యు
త్కట శల్యుండు విశల్యుఁ డెట్టులగునో గావింపు మీయట్టి నీ
వటులే ఋక్షకపుల్ విశల్యులుగనే యౌనట్లుగా జేయుమీ. 273

వ. అని రాముఁడు చెప్పగా మహాత్ముఁడగు సుషేణుఁడు లక్ష్మణుని ముక్కు దగ్గర ఒక పరమౌషధిని ఉంచగా దానిని లక్ష్మణుఁడు వాసన చూచి నంతనే విశల్యుఁడలు వ్రణములు పోవ బాధ లేనివాడయ్యెను. మఱియు రాముఁడు విభీషణుఁడు సుహృదుల యాజ్ఞచేత వానరులందఱనుచికిత్సచేసెను అంత శల్యములుపోవ వ్యధలేక వ్రణముల బాధలేనివాఁడయి సౌమిత్రి సంతుష్టాంతరంగుఁ డయ్యెను. అట్లే కపిరాజును విభీషణుఁడు ఋక్షపరుడైన జాంబవంతునకు వ్రణాదిశూన్యుడగు లక్ష్మణుని జూచి సైన్యములతోపాటు సంతోషించిరి. మహాత్ముడగు రాముఁడును లక్ష్మణుడు చేసిన యాదుష్కరకర్మకు సంతోషమున గౌరవించెను. యూథపతులు గూడ ఇంద్రజిత్తు చావు విని సంతసించిరి. 274

పిదప రావణు మంత్రులు వెడలి చెప్పి
రింద్రజివధఁ జూచి వగ దైత్యేంద్రునికిని
"ఓమహారాజ! లక్ష్మణుండొగి విభీష
ణుని సహాయానఁ జంపె నీతనయు నిపుడె 275

అపజయమే యెఱుంగని త్వదాత్మజు శూరుని శూర లక్ష్మణుం
డిపుడె వధింప లక్ష్మణుని బెన్నా శరాలను నొంచి నీసుతుం
డు పడసె స్వర్గమంచు ననుడున్ సుతు ఘోరపుఁ జావువిన్న దై
త్య పతియు మూర్ఛనొందె స్మృతి నందిచిరానకు పుత్త్రిచావుచే. 276

అతిదీనుండయి వ్యాకులేంద్రియుఁడునై యారావణుం డంతటన్
సుతు నార్తిన్ విలపించె "రాక్షసచమూ శూరాగ్ర్య! యోవత్స! యీ
గతి నీవింతమహారథుండవును నాకాధీశు నోడించు ను
ద్ధతి యున్నట్టి ఘనుండవే యిటు సుమిత్రాసూతికిన్ లొంగితే. 277

ఘనచాపంబును పట్టి మందరము శృంగశ్రేణిఁ గాలాంతకున్
క్షణకాలంబునఁ జీల్పఁ జాలుదువె లెక్కా నీకు నా లక్ష్మణుం
డన నీయంతటి వాఁడె యీగతిని నోయాజానుబాహూ! పడం
గనినేఁడా యము గౌరవింపవలసెన్ గాదే యిఁకన్ భూమిలో. 278

ఇదె సర్వామర సంఘ మందయిన నెంతో యోధులే పొందు న
ట్టిదియౌ స్వర్గము రాజుకున్ సమము కాటింజేరు ధీరుండొకం
డెదికం బొందును, నింద్రజిత్తుపడు గాలిన్ సోకిదేవ వ్రజం
బు దిగీశుల్ ఋషులున్ సుఖంబుగఁ బరుందుర్ గాదె నిర్భితితో. 279

ఇప్పుడీ యొక్కఁడె యింద్రజిత్తుపడ నాకానలన్ నిండు తా
శ్వపి సర్వంబును మూఁడు లోకములు శూన్యంబౌచుఁ దోఁచెన్గదా
ఇపుడంతః పురమందు దైత్యసతు లెంతేనేడ్వఁగా వారిదై
న్యపు టేడ్పుల్ గుహలన్ గరేణువులధ్వానాలట్లు వింటుంగటా. 280

ననుదల్లిన్ సతి యౌవరాజ్యమును పూర్ణంబున్ త్రుటిన్ వీడి యో
ఘన వీరాగ్ర్య! పరంతపా! యెచటకుంగాఁ బోతివోవత్స! కా
లుని యిల్సేరిన నీకు నేనిపుడు నిట్లున్ ప్రేతకార్యాలు చే
తును నెల్లన్ విపరీత కార్యముల యందున్ బ్రవర్తింతువే. 281

అల సుగ్రీవుఁడు రామలక్ష్మణులిటన్ ప్రాణాలతో నుండంగ గుం
డెలలోఁ జొచ్చిన ముల్లుదీయకయె యిట్లీ వెందు నన్వీడి యెం
దులకుం బోతివి యంచు నీమొదలుగన్ రోదించునా రావణున్
పలు కోపంబును తాపమున్ గలిగెఁ దీవ్రంబైన పుత్రార్తిచే! 282

అసలే కోపనుఁడై రావణుని నత్యంతంబటన్ వేసవిన్
నుసిగాఁ జేసెడి తీక్ష్ణ సూర్యుఁగర సందోహంబు వోలెన్ స్వకీ
య సుతార్తుల్ కడు మండఁ జేయగి యుగాంత్యంబందు నక్రాలతో
డ సముగ్రోర్మ్మల సంద్రమట్టులులాటం బొప్పెఁదుద్భ్రూకుటిన్. 283

అలుకచే విజృంభించు దశాస్యు మొగము
నుండి వృత్రాసురుని మోములుండి వోలె
పొగలతో నగ్ని మండఁగఁ బుత్రువ్యధను
క్రోధవశత సీతను జంపఁగోరె మదిని. 284

అసలె యెఱ్ఱని తన్నయ నాంచలములు
ఘోరమై యింకఁ గ్రోధానఁ గ్రూరమయ్యె
అసలె ఘోరమౌ తద్రూప మలుక చేత
రుద్రునకుఁ బోలె నుగ్రమౌ రూపువాల్చె. 285

మండుదీపంబుల నుండి వోలెను నల్కఁ
దన్నేత్రములను దీప్తాశ్రులురలె
పండ్లు పటపటమను వాని పండ్ల ధ్వనులు
త్రిప్పు యంత్ర ధ్వనుల్ తీరు చూపె
కాలాగ్నివలె నగ్గి కండ్ల నెట్టెటు చూచె
నట దైత్యులు భయాన హడలి మఱచి
దలిసి చరాచరములఁ దినగోరు నంత
కుని బోలునతని దైత్యాళి దరియ

రంతఁ జాల క్రుద్ధుండైన యసుర విభుడు
రావణుఁడు పాటు బలమును మరల్చి గోర్కె
యిట్టులనె నేను వేలేండ్లు బిట్టు తపము
చేయ హర్షించి బ్రహ్మ యిచ్చెను వరాలు. 286

ఆ తపో మహిమఁ దత్ప్రసాదాప్తి వలన
ఎపుడు దేవదైత్యుల నుండి యెనయు భయము;
బ్రహ్మ యిచ్చిన రవితుల్యవర్మ మెపుడు
దైత్యదేవాజి వజ్రఘాతములఁ జెడదు. 287

కనుక నేనాకవచముతోఁ గదల్ రథము
నెక్కి యనిచేయ నింద్రుఁడే నెదురు కొనునె
దైత్యదేవాజి మెచ్చి విధాత యిడిన
విల్లుగొన రామలక్ష్మణుల్ విడరె యుసురు. 288

వ. అని పలుకుచు రావణుఁడు క్రోధాంధుఁడయిపుత్రవధచేఁ దపించుచు సీతను జంపబుద్ధి యందు నిశ్చయించి తామ్రాక్షుఁడై ఘోరదర్శనుండై దీన స్వరములు గల దైత్యులందఱతో నిట్లనెను. నావత్స యింద్రజిత్తు వానరులను వంచించుటకై మాయచేసి సీత ఇదిగో అని చెప్పి పరకాంతగాచేసిచంపెను. ఇదిగో ఇప్పుడు నేనాసంగతి నిజముఁ జేయుటకై క్షత్రియబంధువైన రాముని ఆశ్రయించినసీతను జంపివైచెదను అనిపలికి వెంటనే మాలలువేసికొని స్వచ్ఛాకాశమువలెనున్న కత్తిని తీసికొని భార్యలతో, సచివులతోఁ గూడి వెంటనే పుత్రశోకముచే వ్యాకులుఁడై సీత యున్న చోటికి వెంటనే బయలుదేఱివెళ్ళెను ఇట్లు క్రుద్ధుడై బయలుదేఱి వెళ్ళుచున్న రాక్షసేశ్వరుని జూచి రాక్షసులు సింహనాదము చేసి ఒకరి నొకరు కౌగిలించుకొని పలికిరి. 289

"ఇపుడా భ్రాతలు రామలక్ష్మణులు నీదృగ్వీరునిన్ జూచి బా
ధ పడంబోదురు, లోకపాలురును నీదై త్యాధీశుచే నోడిరే
రిపులెల్లన్ రణమందు నిర్జితులెయ్యారేగాదె ముల్లోక ర
త్నపు సౌభాగ్యము లెల్లఁ దెచ్చి వడిఁ బొందం జాలెఁగా యీతఁడే. 290

బలమందేని పరాక్రమందయిన నెవ్వాఁడేని యేతత్సముం
డిలలేడంచు నిశాచరుల్ పలుకగా నీరావణుం డంతటన్
వలదంచున్ హితులెంత చెప్పిన గ్రహింపన్ రోహిణిన్ లాగునన్
అలుకన్ మూర్ఛితుఁడై యశోకవనిలో నాసీతఁజంపన్ జనెన్ 291

హితులౌనెయ్యురు వద్దువద్దనుచు వారింపంగ నారావణుం
డతిరోషంబునఁ గత్తిఁబూని వడిరా, నారాక్షసస్త్రీలచే
నతిజాగ్రత్తగఁ గావఁగాఁబడు ననింద్యస్వాంతయౌ సీత దుః
ఖితయౌచున్ విలపించుచున్ వ్యధనుబల్కెన్ జూచిలంకేశున్ 292

ఇతఁడు క్రుద్ధుడై దుష్టమౌ మతియుగల్గి
నను సనాధననాథఁ బోలెను వధించు
నను పతివ్రతన్ పలుమార్లు నాకుభార్య
వగుమి యనుచుఁ బ్రేరేచ చీ ! యనుచుఁ ద్రోతు. 293

అటులనేఁ ద్రోయవీఁడు నిరాశఁజెంది
క్రోధమోహాంధుఁడై చంపఁగోరివచ్చె
లేక నముబట్టి భ్రాతలౌ నృపసుతులను
చంపెనేమొ ఛీ ! నాపాడుజన్మమిద్ది. 294

కాక సుతచింత రామలక్ష్మణులఁ జంప
జాల కిటు పాపమైన నిశ్చయము తోడ
రాక్షసుఁడు నన్నుఁజంపును రౌద్రుఁడగుచు
హనుమవాక్యముల్ హీనసై వినకపోతి. 295

హనుమ ఏపెక్కియె యనింద్యమైన నేను
అపుడెవెళ్ళిన నిపుడు నాదుపతియొడిని
నుండియిట్లు విచారింపకుండఁ దగని
దానవై యుండియుందుఁగదా ధరిత్రి 296

ఏకపుత్రయౌ కౌసల్య యిట్లు తనదు
సుతుఁడు హతుఁడయ్యెనని విన్నచో మరింక
ఆమె హృదయంబు బ్రద్దలై యగు నటంచు
నాదుచిత్తము తలఁచుచున్నదియె యకట. 297

ఆమె యేడ్చుచు ధర్మకార్యాను రూప
మామహాత్ముని జన్మము నట్టి బాల్య
సమయమునునట్టి యౌవనసమయము మెదను
సరిగ స్మరియింపఁగలద యాసమయమందు. 298

సుతుఁడు హతుఁడు కాగఁదా స్మృతియెలేక
శ్రాద్ధమునుపెట్టి యింక నిరాశయగుచు
అగ్నిలోనైనఁబడు నీటియందునైన
నకట ! పడి ప్రాణముల్ విడనాడు నిజము. 299

పాపబుద్ధియై చెడ్డదౌ వక్రకుబ్జ
మంథరనుగూర్చి నిరసన నిందయువుత
అట్టిదాని నిమిత్తమె యకట ! యిటుల
ఆర్తిఁగౌసల్య దుఃఖము నందుచుండె 300

అనుచు విలపించ నాదీనురాలి సీత
నపుడు శశిలేక గ్రహవశమైన రోహి
ణి నటుగని బుద్ధిమంతుఁడు ఘన సుపార్శ్వు
ఁడనె సచివులడ్డగించు రావణునికిట్లు. 301

వ. ఓ దశాస్య! సాక్షాత్తుగా నీవు వైశ్రవణుని తమ్ముఁడవు. ధర్మమువిడిచి క్రోధమున సీతను జంపఁగోరుచున్నావు. వేదవిద్యా వ్రతస్నాతుండవు. రూపవతియైన సీతను జూడుము. నీవిపుడె కృష్ణపక్ష చతుర్దశినాడు మొదలుపెట్టి అమావాస్యనాటికి విజయమునకై బలములంగూడి బయలుదేరితివి. నీవు * ధీరుడవు రథివి. ఖడ్గధారివి రథశ్రేష్ఠమునెక్కి రాముని జూచి సీతనికఁ బొందగలవు. అని చెప్పఁగా దురాత్ముఁడయిన రావణుఁడు సుహృదునిచే చెప్పఁబడినదానిని విని ధర్మయుక్తమయిన అవాక్యమును గ్రహించి యింటికిఁబోయి వీర్యవంతుడయి మరల సుహృదాదులతో సభనుజొచ్చెను. 302

అంత రాక్షసేశుఁడు రావణాసురుండు
పరమ దుఃఖితుడై దైన్యభావమొంది
వెచ్చనిట్టూర్చుచును నల్కవెడలు సింహ
మట్లు కూర్చుండె సభ నున్నతాసనమున. 303

తనయు వ్యసనంబుచేఁ జిక్కు దశముఖుండు
ప్రాంజలియయి వీరులతోడఁ బలికెనిట్లు
త్వరగ రథగజవాజి పాదాతి బలము
గొనుచు వర్షకాలపు మేఘగణముఁ బోలి. 304

* దీనినిబట్టి ఇంతవరకు యుద్ధము మొదలయి 13 రోజులయినట్లు తెలియుచున్నది. పున్నమినాడు సువేలాప్రవేశము, కృష్ణపక్ష పాడ్యమినాడు యుద్ధారంభము, ఆరాత్రే నాగబంధమునుండి మోక్షము, విదియనాడు ధూమ్రాక్షవధ, తదియనాడు వజ్రదంష్ట్రునివధ, చవితినాడు అకంపనుని జంపుట, పంచమినాడు ప్రహస్తుని, షష్టినాడు రావణమకుట భంగము, సప్తమిని కుంభకర్ణునివధ అష్టమిని అతికాయాదులను, నవమినాడు ఇంద్రజిద్రణము. ఆరాత్రే కుంభనికుంభాదులవధ. దశమినాడు మకరాక్షుని, నేకాదశి ద్వాదశి త్రయోదశులలో ఇంద్రజిద్వధ. చతురశిని అభ్యుత్థానము.

మీరు వేగమేచని శరాసారములను
కురిసి రాముచుట్టునుముట్టి కొట్టిచంపుఁ
డింకఁ బోనిమీరలు రాముసెల్ల మేను
చముపరేపెనేఁ జంపెద జగములరయ. 305

అని యారావణుఁడాడ శీఘ్రముగ దైత్యానీకమంతన్ రథా
లను నారోహణచేసి శత్రువులఁ జీల్పంజాలు బాణాలు గొ
డ్డలులన్ గత్తులు పట్టసంబులను గేలందాల్చి యువ్వానరా
వళి గొట్టన్ గపులున్ గిరుల్ తరులతోఁ బైఁగొట్టిరా దైత్యులన్. 306

అటు సూర్యోదయమాది పోరు కపిదైత్యానీకమం దయ్యె ను
త్కటమౌ దుములంబునాచు; నపుడే యన్యోన్య మమ్ముల్ గదల్
పటుఖడ్గమ్ములు పెక్కుప్రాసములు తీవ్రంబొప్పగాపైచి ముం
దట నేగన్ విహరింపలేచు రజమున్ దాఁగప్పె రక్తాలనిన్. 307

వ. ఇట్లు యుద్ధము ఘోరముకాఁగా నేనుఁగులు రథములు కూలములుగా, గుఱ్ఱములు మత్స్యములుగ, ధ్వజములు చెట్లుగ, శరీరసంఘములు పడవలుగ, రక్తపుటేరులా యుద్ధమున ప్రవహించెను. అపుడా వానరు లందఱు రక్తప్రవాహములచే తడిసి రాక్షసుల ధ్వజములను గవచములను రథగజవాజులను నానాయుధములను ఎగిరియెగిరి విఱిచివైచి వారి కేశములపీకి చెవులు నుదురులను గోళ్ళతోగీరి ముక్కులను తీక్ష్ణమగు గోళ్ళతోఁజీల్చిరి. ఒక్కొక్క రాక్షసునిపయికి వందకపులు ఫలవృక్షములపయికి పక్షులవలె పరువిడిరి. అపుడు గురుగదలతోను ప్రాసములతోను ఖడ్గములతోను గొడ్డళ్ళతోను రాక్షసులు వానరులను గొట్టఁగా రాక్షసులచే వధింపబడుచున్న వానరసేనలు వెడలి శరణిచ్చునట్టి దాశరథియగు రామునిశరణుఁ జొచ్చిరి. 308

ఘనతేజుండగు రాముఁడంత ధనువున్గై కొంచు వీరాఢ్యుడై
చని యారాక్షససేనఁజొచ్చి శరవర్షాలంత వర్షించె, సే
నను దగ్ధంబొనరించు రాఘవునివెంటన్ సూర్యమేఘా లటున్
గని దైత్యుల్ దరియంగలేరు; గని రుగ్రంబైన తత్కర్మలన్. 309

బలమున్ గంపమొనర్చుచున్ రథికులన్ వైశంబ మర్దించుచున్
కలనందున్ విహరించురాముని వడిన్గానన్ విజృంభించు ను
జ్జ్వల వాయున్బలెఁ జూడలేరు తుములంబౌ నాజిలో భగ్నమై
చలమై దగ్ధమునైన సైన్యమునె గాంచం గల్గిరారాక్షసుల్. 310

జనముల్ ప్రాణులలోని యాత్మనుబలెన్ సర్వాంగ భాగంబులన్
దునుమంజొచ్చెడి రాముఁజూడ రితఁడే దున్మున్ గజాలీఁతఁడే
దునుమున్ తీవ్రశరాలఁ గాల్బలము, దున్మున్ హస్తులన్ వీడెఁగా
యనుచున్గొట్టిరి రాముతుల్యులను దైత్యశ్రేణి యయ్యాజిలో 311

వ. అప్పుడా రాక్షసులు,

సమ్మోహనాస్త్రాన సంమోహితులయి శా
త్రవసేన దహియించు రాముఁగనరు

అనివేల రాముఁలనఁసి మరలనొక్క
రామునెకాంతుఁడు రాక్షసాళి

భ్రమియించు హైమచాపాగ్రంబు కొఱవి చ
క్రమునట్లు గనుగొంద్రు రాముగనరు

ప్రజలటఁ గాలచక్రముఁబోలె దైత్యులఁ
జంపుశస్త్రము రాముచక్రమరసి

యోధవరె నాభికాంగ సత్త్వార్చినొప్పి
శరములే బండియాకులై చక్రనేమి
మండలముగనైన ధనువై మహిత నారి
ఘోష ఘోషగా తేజమె గుణతఁ దనర. 612

వ. హయవేగముగల పదివేల యనీకముల రథములు అనఁగా ఏడు కోట్ల యిరువదితొమ్మిదిలక్షల రథములును వేగముగల పదునెన్మిదివేల యనీకముల యేనుఁగులును అనఁగా పదమూఁడుకోట్ల పన్నెండులక్షల ఇరువదివేల యేనుగులును, పదునాలుగువేల యనీకములు అనఁగా ఇరవై లక్షల అరువది వేల రౌతులతోఁగూడిన గుఱ్ఱములును రెండు నూరువేల యనీకములు అనఁగా నూటఎనభయి అయిదుకోట్ల ఎనుబదిలక్షల కాల్బలమును దినములో ఎనిమిదవ భాగమున అనఁగా పావుతక్కువ నాలుగు గడియలలో ఒక రామునిచే కామరూపులయిన రాక్షసులు అగ్నిశిఖలవంటి బాణములచే చంపఁబడిరి. గుఱ్ఱములు పడిపోయి రథములుకూల జండాలు నేలనిండ్రవాల చావఁగామిగిలిన యారాక్షసులు లంకాపురముపైపు పరువిడిరి. చచ్చిపోయిన ఏనుగులతో గుఱ్ఱములతో కాల్బలములతో ఆయుద్ధభూమి నిండిపోయి కోపగించిన మహాబలుడగు రుద్రుని స్మశానవాటికవలెఁ గనుపట్టె. అప్పుడు దేవ గంధర్వులు సిద్ధులు

---

* ఒక యేనుగు, ఒక రథము, మూఁడు గుఱ్ఱములు, అయిదుగురు కాలిబంట్లు గల దానిని పత్తి యందురు. మూఁడు పత్తులు సేనాముఖము, మూఁడు సేనాముఖములు గుల్మము, మూఁడు గుల్మములు గణము, మూఁడు గణములు వాహిని, మూఁడు వాహినులు పృతన, మూఁడు పృతనలు చమువు. దీనినిబట్టి యేడువేల రెండువందల తొంబది ఒకటి చమువు అగును. ఇట్టి చమువులు అనేక మనఁబడు నని వ్యాఖ్య. దీనిని బట్టి సైన్య సంఖ్యలు చెప్పఁబడెను.

పరమర్షులు మేలుమేలని యారాముని కృత్యమును జూచి పూజించిరి. అంత మహాత్ముఁడయిన రాముఁడు సుగ్రీవుని విభీషనుని హనుమంతుని జాంబవంతుని మైంధుని ద్వివిదునిజూచి యీ దివ్యాస్త్రబలము నావా త్ర్యంబకునిదా యని పలికెను. అట్లు శక్రసముండును మహాత్ముఁడు నయిన రాముఁడు అపుడు రాక్షససేనను రూపుమాపి అస్త్రశస్త్రములందు జితక్లముండయి ప్రహృష్టులైన దేవగణంబులచే స్తుతింపబడెను. 313

## —: రాక్షస స్త్రీల రోదనములు :—

మును కష్టంబిడనట్టి కర్మగలరాముండో వేనవేలశ్వముల్
అనలంబట్టులు రంగుచిల్కిన ధ్వజాఢ్యంబౌ రథాల్కూల్చగా
మన శస్త్రాస్త్రములున్ గదల్గొనుచు సంగ్రామంబుకై రావణుం
డనుపన్ వచ్చిన రాక్షసాళి చనిపోనల్లాడి రోదించుచున్. 314

హతపుత్త్రిల్ విధవల్ హతాప్తలగు నాయారాక్షసస్త్రీలు నా
దితిజుల్గూడియు దీనులై మిగుల నుద్వేగంబుతో నిట్లు వా
రతిగా నేడ్చుచు మొత్తుకొంచు నట నన్యోన్యముంజేరి త
ద్ధితులౌ బంధులకై విచారమున నెంతేఁబల్కిరి ట్లీతు్ప్చున్. 3[illegible]5

"ప్రేలాడు పొట్టదౌ వృద్ధశూర్పణఖ వి
కృతరాము స్మరతుల్యు నెట్టులరసె
అరసెఁబో సుకుమారు నతిసత్త్వు సకల భూ
తేష్టు హీనయు నింద్య యేల కోరె
కోరెఁబో గుణశూన్య గుణవంతు నోజస్వి
హీనదుర్ముఖి రమ్యునెట్లుదరిసె
దరిసెఁబో నెఱసినకురులు ముడుతలది
యల్పభాగ్యను నాతఁడరయు నెట్లు.

ఇట్టి యుపహాస్యకర లోకహీనమైన
యీయకార్య మెట్టులయ్యె నసురనాశ
మునకె యామె రామునిబల్మిఁ బొందఁగోర
నయ్యె ఖరదూషణవధ దశాస్యు పగలు. 316

ఎన్నడు నింకసీతనసురేశుఁడు పొందఁగలేఁడు శక్తిసం
పన్నుడయైన రాముపయిఁ బాయని వైరముపూనె జానకిన్
గ్రన్ననఁ బట్టఁబోయెడి విరాధుని రాముఁడు నొక్కయమ్మునన్
తిన్నగ లీలనొక్కఁడె వధించె నిదర్శనమద్ది చాలదే. 317

వెఱపుంగొల్పెడి కర్మఁజేయు పదునాల్వేవుర్ నిశాటావళిన్
వెఱపేలేకయె యగ్నిఁబోలు శరవేగంబుచేఁ జంపె దు
ష్కరులౌ దూషణునిన్ ఖరున్ త్రుటిజనస్థానంబునన్ సూర్య భీ
కర బాణంబులఁ జంపెఁగాదె యవియుంగావొక్కొ దృష్టాంతముల్. 318

ఊడుకు నెత్తురుత్రాగు యోజనకర కబం
ధ వధ చాలదొకొ నిదర్శనముగ

ఆ కబంధుడు బిగ్గనార్చుచు వనులు ద
ద్దరిలఁ గూలెనదె నిదర్శనంబు

వీరుఁ డింద్రసుతుండు మేరుతుల్యుఁడు వాలి
రాముచేఁ బడె నిదర్శనము గాదె

ఋశ్యమూకాద్రిని నెద్రసుక్కు సుగ్రీవు
రాజుఁజేయుట నిదర్శనము సుండి

అఖిల రాక్షసులకు హితంబైన రీతి
నలరు ధర్మార్థ సహితమౌ నా విభీష
ణుని పలుకు- రావణుఁడు మోహమున మునింగి
యెసఁగియుంట- వాని చెవుల కెక్కదయ్యె. 319

ఆనాఁడే గనకన్ విభీషణు హితం బాలించుచో రావణుం
డీనాఁ డిట్లు శ్మశాన మయ్యెడిదికా దీ లంక; యారాముచే
ఆనాఁడే బలికుంభకర్ణుడతె నంచాలించి, సౌమిత్రిచే
ఈనాఁ డట్లతికాయుఁ డింద్రజి పడ న్నీ రావణుం డెంచఁడే. 320

అకట ! నాతనయుఁడు నన్నయాప్త భర్త
రణములోఁ జనిపోయినా రనుచు నచట
రాక్షసుల యేడు పింటింట ప్రబలమయ్యె
వేల రథగజాదుల రామవిభుడు చంపె ! 321

రుద్రుఁడో విష్ణువో మహేంద్రుండొ లేక
యముఁడొ రామురూపముఁ దాల్చి హతులఁ జేసె
రాముచే వీరులును జావ బ్రతుకుమీద
ఆశ కో దిక్కువిడి యేడ్తు మరయ నోర్పు. 322

శూరుఁడై వరములు పొంది ఘోరభయము
రామువల్ల రానెఱుగఁడు రావణుండు
దేవ గంధర్వులు పిశాచ దితిజు లేమి
రాముచేఁ బడ్డవారికి రక్షలేదు. 323

రావణునికి దుశ్శకునముల్ రణమునందు
కనఁబడె నవి రావణుని చావునె వచించు
మును పితామహుఁ డలరి రావణుని కిచ్చె
వరము దేవరాక్షస దానవాభయముగ. 324

నరులవల్ల భయంబు లేనట్లు వరము
అడగఁ డందుచే నరులచే నగును భయము
అది ధ్రువముగ రావణునికి నసురులకును
ఇపుడు ప్రాణాంతకమని సూచించుచుండె ! 325

వ: వరముచే బలవంతుడైన రాక్షసునిచే పీడింపఁబడిన వారై దేవులు ప్రకాశించు తపములు చేసి పితామహుని పూజ చేయఁగా అతఁడు సంతుష్టుఁడై మహాత్ముఁడగు పితామహుఁడు దేవతల హితమున కిట్లు చెప్పెను. నేడు మొదలు కొని దానవ రాక్షసుల భయముతో ముల్లోకములు సంచరింతురు. ఇంద్రునితో పాటు దేవతలెల్లఁ గలిసి త్రిపురహరుఁ డైన వృషభ వాహనుఁడు నగు మహా దేవుని ప్రసాదము పొందిరి. అంతలో మహాదేవుఁడు ప్రసన్నుఁడై దేవతలతో నిట్లనియె. "మీ హితముకై రాక్షసులకు భయము గూర్చు నొక స్త్రీ పుట్టును. ఆమెయే సీత. ఆమె దావానలము వలె రావణునితోఁ బాటు రాక్షసులను తిని వేయును. దుర్వినీతుఁడును దుర్మతి యయిన రావణుని దుర్ణీతిచే ఈ ఘోర మైన నాశము శోకము గలిగించును. యుగ క్షయ కాలమున కాలముచే నది రావణునిచేఁ బట్టుకొనఁబడిన వారికి లోకమున శరణిచ్చు వానిని ఎవనిని జూడము. మహా భయమున నున్న వీరికిని దావాగ్నిచేఁ జుట్టుకొనఁ బడిన యాడ యేనుఁగులకు వలె శరణము లేదు. అవసరమును బట్టి మహాత్ముఁ డైన విభీషణుడు ఇందువల్లనే ఆ రామునినే శరణుఁజొచ్చెను. అని రాక్షసస్త్రీ లందరు ఒకరినొకరు బాహువులతో గౌఁగలించుకొని పట్టుకొని భయభారముచేఁ గ్రుంగి పోయి దారుణముగా గట్టిగా బావురుమని యేడ్చిరి. 326

ఇటుల నింటింట జాలిగా నేడ్చుచున్న
రాక్షన స్త్రీల యేడ్పులు రావణుండు
ఆలకించుచు నిట్టూర్చి యతిగ నలిగ
క్షణము ధ్యానించి యపుడును గణిచి పండ్లు. 327

పటపట మన రక్తాక్షుఁడై ప్రక్కనున్న
రాక్షసులకును గన్గొనరాని వాఁడె
యుగుచుఁ గాలాగ్నివలె మూర్ఛనంది యచట
గొణిగి యుబెఁ గండ్ల దహించు జనుఁడు వోలె ! 328

"బలముల నడపు !" డని మహాపార్శ్వుతోడ
ఆ మహోదరుతో విరూపాక్షుతోడ
వడిగఁ బోయి చెప్పఁ డనఁగా వారు వెడలి
నృపునియాజ్ఞ వారికి వచియించి రంత.

వారలెల్లరు సరె యని ఘోరరూపు
లగుచుఁ బవ్యూహమును జేసి యనికిఁ బోవ
తగు దశాస్యుని బూజించి తమదు విభుని
జయముకోరి నిల్చి రకట ! ప్రాంజలులై యగుచు.

అంత రావణుఁడు వడిఁ గ్రోధాంధుఁ డగుచు
పౌరలెల్లరతో ననె నిదె యుగాంత
రవినిబోలు నమ్ములువేసి రామలక్ష్మ
ణులను యమునింటి కంపువాఁడనుగ నుందు.

ఖరుఁ బ్రహస్తు నింద్రజిఁ గుంభకర్ణుఁ జంపి
నందు కరులఁ జంపి ప్రతిక్రియను నొనర్తు
నా శరాభ్రావృత మయి యాకాశ మబ్ధు
లేర్లు దిశలు గన్పడనట్టు లిపుడె చేతు.

—: రావణుని యుద్ధావేశము :—

ఇదె కపియూధాల నిపుడె ఖండములుగా
వింటి యమ్ములచేత చీల్చివైతు
ఇఁకఁ గపిసేనల నీ పవనౌజపు
రథమెక్కి శరపంక్తిఁ గ్రమ్మివైతు

పడి నబ్జకేసరాల్‌వంటి క్రోతుల పద్మ
వదనాల నేన్గటుల్ పఱచి కూల్తు

నాళాఢ్య పద్మాలఁబోలు సశర కపి
ముఖముల రణభువిన్ బొలుపు గూర్తు

అనిని చెట్లతోఁ బోరాడు నగ్రగకపుల
వందలకొలంది నొక యమ్మొనైచి చీల్తు
ఎవరి భర్త యెవరి భ్రాత యెవరి సుతులు
హతు లయిరొ వారి నోదార్తు నరులఁ జీల్చి ! 333

నా బాణముల వ్రీలి నలుపైపు చెదరి చే
తనలేని కపులతో ధరణిఁ బరతు

నక్కల గ్రద్దలఁ బెక్కు మాంసాశను
లను మాంసములను తర్పణ మొనర్తు

శీఘ్రముగా నాదు శ్రేష్ఠ రథంబును
నా దీర్ఘ ధనుసును నయుత తెండు

చావఁగా మిగిలిన సర్వ రాక్షసులను
ననుబట్టి వత్తురిగా తను నటంచు

త్వరగ రావణుఁ డన మహాపార్శ్వుఁ డపుడు
అచటి సేనాధిపతులకు నాజ్ఞయిడఁగ
సైన్యనాథు లింటింటికిఁ జని త్వరమంత
లంకలో సేనఁగూర్చి వా రనికిఁ జనిరి. 334

క్షణమున రాక్షసుల్ రణమునల్ప భయంకర మూర్తులై మహా
ధ్వను లొనరించుచున్ వివిధ బాణ గదాసి పరశ్వధంబులున్
సునిశిత శూలముల్ ముసల సూక్ష్మ శతఘ్నుల కూట ముద్గరా
లను ఘనయష్టి చక్రముల రాజిత శక్తులఁ గొంచువెవ్వడిన్. 335

అనికిని బైలుదేఱ నసురాధిపుఁడున్ తన సూతుఁ డంతఁ దె
చ్చు నెనిమిదశ్వముల్ గలిగి శోభిలు స్యందనమెక్కి భీముఁడై
తన ఘనతేజు చేతను రథంబు ప్రకాశిల రాక్షసవ్రజం
బును గొనిపెన్ గర్జితను భూమిని జీల్చునటుల్ వడిన్ జనెన్. 336

పరమౌ గొప్ప రథంబులెక్కియు మహాపార్శ్వుండు నాపై మహో
దరుఁడున్ పిమ్మట శత్రుభీకరుఁడయై తానే విరూపాక్షుండు స్వీ
య రథం బెక్కియు బైలుదేఱి విజయం బాకాంక్షగావించి భీ
కర గర్జల్ హొనరించుచున్ జనిరి యుగ్రంబౌ రణస్థానికిన్. 337

ఇంక కాలాంతకుఁడౌ యముండటుల నెంతేఁ గ్రూరతన్ విల్లు స్వీ
య కరంబం దవలీల నెక్కిడియు దైత్యవ్రాతముల్ కూడరా
వికరాళుం డయి వేగయుక్త హయ సంవేగుండయై రావణుం
డింక తద్ద్వాతలె యున్న ద్వారముగ నిట్టే వచ్చె సంక్రుద్ధుడై ! 338

## —: రావణునికి అపశకునము లగుట :—

వ. అయ్యవసరంబున

సూర్యుండు ప్రభ పోవ స్రుక్కెను దివిపైని
కడలందు గాఢాంధకార మలమె
మేఘుండు రక్తంబు మిక్కుటంబుగ గుర్సె
సర్పములును దారి స్ఖలన మొందె
జెండాల తుదనుండి మెండుగా గ్రద్దలు
నక్క లశుభముగా నక్కి యఱచె
రావణు వామాక్షి రయముగ నదరెను
ఎడమ బాహువును కంపించె మిగుల

కంఠపు ధ్వని బొంగురై కడు భ్రమించె
మొగము దీనమై వెలవెలఁబోయి యుండె
అనికి రావణుం డరుదేఱ నదను నందు
మృతిని సూచించు శకునములి ట్లెన్నొ కల్గె. 339

వ. మఱియు నంతరిక్షముచేఁ బిడుగువంటి ధ్వనితో ఉల్కలుపడెను. అశుభముగా గద్దలు కాకులతోపాటు అఱచెను, తనకు కాలము తోసికొని వచ్చుచుండగా రావణుఁడు ఈ ఘోరమైన యుత్పాతములను లెక్కచేయక మోహమున వ్యథనొందువాడయి బయలుదేఱెను. ఆ మహాబలులగు రాక్షసుల రథముల ఘోషనువిని వానరసైన్యముకూడ యుద్ధమునకై యెదుర్కొనెను. అంత ఒండొరులఁబిల్చుకొనుచు కోపించి జయముకోరుచున్న కపిరాక్షసులకు తుములమైన యుద్ధము జరిగెను. పిదపఁ గ్రుద్ధుడయిన దశగ్రీవుఁడు కాంచన భూషణములుగల శరములువర్షించి వానరసేనలపై మహాయుద్ధమును చేసెను. రావణుని బాణములకు కొందఱు శిరస్సులుతెగి కొందఱు వక్షములు కొందఱు చెవులునూడి కొందఱు ఊపిరులువీడి కొందఱు కన్నులుచిట్లి పడిరి. ఎట్టెటు దశగ్రీవుఁడు కండ్లెఱ్ఱచేయుచు త్రిప్పుచు రథముతో యుద్ధమున వీరవిహారముసల్పెనో అట్టటు రావణుని శరవేగమును వానరపుంగవులు సైపలేక పోయిరి. 340

అతులన్ రావణు బాణజాలములచే నంగాల్ తెగన్ భూమిపై
నిటులట్టుల్ పడి కూలు వానరులచే నెల్లన్ భువుల్ నిండె, ను
ద్భటుఁడౌ రావను బాణవర్షముల సైపన్‌లేక దీప్తాగ్ని ముం
దటఁ గీటంబులు వోలె నంతఁ బరువెత్తంజొచ్చి రవ్వానరుల్. 341

వాడియైన బాణములచే బాధ పొంది
పావకార్చులతో దహింపంగఁ బడెడి
గజములును బోలెఁ బరువెత్త, గాలి మేఘ
ములు నటు కపుల నసురాధిపుఁడును దఱిమె. 342

రాక్షసేశుఁ డిటు కపుల రణమునందుఁ
ద్రోలుచును వేగ రాముని దరికిఁజేరె
అంతఁ బరువెత్తు కపులను నరసి శిబిర
మున సుషేణుని సుగ్రీవుఁ డనిచి త్వరగ. 343

రావణు నెదుర్కొనఁ జెట్ల ప్రహరణముగఁ
గొనుచు నరుగ వానిని జుట్టుకొనియె కపులు
ప్రక్కలను వెన్క నాలుగు పార్శ్వములను
గిరులఁ జెట్లను గొని వేగ యరిగి రనికి. 344

అటు సుగ్రీవుఁడు గొప్ప గర్జనముతో నా యా నిశాటాగ్ర్యులన్
త్రుటి నేలం బడఁగొట్టుచున్ విపుల గాత్రుండై యుగాంతంబునన్
పటుపై వీచెడి వాయు వద్రుమలబలెన్ బాణా ప్రప్రయోగించి పల్
రటితాభ్రంబు విహంగ పంక్తిపయి బాళ్ళంబోలె గుర్సెన్ గడున్. 345

అటు సుగ్రీవుఁడు కుర్సినట్టి శరవర్షాసారముంబట్టి యు
త్కటదైత్యుల్ శిరముల్పడన్ దెగియు క్రిందన్కూలు పెన్గొండ గుం
పటు నేలంబడి యార్వఁగాఁగని విరూపాక్షుండు దుర్ధర్షుఁ డం
తట స్వాఖ్యన్ గడుఁజెప్పి పైకెగిరి చెంతన్హస్తిపై నెక్కియున్. 346

పడిగర్జించుచు వానరాళి పరువెత్తంగొట్టి సుగ్రీవుపై
కడు బాణంబులువేసి పాఱునసుర గ్రామంబులన్నిల్పి యె
క్కుడు హర్షంబును గూర్చుచుండ శరముల్ కోకొల్లలేయున్ గపీ
శుఁడు బాణంబుల దెబ్బలన్దిని సరోషుండై మహావేగుఁడై! 347

ఇటు నేమాత్రంబును నూరకుండఁ దగదంచెంతో మదిన్బూని యొ
క్కటి చెట్టెత్తి గజంబుమోముపయి వేగంగొట్టఁ జాపంబు నం
తటి దవ్వు ద్విరదంబు తప్పుకొని బాధన్ప్రసుక్కి యార్వంగ నం
తట నాప్రసుక్కిన యేన్గునుండిదిగి యాదైత్యుండు క్రోధాంధుడై. 348

ఎదురై పోయియు నెద్దుచర్మమును నెంతేవాడియౌ కత్తిఁ జేఁ
గదియుంబట్టి లఘుగ్రవిక్రమము బింకంబొప్ప సుగ్రీవు సు
న్మథుఁడై కొట్టఁగఁబోవ వానరవిభుండంతన్ వడిందూకి నీ
రదముంబోల్ పెనుబండరాయి విసరన్ రక్షోవరుండుగ్రుఁడై. 349

పరిగాఁబైఁబడు బండరాయిగని యద్దానిన్ స్వఖడ్గంబుచే
విఱుగఁగొట్టి కపీంద్రుఁగొట్ట క్షణమావీరుండు నిశ్చేష్టుఁడై
మరలన్ జేష్టనుబొంది పైకెగిరి భీమంబైన పెన్ముష్టిచే
నురమున్ గ్రుమ్మఁగ దైత్యముఖ్యుఁ డపు డెంతోకొట్టెఁ దద్వర్మమున్. 350

అటు గొట్టన్ గవచంబు నేలఁబడఁగా నాలోనఁ బెన్గాళ్ళతో
నటఁదన్నన్ భువిసోలిలేచి వడిపజ్జాభ ప్రహారంబు లే
యుటయున్ దైత్యుడు తెల్విఁదప్పకొని యెంతోదూకి పెన్గుప్పిటన్
పటు వక్షంబునఁగొట్టఁ గ్రుద్ధుఁడయి శేవన్ గాల మీక్షించియున్. 351

వడి సుగ్రీవుఁడు దైత్యు పెన్నుదురుపై వైవంగఁ దద్వజ్రసం
దృఢమౌనా పుఱిచేతఁగొట్టఁబడి యాపృథ్విన్ విరూపాక్షుండు నె
క్కుడు నుర్గుల్గల నెత్రుగ్రక్కుచును బెన్గొండన్ ఝరింబోల న
క్కడి యావానరులెల్లఁ గన్గొనిరి రక్తక్లిన్నునా రాక్షసున్ 352

కనుగ్రుడ్లూడి ధరన్బొరలు నారక్షశ్శ్రేష్ఠు వావిడ్చి జా
లిని పైకార్చెడి దైత్యుఁజూచుచుఁ గపుల్ ప్రీతిల్లి గర్జింప భీ
తిని దైత్యుల్ పడియార్వ నాధ్వనులు నుద్వేలంబులై వార్ధులో
పున నున్మత్తపు గాంగనీరములఁ తుల్యంబౌచు సోకెన్దివిన్. 353

బలము లొండొరులాజిఁ జంపంగఁబడఁగ
వేసవిని నెండిన హ్రదాల విధినిుండె
స్వబలము లణఁగిపో విరూపాక్షు డడఁగ
దితిజపతి రావణుఁడలిగె ద్విగుణముగను. 354

చెల్లచెదరై కపులచే ఛిన్నమైన
బలము ప్రతికూలమైన దైవమును జూచి
వ్యథ జనింప దరిగనున్న యరివినాశి
యా మహోదరుఁ గనుగొని యనియెనిట్లు. 155

ఇప్పుడో మహాబాహు! జయించునాశ
నీయెడనె నుండె నరిఁజంపు నెఱపుబలము
ప్రభుఋణము దీర్చునట్టి కాలంబె యిదియు
వెడలిబాగుగఁ జూపుము విక్రమంబు. 156

అనుచు రావణుఁడన సరేయనుచు దైత్య
ముఖ్యుఁడగు మహోదరుండును పురుగు నిప్పు
బలె నునిరి సైన్యమునుజొచ్చి ప్రభునియాజ్ఞ
వీరుఁడగుచుఁ దేజస్వియై పోరుసలిపె. 157

ఘనబలులు వానరులు భయంకరమయిన
యరిబలముఁజొచ్చి దైత్యుల నపుడె కొట్టి
రామహోదరుడో యల్గి యరుల తొడల
కాళ్ళుచేతులు నరకె బంగరు శరాల. 158

అపుడు కపులు దైత్యులచేత నడఁచఁబడుచు
దిశలఁబాఱు సుగ్రీవు దిక్కుఁజనిరి
ఆజిలోఁ గపిసైన్యము హడలి పఱవఁ
గనుచు సుగ్రీవుండును మహోదరుని నెదిరె. 159

అంత గిరివంటి ఘనఘోరమైన ఱాయి
గొని కపీశుఁడు దైత్యుని దునుమవిసర
అదియుఁ బైబడుచుండుట నరిసిచెదర
నామహోదరుడమ్ముల నపుడెకొట్టె. 160

వేగనాతాయి బాణాల వేయి ముక్క
లగుచు భువి గ్రద్దల సమూహమట్లు పడియె.
అట్లు తాయి భిన్నమగుట నరసి యలిగి
చెట్టుపీకి సుగ్రీవుఁడు చిమ్మికొట్టె. 361

అపుడు పరపురంజయుఁడౌ మహోదరుండు
బాణములచేత నదిచీల్ప తానుజూచి
కపివిభుఁడు భూమిఁగల పరిఘను గ్రహించి
హస్తలాఘవమునుజూప నసురనెదిరె. 362

ఆపరిఘకొనచే దైత్యు నశ్వములను
కొట్ట గుఱ్ఱముల్పడిన యాకొమరు రథము
దిగి మహోదరుఁడును గదన్ తిగిచిపట్టె
గదను పరిఘఁబట్టిన విక్రాంతు లెచ్చి. 363

గోవృషభములట్లు మెఱపు మేఘులనుబోలి
ఊఱుము దైత్యుఁడు గదవేయు దరికివచ్చు
మండి రవిఁబోలు గదఁజూచి మహిత కపియు
పరుష తామ్రాక్షుఁడయి గదన్బరిఘువైచె. 364

పరిఘ గదచేతఁ బడిపోవ ధరణినున్న
హేమభూషితమైనట్టి యినుప ముసల
ము గ్రహించివేయఁగ నాతడును మఱొక్క
గదనుబట్టి క్రుద్ధుండయి కరముఁగొట్టె. 365

అంత నాగదయుఁ బరిఘయు నతని పైని
పడఁగ మండెడి యగ్నులవలెను నిద్ద
ఱొండొరులను గుప్పిళ్ళచే మండికొట్టి
నిద్ధఱును నేలపయిఁ బడిరింక మఱల. 366

వారలిద్దఱు వడిలేచి బాహుబలము
కనఁబఱచి కొట్టుకొని శ్రమంబునను బ్రసక్తి
కవలదరినున్న ఖడ్గము నసురగొనఁగ
కపిపతియుఁ జర్మతోడ ఖడ్గమును గ్రహించె. 317

వారు క్రుద్ధులై యఱచుచుఁ బరువులెత్తి
కత్తులెత్తుచుఁ బొంగుచుఁ గదనమందు
తెలివిచూప దక్షిణపు మండలము గాఁగ
తిరుగుచును గెల్పుకయికొట్టి తిరిగినారు. 318

ఆ మహోదరుఁడో శూరుఁడగును వీరు
మెచ్చుకొనుచు మహాచర్మ గుచ్చుకొనఁగ
కత్తిపడవేయఁ గత్తితోఁ గత్తి యుంటు
కొనఁగలాగి కపీంద్రుఁడు క్రోధమెసఁగ. 319

స్వర్ణకుండల యుక్త శీర్షంబుతోడఁ
గొని శిరస్త్రాణమునుగూడఁ గొట్టివైవ
తెగినతలగల్గి భువిపైని ద్రెళ్ళిపడఁగ
అదిగనుచు దైత్యబలములు నంతబాఱె. 320

అవల హర్షించి సుగ్రీవుఁ డప్పుడార్వ
రావణుఁడు మండె, హర్షించె రాముఁడపుడు
రాక్షసులు దీనచిత్తులై త్రస్తులగుచు
దిశలఁ బరువెత్తినారు వివర్ణమతిని. 321

ఆ మహోదరు భువిఁగూల్చి యింద్రునట్లు
సూర్యసుతుఁడు ద్యుతిమెఱసె సూర్యుఁడట్లు
అంతఁ గపిరాజు జయమొంద నవనిపైని
ప్రాణులు, దివిన్ సురలు మెచ్చ పటిలెనతఁడు. 322

ధరను సుగ్రీవుచే మహోదరుఁడు కూల
ఆమహోదరుఁడల్గి రక్తాక్షుఁడగుచు
భయముగొల్పు నంగదుసేన బాణతతుల
కాస నుండి పండ్లటురాల్చె గపులతలలు. 373

—: అంగదుఁడు మహాపార్శ్వునితో పోరుట :—

వ. మఱియు నతఁడు కొందఱు వానరముఖ్యుల శిరములను కొందఱి స్కంధములను కొందఱి పార్శ్వములను బాణములచేత ఛేదించెను. ఆ మహాపార్శ్వునిచేత బాధింపఁబడి వానరులు విషణ్ణులయి చేష్టలుడిగి పాఱిరి. అంత నంగదుఁడు బలములు ఉద్విగ్నమగుటఁజూచి పర్వమందు సముద్రమువలె వేగముగ విజృంభించి సూర్యరశ్మి సమకాంతియగు నినుపపరిఘను గ్రహించి మహాపార్శ్వునిమీఁదఁ బడవైచెను. అపుడా ప్రహారముచేత చైతన్యముపోవ అతఁడు రథమునుండి సంజ్ఞలేక క్రిందఁబడెను. అపుడు నీలమేఘమువంటి మహావీరుఁడయిన ఋక్షరాజు మేఘమువంటి తన వ్యూహమువెడలి గిరిశృంగమువంటి పెద్దఱాతినితీసి గుఱ్ఱములను రథమును పడఁగొట్టెను. అంతట సంజ్ఞ పొంది మహాబలుఁడయిన మహాపార్శ్వుఁడు అంగదుని జాలబాణములచేగొట్టె. మూఁడుబాణములచే జాంబవంతుని బహుశరములచే ఋక్షరాజయిన గవాక్షుని4
వక్షమందు గొట్టెను. 37

అంత నంగదుఁడు శరభిన్నాంగులయిన
జాంబవంతు గవాక్షుని సరిగఁజూచి
ఘోరపరిఘను గ్రహియించి క్రోధమెచ్చ
రెండుచేతులఁదిప్పి రాత్రిచరుఁ గొట్టె. 375

అప్పుడా పరిఘను ద్రిప్పి యానిశాటు
సశరధనువు శిరస్త్రమున్ క్షమనుగూల్చి
చండుఁ డయి యఱచేతితోఁ గుండలాఢ్య
కర్ణమూలానఁ గొట్టియు గర్జచేసె. 376

ఇంక మహాపార్శ్వుఁడును మహాధృతియు ద్యుతియు
గలిగి వేగముగా నొంటికరముతోడ
నూనెతో బ్రతిదినమును సానపట్టు
భూధ్రసారమౌ గొడ్డలినిబూని వడిగ. 377

అంగదు నెడమ విపులభుజాగ్రమందు
వేయఁగా దానిలాఘవ మేర్పడంగ
వేగఁ దప్పించుకొని బహువీర్య మొప్ప
పితృసమ పరాక్రముడయి గుప్పిడినిబట్టి. 378

పిడుగువంటి స్పర్శముగల్గి వడిగఁబడెడు
నట్లుకొట్ట రాక్షసుఫాల మపుడె వ్రీలె
మఱియు నాదెబ్బతోఁ గళ్ళుతిరిగి నేలఁ
బడఁగ దరిసైన్యమును తోకముడిచి పాఱె. 379

అటు మహాపార్శ్వుడు పడినయటులు తెలిసి
రావణుఁడు మఱియుమండె, రాక్షసులును
భీతినార్వ వానరులురెచ్చి వేగ సింహ
నాదములుచేయు లంకయున్ బ్రద్దలయ్యె. 380

అట్లె కపినాదముల నింద్రుఁ డమరగణము
చేయునుత్సాహగర్జన చెవులఁబడఁగ
రాక్షసాధ్యక్షుడై నట్టి రావణుండు
మరల యుద్ధాభిముఖుడౌచు తిరిగెవేగ 381

బవరంబందు ఘనుల్ మహోదర మహాపార్శ్వుల్ గడున్బోరి కూ
ల విరూపాక్షుడు మృత్యువాతను బడన్ రక్షోవిభున్ క్రోధ ము
ద్దవడిన్పై బడ సూతుతోనసె నమాత్యశ్రేణి దుఃఖంబు నీ
రవ లంకావ్యధఁ బాపెదన్ దునిమి ఆరామున్ సుమిత్రాసుతున్. 382

నేవడిఁబోయి సీతయును నెయ్యపుఁ బూవును పండుగల్గి సు
గ్రీవుఁడు జాంబవంతుఁడు నొగిన్ హనుమంతుఁడు మైందుడంగదుం
డావరుఁడౌ సుషేణుడును నాద్వివిదుండును గంధమాదనుం
డావరశాఖలై తగిన యానరరామతరున్ పెకల్చెదన్. 383

అని గర్జించి రథంపుఘోషల దిగాద్యంతంబులున్ సర్వముల్
ధ్వనియింపన్ వెనువెంటనే యతిరథాధ్యక్షుండయౌ రావణుం
డును నారాము నెదుర్కొనెన్ నగములేళ్లున్ కాననంబుల్ పురా
లును నేనుంగులు పందులండజ మృగాలున్ భూమికంపింపగన్. 384

అంత రావణుఁడు సుఘోరమైన తామ
సాస్త్రమునుగొని కపులసైన్యము దహింప
కపులు నెల్లరును పడిరి యుగ్రంబయైన
రజములేచె భగ్నులు వానరాళివల్ల. 385

బ్రహ్మ నిర్మించినట్టి యస్త్రమును వారు
సైపలేకపోయిరి రాక్షసాధిపుడును
వేసిన శరాలఁగని నంతగాసి చెంది
వందలుగఁ గపిసేనలు భగ్నమయ్యె. 386

రాముఁడో నిల్చియుండె; నారావణుండు
కపులసేనఁ బర్వెత్తించి; కదలకుండ
ఓటమియె యెఱుంగక యటనున్న రాము
కడకుఁజని భీకర రణరంగమున నపుడు. 387

అట శత్రుంతపుఁడు దజ్జపత్త్రి సువిశాలాక్షుండు సద్బాహు వు
ద్భట వీరుండగు రాముఁడానుజుతో భాసిల్లి శ్రీవిష్ణుముం
గిట దేవేంద్రునిఁబోలె నుండఁగను నింగిన్ రాముఁడుండె ముం
డట దీర్ఘంబగు విల్లుబాల్చి నిలుచుండన్ రావణుండారసెన్. 388

అవలన్ లక్ష్మణయుక్తుఁడై బలియుడై యుంపున్న రాముండు నా
హవమందున్ బరువెత్తువాసరులఁపై కత్యంతమున్ వచ్చు నా
దితిజాధీశుని రావణుంగనియు సెంతేహృత్తై యుండి యా
భువి భేదించెడునట్లు కార్ముక వరంబున్బట్టి వేగంబుగాన్. 389

రావణు బాణజాలముల రాముఁడునెక్కుఁడ పెన్ విభీ
తావహ ఘోషలన్ గడుశతంబుల కొద్దికపుల్ నిశాటులా
రావము చేయుచుండిరి రాజకుమారుల బాణవంథలో
రావణుడర్కు చంద్రుదరి రాహువమాసనుబోలె భాసిలెన్. 390

వ. అంతట ఆ రావణుతో మొదట రాముఁడు దాను యుద్ధము చేయ గోరి ధనుస్సుసారించి యగ్నిశిఖలవంటి బాణములువేయుఁగా అవి వచ్చిరాగనే మహాతేజుండగు రావణుఁడు బాణములచే వానిని వారించెను. ఒక బాణముతో నొకబాణమును, మూటితో మూటిని, పదింటితో పదింటిని హస్తలాఘవము చూపుచు లక్ష్మణుని బాణములను ఛేదించెను. అవ్వల సమరంజయుఁడగు రావణుఁడు సౌమిత్రినిదాటి శైలమువలె నచలుడయియున్న రాముని సమీపించెను. అటుసమీపించి క్రోధముచే నెఱ్ఱదేఱిన నేత్రములతో రామునిదరికివచ్చి రామునిపై శరపరంపరలను గురిపించెను. అంత రాముడు రావణ బాణములను చూచి అవి వచ్చినదేతడవుగ శీఘ్రముగ భల్లములతో ప్రకాశించు ఘోరముగాఁ గోపమునఁ బయిబడు పాములనుబోలె ఛేదించెను. 391

రామునిమీఁద రావణుఁడు రావణుమీఁదను రాముఁడున్ కడున్
భీమసుతీక్ష్ణ బాణములు వేగముగాఁ గురిపించి రొండొరుల్
ఏమియు వెన్ను చూపకయె యెంతయొకాలము సవ్యమండలం
బై మఱియున్ మఱిన్ మఱి యసమాధ్యశరాల్ కురిపించిరంతటన్. 392

అటు వారుగ్రసమాధ్యులై బలముతో నన్యోన్యమే యొక్క మా
రట యుద్ధంబొనరింపఁ బ్రాణులు భయంబుం మెందెన్ దివిన్ మహో
త్కట నానాశరవృష్టులున్ గురియ నుగ్రంబైన యెండల్చనన్
పటు విద్యుత్తుల మాలికల్ వరుసగా వ్యాపించినట్లే తగెన్, 393

శరవర్షంబుల నాకశంబును గవాక్షాఢ్యంబుగాఁ దోఁచె వా
రిరువుర్ దారుణ గృధ్రపత్త్రకులు తీవ్రీభూత బాణావళిన్
కురుపన్జేసి దివంబునంధతమసక్రూరంబుగాఁ బోరొన
ర్చిరి సూర్యుండును నస్తమింప జలదాలే లేచినట్లొప్పఁగా. 394

ఒండొరుల్ చంపంగ నుంకించెడి తదాజి
వృత్రేంద్రుల రణంబు రీతిఁ బరఁగె
ఇరువురు విలుకాండ్రె యిరువురు చతురులె
యిరువు రస్త్రవిదులె యిరువు లేర్చి
రిరువు లెట్లెటు పోవుదు రటు హతహత వా
ర్ధ్యూర్మ్ము లటుల శరమ్ములును వెడలె
బాణప్రయోగ ప్రవర లోక రావణ
రావణుఁ డాస్యాన రాముఁ గొట్టె

అతఁడు రౌద్ర ధనుష్కృత వ్యధ నుత్ప
లదళ రుచిఁబోలె దానిలీలగ సహించె
ఇఁకను రాముఁడల్గి విలుగ్రహించి మిగుల
నస్త్రములవేసె ఘనతేజుఁడగుచు నపుడె. 395

ఘన మేఘంబులలో నభేద్య కవచాగ్రంబులందుఁ బడ్డట్టి దా
రుణ బాణంబులుగూడ రావణుని కెట్లున్ బాధకల్గింప వా
యెను నింకన్ సకలాస్త్రకోవిదుఁడు తానేరాముఁ డేపార రా
వణు ఫాలంబున గొప్పదౌ శరముచే పైశంబ కొట్టెన్ గడున్. 96

వ. అంత నా రాముని బాణంబులు అయిదు తలల పాములు వలె రావణునికిఁ బ్రతికూలములై బుసలు కొట్టుచు భూమిని జొచ్చెను. క్రోధముచే నొళ్ళు తెలియని రావణుఁడు రాముని యస్త్రమును కొట్టి మహా ఘోర మైన యాసురాస్త్రమును ప్రయోగించెను. అది సింహములు, వ్యాఘ్రములు, కంక ళములు, కాకులు, గ్రద్దలు, డేగలు, నక్కలు ఈ మహామృగములు మొదలైన జంతువుల ముఖములను దాల్చి నోరు దెఱచి భయంకరములై అయిదు ముఖములు గలిగినవై నాకుచున్న ట్లున్న వాడి బాణములను విడిచెను. ఇంతే గాక గాడిద ముఖములు మకర, సర్ప ముఖము లైన యితర శరములను గూడ అవి రామునిపైకి సృజించెను. బుసలు కొట్టు వీనిని మాయావియైన రావణుడు విడిచెను. అప్పు డా రఘునందనుఁడు అసురునిచేఁ గొట్టఁబడి మహోత్సాహుఁడై యెనకోపనుఁడై పావకాస్త్రమును ప్రయోగించెను. అది అగ్నివలె దీప్తముఖములు, సూర్యునివంటి ముఖములు, చంద్రునివంటివి, అర్ధచంద్ర ముఖములు ధూమకేతు ముఖములు, గ్రహ నక్షత్ర ముఖములును, మహోల్కాముఖములు విద్యుజ్జిహ్వోపమములును ఇతరములైన శరముల సృజించి ఆ రాముని శరములు రావణుని శరముల నెదుర్కొని ఆకాశమున లయ మొందినవి. ఎవరిని క్లేశపెట్టని కర్మగల రామునిచే ఆసురాస్త్రము నిహతమగుటఁ జూచి కామరూపు లగు సుగ్రీవ ప్రముఖు లగు కపులు గర్జించిరి. రాముని చుట్టుకొని రావణబాహు నిర్మితమైన యస్త్రము నిహతమైనట్లు చూచి సంతోషముచే కపీశులు నాదములు చేసిరి. 97

అంత నా యస్త్రమును ప్రతిహతముకాఁగ
దనుజపతియు రెట్టింపు క్రోధమున మునిఁగె
మఱియుఁ దొసగిన రౌద్రాస్త్రము మహితబలుఁడు
రావణుఁడు వేయఁబూనె నా రాముపైని. 398

ఆ రౌద్రాస్త్రమునుండి శూల గద లేపారెన్ జ్వల ద్వజ్ర ప
ట్టాసరంబౌ ముసలాలు వింట మొలకెత్తంజొచ్చె, సందుండి యే
వేశే ముద్గర కూట పాశ గణముల్ పిడుగుల్ యుగాంతంబునం
దేరీతిన్ పవనాలు వెల్వడు నటే యెన్నో బయల్దేఱఁగా ! 399

అంత నుత్తమాస్త్ర విదులం దగ్రసరుఁడు
రాముఁడు వడి గాంధర్వాస్త్ర రాజ మేసె
రావణుఁడు తన యస్త్రము ప్రతిహతంబె
యగుటఁ గని యల్గి సౌరాస్త్ర మపుడువేసె ! 400

అపుడు భీమవేగుండు దశాస్యుఁ డెంతొ
నేర్పుతో వేయు నస్త్రాన నింగినుండి వెలుగు
చక్రములు బైల్వెడల సూర్యచంద్రు లాది
గ్రహముల దిశ లటు వెల్గె గగన మెల్ల. 401

చిత్ర చక్రాల రాముఁడు శీఘ్ర మరసి
యడఁచ నది చూచి రావణుఁ డపుడు రెచ్చి
పది శరంబుల రాము సర్వంపు మర్మ
ములను గొట్టి విజృంభించె పూర్తిగాను. 402

రావణుని పది బాణాల రాముఁ డపుడు
కొట్టఁబడి సుంతయుఁ గదలకుండె మఱియు
రావణుని సర్వగాత్రాల రణవిజేత
రాముఁడును తీవ్ర బహుళశరాలఁ గొట్టె. 403

ఇంతలో లక్ష్మణుండు రాము నించు తమ్ము
డపుడె యేడు బాణంబుల నట గ్రహించి
రావణునిది మనుష్య శీర్ష ధ్వజంబు
జ్వలితకుండల సూతు శీర్షమును గొట్టె.

మఱియు లక్ష్మణుఁ డిక గజ కర సమాన
రావణ ధనుస్సు నైదు శరాలు వేసి
విఱువ; నంతట నీలాభ్రగిరి సమాన
వాజుల విభీషణుఁడు గదన్ వైచి కొట్టె.

అపుడు గుఱ్ఱాలు కూలిన యరద మిట్టె
ఎగిరి దిగి రావణుఁడు భ్రాతయెడల మెండు
కోపమున మండుచును చాల గొప్ప శక్తి
దాల్చి యా శక్తి విసరెను తమ్మునిపయి.

దరికి రాకుండనే సుమిత్రా సుతుండు
దాని మూఁడు బాణాలచే త్వరగ నఱుక
నంతఁ గపులలో ముదముచే నలమె ధ్వనులు
అప్పు డది నిప్పుమిసి యుల్క యట్లు పడెను.

ఇంక గొప్పగా మిగుల నర్చింపఁ దగియు
కాలునికిఁ గూడ దరిచేరగా నశక్య
మగుచు తన తేజుచే నుండి యులరు నొక్క
విపుల శక్తి రావణుఁడును వేగఁబట్టె.

బలయుతుఁ డగు రావణునిచే వడిగ విసరఁ
బడుచు దరియురాక మహేంద్రు వజ్ర మట్లు
ప్రభలనది మహాఘోరమై జ్వాల లుమిసె
నంతలో వీరలక్ష్మణు డడ్డునిలిచె.

ప్రాణ సంశయమునఁ బడ్డ యా విభీష
ణుని మహావీరుఁడైన లక్ష్మణుఁడు గాన
రావణుని ఎదురుకొని విల్ సాగఁదీసి
రావణుని పైని బాణ వర్షములు గురిసె. 410

అంత బాణవర్షాల మధ్యన్ గనుబడ్డ
రావణుఁడు విభీషణునిపైఁ బరాక్రమంబు
చూపలేక వానిని గొట్టు చూపు త్రిప్పి
లక్ష్మణుఁడు విడిపించిన భ్రాతను వడిన్. 411

లక్ష్మణునిపైపు తిరిగి యీలాగు పలికె
"ఓ బలశ్లాఘి ! యింక నీవో విభీష
ణు నిటు విడిపించుట, విభీషణుని త్యజించి
వినుము యాశక్తి నీపయిన్ వేతుఁ ద్వరగ. 412

ఇది నీ గుండెను జీల్చి నెత్రు గురుత్తు రలరం గింపారు; నాబాహుచే
వదలగాఁ బడినట్టి శక్తి యిది నీ ప్రాణాలనే తీయు కే
గద యుంచున్ రిపుహంత్రయై కడు సమోఘంబై నినాదించు నె
న్మిది గంటల్ గల శక్తి లక్ష్మణు పయిన్ వేసెన్ దశాస్యుం డటన్. 413

అది వజ్రంబటు ఘోష పెట్టుచు భయంబత్యంతమున్ గూర్చుచున్
కదనోర్విం దన తమ్ముఁ గొట్టఁ గని "భగ్నంబౌచు నీశక్తియున్
వృథయౌఁగాక శుభంబు లక్ష్మణునికి పేగావుత మ్మంచున
య్యుదసన్ బైఁబడు శక్తిఁ జూచి యనె నొయ్యన్ రాముఁడయ్యాజిలో.
414

ఇది దుఃఖించెడి వేళ గాదనుచు నెంతేఁ జిత్తమం దెంచి యా
యదనన్ రావణుఁ జంపఁబూని తుములంబౌ యుద్ధముం జేసియుం
బెదరెక శక్తి విభిన్న వక్షసుని రక్తక్లిన్ను భ్రాతన్ పదే
పదె రాముండు సమస్త యత్నములతో సర్వార్థ్యాద్రిన ట్లాంసెన్. 415

బలవంతుండగు రావణుండు విసరన్ వక్షంబునన్ గ్రుచ్చు కొ
న్నలస చ్ఛక్తిని వానరాగ్ర్యులు ప్రయత్నాల్ చాల గావించియున్
పలు బాణంబుల దెబ్బలన్ దినుటచే భంజింపలేరైరి యా
తల సౌమిత్రి యురంబుఁ జీల్చుకొనుచున్ తచ్ఛక్తి చొచ్చెన్ భువిన్. 416

బలవంతుండగు రాముఁడంత భయదంబౌ శక్తి ముంజేతులన్
గలియం బట్టియు విర్చిపైచి మది లాగంజాలు నాయింతలో
పల మర్మంబులఁ జీల్చు బాణముల సర్వాంగంబులన్ రావణుం
డలకన్ మండియు వేసె రాముపయి నయ్యాజిన్ విజృంభించు మన్. 417

అట రాముండిక రావణాస్త్రముల లక్ష్యం బేమి గావింప క
చ్చొట సౌమిత్రిని గాంచి గలించి హనుమత్సుగ్రీవులం జూచుచున్
ఇటుపైనన్ గపిముఖ్యులార ! యిట మీరీ లక్ష్మణుం జుట్టి ముం
దటనే యుండుఁడు విక్రమించు నదనున్ ప్రాప్తించె నీనాటికిన్. 418

వేసవి పోవ మబ్బు కయి వేచెడి చాతకపక్షివోలె నే
నీ సమయంబు కోసమయి యెప్పటినుండియొ వేచియుంటి నేఁ
డా సమయంబు వచ్చె మదనంత పరాక్రమముం గనుండి నే
నీ సమయంబు నందె వధియించెద రావణు పాపనిశ్చయున్. 41-

ఇక వాఁడెంతొ సమయము బ్ర
దుకఁ డీ రావణుని జంపుదును గపులారా
ఇక నుంచె రాముఁడో మఱి
యిక రావణుడో యిద్ద రెటు నుండరు గా. 420

చనియెన్ రాజ్యము కాననంబులు నివాసంబయ్యె పల్దండకన్
పనులం దట్టిటు వర్వులెత్తితిఁ గటా పై దేహింపో దైత్య ఘ
ర్షణ మయ్యెన్ ఘన దుఃఖముల్ నరక తుల్యంబైన కష్టాలు గ
ల్గెను నేఁ డా ఖలు రావణున్దునిమి వర్జింతున్ సమస్తాపదల్. 421

ఎందుకై వాలిన్ వధించి సుగ్రీవుఁ బ
తిగఁ జేసి కపి సేనఁ దెచ్చినాఁడ
ఎందుకై సేతు బంధించి వార్ధిని దాటి
యుద్ధము చేయ సన్నద్ధుఁ డైతి
అందుకే రణమధ్య నా దురాత్ముని బాపిఁ
దునిమితీరవలెఁ బోఁద్రోయరాదు
అందుకే కళ్ళకు నగపడ్డ రావణు
దృగ్విషాహి నటు త్యజింపరాదు

ఇంక దుర్ధర్షులగు * దానవేంద్రులార !
స్వస్థులై పర్వతాగ్రాలఁ జఱియలందు
మీరు గంధర్వ ఋషి దేవ చారణులను
రామ రావణు యుద్ధము గాంతుగాక. 422

వ. మఱియుఁ జరాచరము లగు లోకములు భూమి యున్నంత వఱకు
పతలును జెప్పుకొనునట్లు యుద్ధమున ఘోర కర్మ గావించెదను. అని పలికి
ులి బంగారు భూషణములు గల వంచలకొలఁది బాణములతో రాముఁడు రావ
ుని గొట్టఁగా రావణుఁడును జ్వలించు బాణములును, ముసలములును రాము
పై ధారలచే మేఘము వలె వర్షించెను. ఒండొరులఁ గొట్టుకొనుచు రామరావ
ుల బాణముల కన్యోన్యము యుద్ధము తుములమై ఘోష యుక్తమై జరి
గెను. రామ రావణులు ప్రయోగించిన బాణములు భిన్నములై, శీర్ణములై
ుండుచు అంతరిక్షమునుండి క్రింద రాలినవి. అద్భుతావహమై వారియుద్ధము

* దనువు కొడుకులు—దానవులు శ్రేష్ఠులు. దానవులువేరు, దైత్యులువేరు.

సమస్త భూతములకు భయము గొల్పుచు, మింటను నేలను ధ్వని చేయుచుం డెను. మహాత్ములకై దీపించి ధనుస్సును ధరించిన రాముఁడు వేసిన శరజాల వృష్టులచేఁ గప్పఁబడి రావణుఁడు బాధపడి భయముతో గాలితుఫానుచే మబ్బు వలెఁ బారిపోయెను. 423

బలియౌ రావణు శక్తిచేఁ బడిన యా భ్రాతన్ మహాశూరు శ
త్రులచేఁ దడ్సిన లక్ష్మణున్గని– దురాత్ముండైన యా రావణున్
ఖలు ఘోరాహవమందు నొంచుచు రేఘుంబుల్వడి రీ
తుల వర్షించుచున్ సుషేణుఁగని కోద్దాఁ బల్కె రాముండిటుల్. 424

ఇదిగో రావణుశక్తిచే ధరణిపై నీ లక్ష్మణుండో పడెన్
మదికిన్ శోకము గూర్చుచున్ సుఘనుఁడు పాముట్టుల్ కడున్ దొర్లెడిన్
రుధిరార్ద్రుండగు వీరుఁ బ్రాణప్రియు శూరున్ లక్ష్మణుఁ జూడ నా
హృది నీరై బలమేగె వ్యాకులుఁడనైతి నాకు శౌర్యంబెదీ. 425

రణమున్ శ్లాఘ యొనర్చు భ్రాత మరి కళ్యాణంబు చేకూర్చు ల
క్షణముల్ గల్గిన లక్ష్మణుండె ఇల పంచత్వంబునే పొందునో
పనియేమీ యిఁక వట్టి యీ బ్రదుకులో నాకింక సౌఖ్యంబు తో
డను లాభం బది, నాదు వీర్య మిదిగో లజ్జించుచున్నట్టులౌ. 426

ధనువో జాఱెడి యట్లయే శరము లస్త్రాళిలెల్ల నిస్సారమౌ
కనుచూ పశ్రుల నిండె, గాత్రములు ప్రకంపంజొచ్చె స్వప్నానఁ బో
లెను, తీవ్రం బగు చింత వర్ధిలెను, మూర్ఛల్లం బడన్బోవ, దా
రుణుఁడౌ రావణు శక్తిచేఁ బడిన శూరుం దమ్ముఁ గన్నంతలో. 427

కడు నిట్టూర్చెడి యార్తు మర్మముల నాఘాతాలచే నేలపైఁ
బడి యున్నట్టి ప్రియానుజున్ దన బహిఃప్రాణంబు నీక్షించి రా
ముఁడు చాలా వ్యథఁ జెంది ధ్యానము కరంబున్ బొంది శోకార్తి మ
గ్నుఁడ యౌచున్ విలపించె వ్యాకులముతో గోడౌను గాత్రాలతో. 428

రణభువి దుమ్ములోనఁబడి లక్ష్మణుఁడే మృతిపొంద భ్రాతృ మృ
త్యువు గను. నాకు నీ రణముతోడఁ బనేమిటి ప్రాణముల్ ధరిం
చినఁ బనియేమి, సీతయును జేకుఱ నేమి ప్రయోజనంబు వ
చ్చిన ఘన రాజ్యమొంద ననుఁ జెందెడి లాభ మదేమి ధాత్రిలో. 429

ఇటు విలపించుచున్ వికలితేంద్రియుఁడై యుసురంచు నూర్చె యా
రటమునఁ బల్మఱున్ దొరలు రామునిజూచి సుషేణుడంత నూ
రట గలిగించుచున్ బలికె రామ! మహాభుజ! లక్ష్మణుండితం
డెటును మృతుండుగాఁడు కనిపింపవ యేమియునట్టి సూచనల్. 430

ఇతని ముఖంబునన్ వికృతియేమియుఁ దోపదు మోమునల్ల గా
దితని ముఖంబునందుఁ బ్రభయింతయు తగ్గదు సుప్రసన్నమై
యితనిముఖంబు గన్పడును నీతనిచేతులు పద్మరక్తమౌ
నితనికనుల్ ప్రసన్నములు మృత్యువుచెందిన నుండవిట్టులన్. 431

—: లక్ష్మణుఁడు మృతుఁడు గాడని సుషేణు డనుట :—

ఏ దేశమందుఁ జూచిన
నా దేశమునందె భార్య లాప్తులు నుందుర్
సోదరుఁ డగు తమ్ముఁడు గల
యా దేశము వెదకియైన నరయము భువిలో. 432

అవని గతాసులౌ జనుల యాకృతి యీగతినుండదే చిరా
యువు గలవారి మోమిటులె యుజ్జ్వలమైతగు, లక్ష్మివర్ధనుం
డవు మన లక్ష్మణుండెటుల నైనను ప్రేతతఁ బొందలేదుశా
త్రవదమనా! విషాదమునెదన్ గనకీతఁడికన్ సజీవుఁడే. 433

నిదురంజెందియుఁ నేలసోకపడి స్వభ్రాత తొమ్మున్ పదే
పదె యుచ్ఛ్వాసములన్ వణంకుచునుచున్ వ్రాకుచ్చి శీఘ్రంబ వా
గ్విదుఁడై నట్టి సుషేణుఁడా హనుమ గన్గొనన్ నిరీక్షించుచున్
పదయంచున్ త్వరపెట్టి యిట్లనియె నాపైనంజనాసూతుతో. 434

సౌమ్య! మును జాంబవంతుఁడు సరిగఁ దెలిపి
నట్టి యోషధగిరికేగి యందు దక్షి
ణ శిఖరమున విశల్యమొనర్చునది, వి
శల్యకరణి యనెడి మహౌషధినితెమ్ము.

ఘనబలుఁడు వీరుఁడయిన లక్ష్మనుని రాము
భ్రాత జీవింపఁజేయు కొఱకు సవర్ణ
కరణి సంజీవనిని తెమ్ము మఱియునటనె
యలరు సంధానకరణిని నరసితెమ్ము. 436

అని సుషేణుడు వచియింప హనుమవేగ
ఓషధిగిరికేగి యటనాయోషధి గన
కెంతొ చింత మునిగి మదినిట్లు తలఁచె
"పోని గిరిశృంగమే కొనిపోదు" ననుచు. 437

ఈ శిఖరమునమొలచి యెంతో సుఖంబు
గూర్చు నాయోషధిని మూహగొని గ్రహింతు
నిటు సుషేణుఁడుగూడ వచించెఁగాఁదె
యిక విశల్యకరణిఁ గొనకేగితేని. 438

కాలమది దాటిచన గొప్పకష్టమగును
నాదు పౌరుషమును వృథయౌనుగాదె యనుచు
తలంచి ఘనబలుండౌచునున్ దక్షణంబ
గిరినిజేరి ముమ్మాఱు గిరిశిరసునూపి. 439

వికసిత వివిధతరుతతుల్ వెలయు శైల
శృంగమును మహాబలుండౌచు వంగి పీకి
హస్తములతోడనెత్తి జలాఢ్య నీల
జలదమటుదిగి క్షణము విశ్రాంతి గొనుచు. 440

హనుమయు సుషేణుతో నిట్లనెం గపీంద్ర!
యీవుచెప్పిన యోషధి యేదొ యెఱుఁగఁ
గనుక గిరిశృంగమెల్లను కరయుగానఁ
బీకితెచ్చితి నిదె యన వేగనపుడు. 441

హనుమ చేసినది సుషేణుండాత్మ మెచ్చి
శృంగముననుండి యోషధిఁ జేతఁబీక
అపుడు కపిముఖ్యులాశ్చర్యమంది సురలుఁ
జేయలేనిపనికి మెచ్చిరటు హనుమ. 442

వ. అంత ఆసుషేణుండు ఆ యోషధినిసలిపి ముక్కున వాసనఁజూఁపగా పరవీర దమనుఁడయిన లక్ష్మణుఁడు దానిని వాసనచూచి విశల్యుఁడయి రోగము నుండి విడివడి శీఘ్రమె నేలనుండి పైకిలేచెను. అంతఁ గపులెల్లరు అట్లులేచిన లక్ష్మణునిజూచి బళిబళియని సుషేణుని మెచ్చి గౌరవించిరి. అపుడు పరవీర హంతయగు రాముఁడు లక్ష్మణునిజూచి కనులనీరుగార వ్యాకులములయిన కం డ్లతో స్నేహమున గాఢముగాఁ గౌఁగలించుకొని యిట్లనియె. "వీర ! అదృష్ట

వశమున మరణించి మరల తిరుగ బ్రదికివచ్చిన నిన్ను జూచుచున్నాను. నీవె గనుక మరణించితివేని నాకీజీవితముతోఁగాని సీతతోఁగాని పనియేమి. జయించి లాభమేమి." అట్లు పలుకుచున్న రాముని జూచి లక్ష్మణుఁడు తొట్రుపడు మాట లతో నిట్లనియె. ఓ సత్యపరాక్రమా! అట్లు ప్రతిజ్ఞచేసి యొక సామాన్యుని వలెనిట్లు తేలికగాఁ బలుకఁదగవు. అనఘా! సాధుపురుషులు చేసిన ప్రతిజ్ఞను అసత్యముగా జేయరు. గొప్పదనమునకు ప్రతిజ్ఞాపరిపాలనమే లక్షణము అనఘా నాకయి యిట్లు నిరాశపొందుట తగనిపని. ఇపుడు రావణునిజంపి నీ ప్రతిజ్ఞను నెరవేర్చుకొనుము. తీవ్రదంతములుగల సింహము గర్జించుచుండ మహాగజము వలె నీ శత్రువు నీ బాణముల గురియై బ్రదికిపోఁడు. శీఘ్రముగా కృతకర్మ యగు సూర్యుఁడస్తమింపకముందే ఆ దుష్టుని జంపఁగోరుచున్నాను. యుద్ధ ములో నారావణునినే గనుక వధింపఁగోరుదువేని * రాజపుత్రికయందు అభిలాష కనుక ఉన్నచో ఇపుడే శీఘ్రముగా నామాటప్రకారము చేయుము" అని. 443

ఎపుడై తేనిటు లక్ష్మణుండనెనో యప్డే శత్రునిర్మూలకుం
డు పరాకాష్ఠను జెందు విక్రమపు టాటోపంబుతో రాఘవుం
డు పరప్రాణ హరంబులౌశరము లెన్నో గూర్చి పెన్వింటితో
విపులంబౌ శరవర్షముల్ గురిసివేసెన్ భీమయుద్ధోర్విలో. 444

ఇక రక్షఃపతి రావణుండును రథంబింకొక్కటెక్కి యు
గ్రగతోరుండయి సూర్య రాహువటులన్ కాకుత్స్థునిపై రెచ్చి వ
జ్రకఠోరంబగు బాణముల్ గురిసె వర్షాధారలన్ మబ్బుపో
లిక; రాముండును స్వర్ణభూషణ శరాళిన్ వాని దుస్సైన్ త్రుటిన్. 445

---

* చేసిన ప్రతిజ్ఞను నెఱవేర్పఁ గోరుదువేని.

ఇలపై రాముఁడు, రావణు డిక రథం, బెక్కన్ రణంబర్హ మె
ట్టులనంచున్ సుర * దానవుల్ పలుకఁ దోడ్తో రామునకై యింద్రుఁ డు
జ్జ్వల పైడూర్యపుఁ గూబరంబు రుచిర స్వర్ణాంగమున్ దీపితా
మల సూర్యాభము కింకిణీశత యుతంబౌ తేరు నంపెన్ దడిన్. 446

కనకాభూషలు శ్వేతచామర పతాకల్‌గల్గి సుశ్యామలం
బునునౌ వాజులఁ బూన్చినట్టి యరదంబున్‌గొంచు వేగన్ దివం
బుననుండే కశఁదాల్చి మాతలిపడిన్ భూమీతలింజేరి యిం
ద్రుని వాక్యంబులిటుల్ వచించెఁదగఁ జేమోయిన్ వడిన్ మోడ్చుచున్. 447

ఇదె కాకుత్స్థ! భవజ్జయంబుకయి దేవేంద్రుండు శ్రీయుక్తమై
నదియౌ నీరథమైంద్ర చాపకవచా లాదిత్య సంకాశమై
నదియౌ శక్తియుఁబంపెఁ గైకొని రథంబారోహణన్ జేసి దు
ర్మదుఁడౌ రావణుఁజంపు మింద్రుడసుర వ్రాతంబటుల్ శ్రీయుతా. 448

అనిచెప్పన్ విని రాముఁడా రథమునా ప్యున్‌చుట్టి యేతెంచి యు
ల్లనఁ జేమోడిచి యెక్కె లోకములనే లక్ష్మిన్ విరాజిల్లం జే
సెను నంతన్ గడువింతయై తుములమై శీఘ్రంబుగా రోమహ
ర్షణమై యుద్ధముసాగె రావణునికిన్ రామావనీభర్తకున్. 449

తరువాతన్ వడి రావణాసురుఁడు గాంధర్వాస్త్రమేయుంగ న
త్తఱి గాంధర్వము రాముఁడేసె నవలన్ దైవాస్త్రమున్ రావణా
సురుఁడేయున్ గని వేగ రాముఁడును నచ్చో దైవమస్త్రంబు వే
సె రయంబుగ్రత రాక్షసాస్త్రమును వేసెన్ రావణుండంతటన్. 450

వ. అపుడు రావణుని ధనుస్సునుండి వెలువడిన బంగారు భూషలుగల బాణములు మహావిషముగల సర్పములయి రాముని ఎదుర్కొనెను. అవి నోరు

* దానవులు—దనువంశజులు; రాక్షసులకంటెవేరు.

అటు క్రుద్ధుండగు రాముమోముగనుచున్ బ్రాణుల్ సమస్తంబు న
చ్చటి విశ్వంభరయున్ వణంకె, హరులున్ శార్దూలముల్‌గల్గు ను
త్కట శైలాలు ద్రుమాలతోనదరె నాకాశంబునన్ బక్షు లు
ద్భట జంతుల్ జలదాలు సంద్రమును క్షోభంజెందె నప్పట్టునన్. 452

కడు నుత్పాతములయ్యె రావణునికిన్‌గల్గెన్ భయుంబెంతొ యు
య్యెడ దైత్యుల్ ఋషులున్ మహోరగులు సెన్నే నిన్ విమానాలలోఁ
బడి గంధర్వులు దేవులున్ దితిసుత వ్రాతాల్ గరుత్మంతులున్
వడి చూడదొడంగి రట్టిప్రళయాభంబైన యాయుద్ధమున్. 453

పెను నానావిధమైన యాయుధసుఃలన్ భీమంపు యుద్ధంబు రా
వణుఁడున్ రాముఁడు చేయుచుండ ఋషి దేవవ్రాతముల్ దానవుల్
గన నేతేర దశాస్యు గెల్వుమని రక్షశ్శ్రేణి గెల్వంచు రా
ముని దేవుల్ పలుమారు పల్కిరి కడున్ పూర్ణంపు సద్భక్తితో! 454

ఇంతటిలో రాముపయిని
నెంతయొ కోపంబుపూని యిఁక రావణుఁడున్
ఎంతో ధ్వని చేసి రిపుల
నంతం బొందించు శూలమది గైకొనియెన్ 455

వజ్రాయుధము వోలెఁ బలుసారమై మీఱి
గొప్ప ధ్వానముచేసి యొప్పుదాని
గోత్ర శృంగమువంటి కూటాలతో మించి
దృష్టికే భయము గల్గించుదాని
ప్రళయాగ్ని చయమట్లు గ్రక్కుచు పొగసెగల్
తీవ్రమౌ నగ్రానఁ దీర్చుదాని
కాలుఁడైనను సెపఁజాలక రౌద్రమై
యెల్ల భూతభయంబు నిడెడిదాని

భూత దారణ భేదన మూలమైన
మహిత శూలము వేగ మధ్యఁబట్టి
గట్టి శూరులౌ దైత్యులు చుట్టురాఁగ
ఇల దివి దిశలు వార్ధి కంపింపఁ బలికె. 456

ఇదిగోఁ జూడుము వజ్రమట్లు భయదంబీశూలమో రామ ! యీ
యదనన్ నిన్నును నీదుతమ్ముని ప్రియప్రాణాలు దీయున్ త్రుటిన్
కదనంబందు వధింపఁబడ్డ దితిజగ్రామాత్ములున్ శాంతిలన్
కదనశ్లాఘి! వధింతునిన్ బహుశితాగ్రంబైనశూలంబుతో. 457

అనివాక్రుచ్చి దశాననుండు నిశితంబైనట్టిశూలంబురా
మునిపై వేయఁగ శూలమద్ది నినదంబున్‌జేసి విద్యుత్ప్రభా
ఘనమైయెన్నిదిగంతలన్ దివిపయిన్‌గ్రాలంగ రాముండు వి
ల్లునుసారించి * లయాగ్నినీళ్ళ హరియట్లున్ నిల్పెబాణాళిచే. 458

కడుగంటల్ ధ్వనిచేయ వింటఁ బ్రళయోల్కంబోలి భాసిల్లుచున్
వడిరక్షఃపతిశూలమున్ బ్రతిహతంబౌనట్లు గావించి రా
ముఁడు నారావణువేగఁబోయెడి హయంబుల్ తీవ్రబాణాలచే
పుడమిన్ వ్రాలఁగఁజేసి రావణునురంబున్ గొట్టెతావెండియున్. 459

కడుభేదించి లలాటమున్ రుధిరయుక్తంబున్ బొనర్చెన్ మర
ప్పుడు నారావణునంగముల్ రుధిరసంపూర్ణంబులున్ గాఁగ నె
క్కుడుబాధంగని రావణుండు సమరక్షోణిన్ క్రుధాతామ్రనే
త్రుఁడయై విచ్చునశోకమట్లు దనరెన్ తూర్ణంబుగానంతటన్. 460

* లయాగ్నిని నీళ్ళచే నింద్రుఁడువలె నా శూలమును బాణములచే నాపె
నని భావము.

అటు లారాముఁడుకొట్ట గ్రుక్కియుఁగరంబా రావణుండుగ్రుఁడై
యటవిల్లెక్కిడిరాముఁ జిక్కుపడఁజేయన్ మబ్బుమంటన్ హటా
హటివర్షింపఁగ నిండుచెర్వువలె నెన్నో బాణముల్ కుర్సి నిం
పుటయున్ నిండి యకంప్యుడై లమటు రాముండేమి కంపింపఁడున్. 411

శరజాలంబుల రావణుండు కురియన్ శౌర్యమ్మునన్ రాముఁడున్
కిరణాళిన్రవివోలెఁ గై కొనదశగ్రీవుండు వేలమ్ములన్
కరమై పుణ్యముతో మహాత్ముఁడగు నిక్ష్వాకుక్షితీశాను పె
న్నురముంబైఁబడఁగొట్ట రాముడిఁక నత్యుగ్రాత్ముఁడై యుంతటన్. 412

అనిలో శోణితదిగ్ధగాత్రుడయి యొయ్యన్పుల్లమౌ కింతకం
బననొప్పారి యుగాంతదీప్తరవియు ట్లత్యంతతేజస్కుఁడై
తనరెన్, పిమ్మట రామరావణులు యుద్ధంబందు నన్యోన్యమ్మున్
ఘనబాణాంధతమంబు గూర్చియచటన్ గన్పింపరై రయ్యెడన్. 413

ఇఁకఁ గ్రుద్ధుండయి రాముఁడల్లనగి దైత్యేశున్ నిరీక్షించి ని
ల్వకపారుష్యముమీఱ నిట్లనియె నాభార్యన్ జనస్థానినుం
డి కడున్ వంచననాకెటుల్ తెలియనన్పే యోరిదైత్యాధమా!
యిఁకనేలేని యనాథ దొంగిలితివే, వీరుండవెట్లౌదురా! 414

నేలేనితఱివనిన్ జాలిఁసుక్కెడి సీత
బల్మిదొంగిలి శూరవరుఁగఁ దలఁతె
వని ననాథస్త్రీలఁగొని చెడుపనిఁ జేసి
పరదారహర! శూరవరుగఁ దలఁతె
సిగ్గునుమర్యాద శీలంబువిడి కొవ్వి
చావుదెచ్చుక శూరజనుఁగఁ దలఁతె
ధనదుభ్రాతవయి సేననుగూడి మెప్పుఁ గీ
ర్తినిడనడచి శూర జనుగఁ దలఁతె

ఇట్టిపనిఁజేసి మిగులగర్వించి మెలఁగి
గర్హ్యమహితము చేసిన కర్మ కిపుడె
తగుఫలంబొందెద విఁక ఘోరుగఁ దలంతె
ఎట్టివాఁడవొ దుష్ట! నీవెఱుంగవైతి. 465

దొంగవిధానజానకిని దొంగిలు నీకెటుసిగ్గులేదొ చే
వంగనిసీత నాయెదుటఁబల్మిని నెత్తుకపోతివేని నీ
పొంగనియుందువా ఖరుని పోకడ, నాశరలక్ష్యమౌచుఁ గా
సంగలవా యమాలయము, నాదునదృష్టముపండెఁ గంటి నిన్. 466

రణభూమిలోఁ గుండలాఢ్యమౌ నీతల
యిదె దొర్ల జంతువు లీడ్చుఁగాక
క్షితిఁబొర్లు నీబొమ్మ గృధ్రమ్ములాశతోఁ
జీలిచి నెత్తురుల్ గ్రోలుఁగాక
నాదుబాణములచే బాధపొంది క్షితిపై
దిక్కులేని మృతి నొందెదవుగాక
ప్రాణాలుపో నిలఁబడు నీనరాలెపక్షు
లహుల గరుడివోలె లాగుఁగాక

అనుచు రిపుదమనుఁడు రాముఁ డసురపతిని
బాణవర్షాలచేఁగొట్టి బలముమదము
వీర్యమును నస్త్రబలమును ద్విగుణమగుచు
వెలయ సర్వాస్త్రములను నావిష్కరించె. 467

—: రథము మరల్చిన సూతుని రావణుఁడు మందలించుట :—

వ. మఱియు మహాతేజుఁడగు రాముఁడు మిగుల హస్తలాఘవము చూపెను. అపుడు రాముఁడు తనలోని యీ శుభ చిహ్నములు తెలిసికొని యింకను రాక్షసాంతకరుఁడయి రావణుని బాధించెను. ఒకవైపు వానరులు రాళ్ళను ఇంకొకవైపు రాముఁడు బాణములను వర్షించి కొట్ట దైత్యుడు విఘూర్ణమాన హృదయుఁడయ్యెను. ఎపుడైతే రావణుఁడు శస్త్రమును ప్రయోగించలేదో ధనుస్సును సారించలేక పోయెనో విహ్వలమైన మనస్సుతో రాముని బాణములకుఁ బ్రతిక్రియ చేయలేకపోయెనో చావు మూంచుకొని వచ్చిన రావణుఁడు తాను వేసిన బాణములు వివిధ శస్త్రములును రణమున నుపయోగపడలేదో అపుడారావణుని యవస్థనుచూచి వాని రథము నడపు సారధి కంగారు పడక యుద్ధరంగము నుండి రావణు నింకొకచోటికి తప్పించి తీసికొనిపోయెను. 468

అంతరావణుఁ డవివేకియగుచు నలిగి
యమునిబలముచేఁ బ్రేరితుండయి కరంబు
క్రోధ సంరక్తనయనుఁడై రోషమొప్ప
సూతుతోడను నప్పుడీరీతిఁ బలికె. 469

బలహీనుంగ నశక్తుఁగా బిఱికిఁగా బ్రాబల్యమేలేని చం
చలుఁగాఁ బౌరుషహీనుఁగా లఘునిగా సత్త్వప్రహీనుంగ ను
జ్జ్వల తేజోరహితుంగ మాయలకు నజ్ఞానుంగ నస్త్రాళిచే
వెలివేయంబడినట్టివానిగ ననున్వీక్షించితే దుర్మతీ! 470

ననునిర్లక్ష్యముచేసి నీవిటు స్వతంత్రత్వంబునే పూని యే
మనినీబుద్ధికి దోచినట్లుగను జేయంబూనితోరి! మది
చ్చనుజూడన్వలదే యిటుల్ రిపుసమక్షంబందె నీవీరథం
బును తప్పించితివేమిరా యిదియు నాబోట్లందు యుక్తంబొకో. 471

చిరకాలమునుండియు నేఁ
గరమార్జించిన యశస్సు ఘనవీర్యము సం
గరమున వెను చూపం డను
పరవిశ్వాసమును నష్టపఱచితివిగదే ! 472

ఖ్యాతిగనిన వీరుండు విక్రమముచేత
అతిగ రంజింపఁ దగినవాఁ డయిన వైరి
కనుచునుండఁగఁ దప్పించి రణమె యన్న
చెవినిగోసికొను నను భీరుఁజేసినావు. 473

ఈవె కనుక వ్యామోహాన ఈరథంబు
వైరి కెదురుగ తోలక పాఱతేని
ఏదొకాన్క శత్రువునీకు నిచ్చెననుచు
పరిగ నాకుఁదోచినయూహ సత్యమగును. 474

హితముకోరెడి సుహృదున కిట్టికర్మ
ఎంతమాత్రము తగినది యేమిగాదు
శత్రువులు చేయదగినది జగతిలోన
ఈవుదీనిని సరిగ గావించలేదు. 475

నిజముగా నాయెడల నీకుస్నేహమున్న
నేనుజేసిన మేలుల నెంతువేని
ననువెదకికొని యరిరాకమును పె నీవు
రయముగా వైరికెదురుగ రథము త్రిప్పు. 476

—: నీ హితముకై మరల్చితి నని సూతు డనుట

అనుచు మిక్కలి పరుషవాక్యంబు లిట్లు
బుద్ధిలేని రావణుండౌ యప్పుడు పలికింప
నిట్లు హితబుద్ధియౌ సూతుండెంతొ యనున
యమున రావణుతోడ వాక్యములం బలికె. 477

నేను భీతుండంగాను నేను మూఢుండంగాను
ఎవరిచే మోసగింపంబడను
నేం బ్రమత్తుండంగాను స్నేహశూన్యుడం గాను
నీదుమేలు మఱువలేదు గూడ
నీ హితమును గోరి నీ కీర్తి పోకుండ
మంచిగా నేం బ్రవర్తించినాను
స్నేహార్ద్ర మనసుతో నీకిది ప్రియమని
యెంచియె ప్రియమె గావించినాను

ఈ విషయము నెంచియు ప్రియహితుండనైన
నన్ను నెపుడౌ సామాన్య ననార్యునట్లు
దోషమునుమోపి యీరీతి దుష్టవాక్కు
లాడందగవు మహారాజ ! న్యాయమగునె ! 478

ఎత్తయిన ప్రదేశంబున నేటివేగ
మట్లు రథము సంగ్రామమందు నేల
మరలిచియు దూరమైనట్టి ధరణి కేను
తీసికొని వెళ్ళితిని యిదే తెలుపుచుంది. 479

ఈవు రణంబునన్ గడు శ్రమించినయట్టులు తెల్సికొంటి నీ
యావదనంబునన్ ముదము నేసుముఖత్వము లేమిఁజూచితిన్
ఈవిపు డెక్కియున్న రథమింతగమోసి హయాలుస్రుక్కె వ
ర్షాపళికొట్ట గోవులటు, శ్రాంతినిపొందెను ఘర్మవేళలో. 480

ఇటఁ బ్రాదుర్భవమౌ నిమిత్తములు నెంతేనిన్ విరుద్ధంబులౌ
నిటులన్ దేశముఁ గాలమున్‌దెలిసి యాయాలక్షణా లింగితాల్
త్రుటి దైన్యంబు బలాబలాల్ రథికులందున్ శక్త్యశక్త్యాదు లి
చ్చటి నిమ్నోన్నతముల్ సమాలువిషమ స్థానాలు చూడన్‌వలెన్. 481

ఎపుడీ యుద్ధముచేయఁగా వలయునో యెట్టుల్ సమీపంపు దూ
రపు దేశంబులఁ బోవలెన్ రిపులరంధ్రాలెట్లు చూడన్‌వలెన్
అపసర్పించుట యెట్లొ నిల్చుటెటొ యొయ్యన్ సూతుఁడీయన్ని తే
రుపయిన్ నిల్చియుఁ జక్కఁగాఁ గనుచు వీలున్‌బట్టి పోవన్‌వలెన్. 482

కడు విశ్రాంతియు నీకు గుఱ్ఱములకున్ గాఁదగ్గదంచెంచి యె
క్కడు కష్టంబును ఖేదమొట్టులును గాకుండన్ తగన్‌జూచి యి
య్యెడ నేఁజేసితి స్నేహయుక్తమతితో నిట్లేను గావించితి
న్గడు నాయిష్టము వచ్చినట్లు రథముం దప్పింపలేదో విభూ ! 483

సరె శాసింపుమి, యిప్పుడీవ యెటులన్ జక్కంగ వాక్రుత్తువో
సరిగానట్టులె నేనుచేయుదును నీసంకల్పమున్ జేసి యి
త్తఱి నీయుప్పను తీర్చుకొందుననఁగన్ దద్వాక్కులన్ రావణా
సురుఁ డాలించియు మెచ్చి హర్షమున నచ్చోఁబల్కె యుద్ధేచ్ఛుఁడై.

త్వరగా రామునిముందుకున్ రథము సూతా! తోలుమీ రావణుం
డరులం జంపక యాజిలోన మరలండంచున్ గడుం బ్రీతుడై
వరహస్తాభరణంబు సూతునికిఁగానుకన్‌గాఁ గరం బీయ న
త్తఱి నారావణు మాటలన్ వినియె యాతండున్ రయుంబారగా. 484

రామున కభిముఖముగను రథముద్రిప్పి
వేగ హయములఁదోలుచు నేగినంత
క్షణములో రావణుఁడు సుగ్రరణధరిత్రి
చేరె రామునితో పోరుచేయుటకును. 485

—: అగస్త్యుడు ఆదిత్యహృదయమును రామునికిఁ జెప్పుట :—

రణమునఁ గడునలసిపోయి రణమునందె
చింతనున్న రాముని బోరసిద్ధమైన
రావణుని, ముందు గనుగొని దేవతలును
రాఁగ నగస్త్యుఁ డీరీతి రాముఁబలికె. 486

రామ! రామ! మహాబాహు! ప్రాచ్యమైన
యీరహస్యము వినువత్స! యింక త్వరగ
దీనిచే నెల్లరిపుల నిందే జయింతు
విద్ది యాదిత్యహృదయంబ యెఱుగుమీవు. 487

ఇది పుణ్యప్రద, మెల్లశత్రువులనిట్టే నాశముంజేయు ని
య్యది నిత్యంబు జపియింపఁగావలె జయం బందిచ్చు, నక్షయ్య మి
య్యది శ్రేయస్సు నిడున్గడున్, సకలకళ్యాణాల కళ్యాణ మి
య్యది పాపంబులఁగూల్చు, బాపు సకలవ్యాధుల్ చిరాయుస్సిడున్. 488

కరముల్ చాపుచుఁ బైకివచ్చు, సురలోకాకుండ దైత్యాళి చే
తురు మ్రొక్కల్ భువనేశ్వరుండు ద్యుతిమంతుండు నైనట్టి భా
స్కరుఁ బూజింపుము, సర్వదేవమయుఁడౌ చండాంశువీతండ భా
స్కరుఁడోజస్వి, సురాసురావళుల లోకాల్ప్రోచు దీప్తాంశులన్. 489

ఇతడే బ్రహ్మయు విష్ణువు
నితఁడె ప్రజాపతి శివుండు నితఁడే స్కందుం
డితఁడె యముఁడింద్ర కాలురు
నితఁడె కుబేరుఁడు వరుణుఁడు నితఁడే శశియున్. 490

ఇతఁడే పితృవసు సాధ్యులు
నితఁడశ్విన మరుతులు మనువితఁడే ప్రాణం
బితఁడే వాయువు వహ్నియు
నితఁడే ప్రభాకరుడు ప్రజయును ఋతుకారుండున్. 491

ఇతఁడాదిత్యుఁడు సవితయు
నితఁడు గభస్తియుత పూషుఁడితఁడు భానుం
డితఁడే స్వర్ణసము దినకరు
డితఁడగును హిరణ్యరేతుఁ, డితడె ఖగుండున్. 492

ఇతఁడు హరిదశ్వ శంభులు
నితఁడు సహస్రార్చి త్వష్ట యితఁడంశుమంతుం
డితఁడు సుమరీచి మార్తాం
డ తిమిరహన సప్తసప్తి నాముఁడుకూడన్. 493

ఇతడే హిరణ్యగర్భుఁ
డితఁడె తపన శిశిరరవులు నితఁడే శంఖుం
డితడగ్నిగర్భుఁ డదితికి
సుతుఁడు శిశిరనాశనుఁడును శుచి భాస్కరుఁడున్. 494

ఇతఁడు తమోభేది ద్యుపతి
ఇతఁడె యజసు ఋక్సామ లివియుంతుగసెన్
ఇతఁడు ఘనవృష్టి యప్సఖుఁ
డితఁడె వింధ్యపథిఁ బ్లవగుఁడితడే కవియున్. 495

ఇతఁడే శుభాతపి మండలి
ఇతఁడే పింగళుఁడు మృత్యు, పెల్లఁ దపించున్
ఇతఁడె సుతేజుడు విష్ణుఁడు
ఇతఁడే సర్వభవజన్మ యితఁడే ప్రియుడున్. 496

ఇతఁడే నక్షత్రగహ
పతి తారాధిపతి విశ్వభావనుఁడుగదా
ఇతఁడే తేజులలో శ్రే
ష్ఠతేజుగలవాఁడు ద్వాదశాత్మకు నమసుల్ 497

తూరుపుగిరి రవికి నమ
స్కారము, పడమటిగిరిరవికగునతులు, నమ
స్కారము దినపతికి, నమ
స్కారము జ్యోతిఃపతికిని సర్వత్రసదా ! 498

దండము జయభద్రునికిని
దండము హర్యశ్వునికిని దండము జయికిన్
దండము సహస్రరశ్మికి
దండము లాదిత్యునికిని దండము రవికిన్. 499

దండము సారంగునికని
దండము లుగ్రునికిఁ, బ్రేరణంబిడు రవికిన్
గండము మార్తాండునికిని
దండము ప్రబోధదాంతుకి నెపుడున్ 500

దండముజహరిహరపతికిం
దండము సూర్యునికి నదితి తనయార్చిసుకున్
దండమఖిల భక్షునికిని
దండము భాసునికి రౌద్రతనుధారునికిన్. 501

దండము తమోహిమఘ్నుకు
దండము శత్రుఘ్నునికి తతరూపునికిన్
దండము కృతఘ్నఘ్నునికిని
దండము జ్యోతిఃపతికిని దైవాత్మునికిన్. 502

దండము హిరణ్యతనునకు
దండము విశ్వకరునకు తపనాత్మునికిన్
దండమ్ము లోకసాక్షికి
దండము తమోఘ్నునికిని దండము రుచికిన్. 503

ఇతఁడే జగమును గూల్చును
నితఁడే దానినిమరల సృజించు విభుండున్
ఇతఁడే పాలనచేయును
ఇతఁడె కిరణములచేత నెల్లెడఁ గురియున్. 504

ఇతఁడే సుప్తులమేల్కొను
ఇతఁడే భూతలములలోన నెప్పుడు నుండున్
ఇతఁడెగద యగ్నిహోత్రం
బితఁడేగద యగ్నిహోత్రు నెడలన్ ఫలమున్. 505

ఇతఁడే వేదములు క్రతువు
లితఁడే క్రతువులకుగూడ నెల్లఫలంబున్
ఇతఁడే లోకములందలి
వితతంబగు పనులుచేయు విశ్వవిభుండున్. 506

ఇతనినె యాపదలందున్
ప్రతికష్టమున వనులందు భయములలోనన్
మతితోఁ గీర్తించినయెడ
క్షితినెవ్వఁడు క్షయము గనఁడు చెడఁడును రామా! 507

ఈ దేవదేవుని జగ
న్నాథుని నేకాగ్రమతిని ధ్యానించినచో
ఆదిత్యహృదయమును నీ
వెదరి ముమ్మారు తలఁప జయింతువు రణముల్. 508

వినుమీ క్షణముననే రా
వణుని వధింపగలవుసుమి బహుతేలికగా
అనుచునగస్త్యుడు వాకొని
చనియెను తావచ్చినట్లు క్షణకాలములో. 509

ఇదియాలించి మహౌజుఁడు
నెద శోకమ్మును త్యజించి యెంతయు యలరెన్
మది నాదిత్య హృదయమా
యదనున, ధరియించె రాము డతినియమానన్. 510

ఆదిత్యుఁగని జపించియు
మోదముగనె నాచమించి ముమ్మఱు జలముల్
ఆదరి శుచియయి రాముఁడు
తా ధనువును గైకొని వడిఁదరలెను సనికిన్. 511

అట రావణుఁ గనుఁగొని మది
నటు హృష్టాత్ముడగుచు నాయునిలో ను
ద్భటు రావణుఁ జంపఁగ సం
తట సర్వప్రయుతనమునఁ దాల్చెను దీక్షన్. 512

అపల సూర్యుఁడు ముదితాత్ముడగుచు రాముఁ
జూచి హర్షముపొంది, నిశాచరపతి
చచ్చునిఁక, నంచు తెలిపి నిర్జరులమధ్య
నపుడె నిల్చియు "త్వరపడు" మని వచించె. 513

ఎత్తైనజెండాలు నిటు  లూగాడ
గంధర్వ పురిఁబోలి క్రాలుదాని

బంగారుమాలలన్ పట్టుసంపన్నమౌ
నశ్వాలుఁ బూన్చిన నలరుదాని

యుద్ధోపకరణాల నుజ్జ్వలమై నిండి
ధ్వజపతాకలతోడఁ దనరుదాని

ఆకసంబును మ్రింగినట్లయి ధరణిని
ప్రతినాదముల నింపి పఱలుదాని

శత్రుసేనల నడఁగింప, స్వబలములను
కడు ప్రహర్షముగూర్చి కదలుదాని
రావణు రథంబునపుడు రణధరణికిని
నడపె సారథి హృష్టుఁడయి వడిగ వడిగ. 514

నల్లనిగుఱ్ఱాలు నయముగ లాగఁగ
రౌద్రవర్చసు కడుఁ గ్రాలుచుండ

ఎఱుపుమెఱుపు ధ్వజాలింద్రధనుసు విండ్లు
శరధారలిడు రథజలదమూగ

వజ్రాన హతమౌచు బ్రద్దలౌనట్టుల
గొప్పఘోషలు దిశల్ గప్పుచుండ

వెంటవెంటనె వేగవెదలి ధ్వనుల్ చేయ
సూతుఁడు పైకొని చొచ్చినడప.

వచ్చురావణు రథమును పట్టిచూచి
బాలచంద్రుఁబోలు ధనుస్సు సాచివేగ
శక్రుసారథి మాతలిన్ సరిగఁజూచి
రాజపుత్రుఁడు వీరుఁడు రాముఁడనియె. 515

కనుమీ మాతలి! యెట్లు శత్రురథమింకన్ వేగ పైపైకి వ
చ్చెనో యాతే రపసవ్యమై యెటులఁ కౌచ్చెన్ జూడు యుద్ధంబులో
తనకే మృత్యువు ముందుకోఁగ స్థిరచిత్తంబార నేతెంచెఁజో
కనుకన్ నీవు ప్రమాదమొందక యె వేగన్ శత్రుతేరడ్డుమీ. 516

వ. పైకిలేచిన మబ్బును గాలివలె, నేనిపుడే రావణుని ధ్వంసముచేయ గోరుచున్నాను. ధైర్యముగా కంగారుపడక మనస్సును కన్నులను హస్తములను గానీ యీ వగ్గములను సరిగాపట్టుకొని రథమును నడపుము. ఇంద్రుని వంటివాని రథమును నడపు నీకు ఇవన్నీ ఉపదేశింపనక్కరలేదు కాని యుద్ధము చేయఁగోరి యేకాగ్రతతో నున్న నేను నీకివి జ్ఞాపకము చేయుచున్నాను కాని నేర్పుటకేను. అని రాముఁడనఁగావిని సురసారధులలో నుత్తముఁడయినమాతలి సంతోషించి రథమును రావణునిరథము అపసవ్యమగునట్లు నడపుచుఁ జక్రముల వేగమునకులేచిన దుమ్ముచేత రావణునిరథమును అడ్డుగాజేసెను. అంతఁ గ్రుద్ధుడయిన దశగ్రీవుఁడు ఎఱ్ఱని కన్నులువిప్పి రథమున కెదురుగావచ్చు రామునిఁ తనబాణములతోఁ గప్పివైచెను. అంత రావణునిచే నెదుర్కొనఁబడిన మహాతేజుఁడయిన రాముఁడు రోషముతో ధైర్యముహొంది మహావేగముగా ఇంద్రధనుస్సును సూర్యరశ్మితో సమమయినకాంతిగల శరములను గ్రహించెను. అప్పుడు పొగరెక్కిన సింహములకువలె ఎదురెదురుగాబోరుచు ఒకరినొకరు జంపఁగోరి యుద్ధముచేసిరి. అంత దేవతలు గంధర్వులు సిద్ధులు పరమర్షులు రావణ నాశనముగోరుచు రథములతోచేయు యుద్ధమును జూడవచ్చిరి. మఱియు రావణుని నాశమును రాముని జయమును సూచించుచు ఒడలు గగుర్పొడుచు దారుణోత్పాతములు బయలుదేరినవి. రావణునిరథముపైని మేఘుఁడు రక్తమును వర్షించెను. గాలులు మండలములయి అపసవ్యముగా తీక్ష్ణముగా వీచినవి. రావణునిరథము ఎటువైపువెళ్ళిన అటువైపుగానె ఆకాశమున చాల గ్రద్దల గుంపులు తిరిగెను. మంకెనపువ్వువంటి కాంతిగల సంధ్యాకాంతి లంకను వ్యాపిం

చెను. పగలుకూడ భూమి మండుచున్నదివలెఁ గనుపట్టెను. రాక్షసులు విషాద మొంద రావణునికహితమయిన ధ్వనులుచేయుచు పిడుగులతో మహోల్కలు పడెను. రావణుడు సంచరించినవైపు భూమి కంపించిపోయెను. రాక్షసులు కొట్టుచుండవారి బాహులనెవరో పట్టుకొన్నట్లయ్యెను. ఎఱ్ఱగా, పచ్చగా తెల్లగా సూర్యరశ్మలు ప్రకాశించినవి. అవి పర్వతములందలి గైరికాది ధాతువులవలె రావణుని శరీరమునఁ గనుపట్టెను. గ్రద్దలతోపాటు నక్కలు రావణునికభిముఖ ముగా ముఖములతో నిప్పునుగ్రక్కుచు కనఁబడినవి. రాక్షసరాజుకనులు [illegible] పట్టకుండ గాలి దుమ్ముతో ప్రతికూలముగా వీచెను. ఇంద్రాశనులతో సాటి యయినయుల్కలురావణుని సైన్యముపై సైపరానిస్వనములతో మబ్బులులేకనే ఘోరముగా గర్జించినవి. దుమ్మువానలచేత దిక్కులు విదిక్కులు చీకట్లతోఁ గప్పఁబడినట్లయ్యెను. ఆకసమె కనిపింపకపోయెను. శారికలు రావణుని రథముచుట్టును గొప్పగా కలహించుచు దారుణమయిన కూతలతో వందలకొలది వచ్చిపడినవి. గుఱ్ఱములు జఘనములనుండి నెరసులను కండ్లనుండి కన్నీటిని విడిచినవి. ఇట్టి భయంకరోత్పాతములు రావణుని వినాశమును చూపుచు బయలుదేఱినవి. ఇంతేకాక రామునికిఁగూడ నిమిత్తములు సౌమ్యములయి జయమును సూచించుచు ప్రాదుర్భవించెను. అవిచూచి రావణుడు చచ్చి[illegible] రాముఁడు తలఁచెను. నిమిత్తములను బాగుగఁదెలిసిన రాముఁడు జయసూచకములు తనకయి గలుగుటచూచి హర్షమును ఎక్కువ సంతృప్తినిపొందియుద్ధములో అధికముగా విక్రమంబు చూపెను— 517

పిదపన్ తద్భువి రామరావణుల కష్టి లోకభీదాయి యా
కదనంబయ్యె రథాలతో, నపుడు రక్షస్సైన్య మాప్రక్క గా
వ్పదియా వానరసైన్య మా యుదములన్ బాగొప్పఁగాఁ దాల్చియున్
[illegible] సేవార నిశ్చేష్టతన్. [illegible]

ఈరుశస్త్రాదులు చేతఁబట్టి కపిదైత్యుల్ విస్మయమ్మొంద నాం
డౌరు లా ఘోరపు యుద్ధమున్‌గనుచు నెట్లున్‌పోరరై రానిశా
చరులా రావణు, రాము వానరులు నాశ్చర్యాన వీక్షించి చి
త్తరువట్లచ్చట నిల్చిపోయిరి రణోత్సాహంబు వర్ధించియున్. 519

అటు కన్పించు నిమిత్తముల్ గనుచునే యారాముఁ డారాక్షసుం
డట భీతిన్‌విడి నిశ్చితాత్ములయి రోషావిష్టులై పోరి ర
చ్చట గెల్వన్‌వలెనంచు రాముఁడు నెటున్ జావేయికన్ దక్షుఁడం
చటు లారావణుడింక నున్న బలమంతా చూపిర య్యాజిలో. 520

వెసఁ గ్రోధంబున రావణుండు శరముల్ విల్లందు సంధించి యు
ల్లసితంబయి తగురాము స్యందనముపై రాజిల్లు జెండావయిన్
విసరంగానది దానిఁజేరక రథావేగంబుచే నంతటన్
బుసయోఁ గొట్టనిపాములట్టులు పడెన్ భూమీతలిన్ వ్యర్థమై. 521

ఇక రాముండును క్రుద్ధుఁడౌచు ధనువెంతేసాచి గావించు దా
నికి మారౌనటు చేయనెంచి మిగులన్ స్వీయౌజుచే నుంచుచున్
వికటం బోర్వగరానిపాముబు శరంబేసైచి శీఘ్రంబవా
రక పైపైకినినూఁగు పెన్‌ధ్వజము నేలన్‌రాలఁగొట్టెన్ వడిన్. 522

అటు జండాఖువిఁగూల రావణుండు క్రోధావిష్టుఁడై మండి మం
దట దగ్ధంబొనరించు వాఁడువలెపై తద్రాము సశ్వంబులన్
పటు బాణాలనుగొట్ట నశ్వములు స్థాల్పించెని త్రొట్రిల్లి వం
తట స్వస్థంబయి పద్మనాశముఖచేతన్ గొట్టబడ్డట్టులన్. 523

తురగంబుల్ చలియింపకుంటఁగని యెంతోయుగ్ర దైత్యేశుఁడున్
శరవర్షంబులుకుర్పి శూలగదలన్ చక్రాలగొడ్డళ్ళఁ బె
న్పరిఘల్‌పెట్లు మహీధ్రశృంగ ముసలాల్ పల్మాఱు వృష్టించి భీ
కరనూనౌస్థాలఁజేసి పెన్‌తుములమున్ [illegible] రాముండేమున్. 524

ఒక యారాముర థంబు తక్కకరమెంతో వానరశ్రేణి సా
యకముల్ గప్పియుఁ గొట్టి యాకసముగాఢాంధంబుగా జేయ వే
లకొలంది శరపంక్తిఁ గుర్పిమిగులన్ బ్రాణాలపై నాశవీ
డి కడున్బోరెడి రావణున్ నగుచు క్రీడిన్జేసె రాముండొగిన్. 525

ఇరువురు వీరులట్లు పొనరింపగపెర్గెడి బాణవృష్టిచే
శరములబద్ధమై చదలు సర్వము రెండవవట్లుతోచ నే
శరముగుఱిన్ విడ దసార్థకమెద్దియుగాదు, చేనినిన్
గుఱివిడి కొట్ట; దొక్కొకటికొట్టుచు ఛవింబడెనెల్లబాణముల్. 526

అటు సవ్యంబున దక్షిణంబునను నన్యోన్యంబౌగిన్ గొట్టుకొం
చట నుచ్ఛ్వాసమె తీయనట్టులనె యాయుద్ధంబు నహోరాత్రిఁ గొ
ట్టుటయున్ రాముఁడు రావణాశ్వములనట్లున్ రాచు నశ్వాల ముం
డట నారావణుడేయగా రణముమూర్తంబయ్యె నుగ్రోగ్రమై. 527

వ. అంత ఆ యుద్ధమును సర్వభూతములు అత్యంతాశ్చర్యముతో చేష్ట లేక చూచినవి. ఇంక

అటు ఘోరంబుగ రామరావణులు నత్యంతోగ్రులై యొండొరున్
అటకాయించి రథాలతో రథములల్లాడించు చొండొండుఁ జం
పుటకైకొట్టుచు మండలాల్ తిరుగుచున్ బోనడ్డుచున్ డాయుచున్
అటదవ్వేగుచు సూతసారథి గతుల్ యత్నించి పోరాడిరే 528

రామునిగొట్టి రావణుడు రావణుఁగొట్టుచు రాముడున్ మహా
భీమతఁజేరి మర్లుచును వేగశరాలను జిమ్ముచున్ రథాల్
వేమరుజేర్చి ఢీకొనుచు వేగము వర్షము దిమ్మరించు సు
శ్యామల మేఘముల్ వలెను నైకగతుల్గొని పోరిరయ్యెడన్. 529

ఎమరుగఁబోయి యొండొరుభ్రమించుచుఁ గాడికాడితోఁ బదే
పదెతుపగాలవక్త్రము వక్త్రముతోడఁ బతాకతోఁ బతా
క దరియనేర్చి పోరుచు వికావికలై చన నాలుగమ్ములన్
బొదువఁగఁ బల్కి రావణునిమోయు హయాలమరల్చె రాముఁడున్. 520

తురగములన్మరల్చఁగని తూర్ణమురావణుఁడల్గి రాముపై
శరములనేకముల్ కురిసి చాలఁగఁగొట్టఁగ నెంతమాత్రమున్
జరగక ఎట్టివిక్రియను నెసంగక రాముఁడు వజ్రఘోషముల్
జరపుశరాలువేయఁగ దశాస్యుఁడుగొట్టెను మాతలిన్వెసన్. 531

అటుబాణంబులువేయ మాతలియొ తానావంతయేన్ స్రుక్కఁ డిం
తట మోహంబునుబొందఁ డైనఁ గడుక్రోధంబొంది రాముండు చుం
గటిశత్రున్వెనుకాడఁగొట్టి విముఖుంగావించి యుక్త్వె శరా
లిటె ముప్పైయురపై శతంబులును వేసెన్శత్రునాతేరుపై. 532

రావణుఁడున్గరంబలిగి రామునిపై ముసలాలు పెన్గదల్
వేవిసరన్ ధ్వనించెనవి, వింటశరాల్పరిఘల్గదల్ మహా
రావముచేసికొట్టుకొన భ్రాంతిలివార్ధులు క్షోభపొందె; నా
రావముచే రసాతలచరా లురగాలుస్రుక్కె మిక్కిలిన్. 533

దానవులంతవేలుగను దద్దరిలన్సవనాద్రి భూమియున్
కాననముల్వణంకె భాస్కరుఁడుకాంతినిదక్కెను గాలివీచదున్
మౌనులుదేవులున్ఋషులు మౌనముమోదముపొంద బాధచే
మేనులుసంచలింపఁ గడుఁజింతిలసాగిరి మిక్కుటంబుగన్. 534

గోవులకు బ్రాహ్మణులకును
కావుతనుశుభము, సకలజగంబులు స్థిరముల్
కావుత, రాముఁడురణమున
రావణునిజయించుతమిఁక ప్రాణులు మనుతన్. 535

అని జపియించుచు దేవులు
మునులునుగంధర్వు లొడలఁబులకలొదవ దా
రుణ రామరావణ రణము
గని యచ్చరలును పలికిరి కడునీరీతిన్. 536

గగనమునకు గగనమె సమ
మగు సంద్రమునకు సంద్రమగును సమంబై
త[illegible]రామరావణాహవ
మగు సమమయి రామరావణాహవమునకున్. 537

అటురాముం డురుబాహువా రఘుకులఖ్యాతిన్ జగద్వ్యాప్తిచే
యుటకై దీర్ఘధనుస్సుచాపియు భుజంగోదగ్రమై కత్తిముం
డటనేపారుశరంబుగూర్చి జ్వలితోద్యత్కుండలంబైన యు
త్కటరక్షఃపతి రావణోచ్చశిరమున్ ఖండించె లోకుల్ గనన్. 539

తలఛిన్నంబయినేలరాలె నయినన్ దత్స్థానమందన్యమౌ
తలలేవన్ కరలాఘవానమరియుద్ధానిన్ వడిన్గూల్చఁగాఁ
దలయింకొక్కటిలేచె రాముఁడునికన్ దానిన్వడింగూల్చె నా
తలలిట్లేక శతంబుగూల్చినను నంతంబొందఁ డాతండికన్. 540

ఇటునూటొక్కతలల్ వడిన్దునుమ నీరావణుండంతమే
యుటఁబొందండని సర్వశాస్త్రవిదుడౌ నారాముడున్ చింతిలెన్
అటమారీచుఁడు వీనిచేతనెహతుండయ్యెన్ క్షయంబొంది రి
ట్లటఁగానన్ ఖరదూషణాదులు విరాధాదుల్ కబంధాదులున్. 541

ఆశరములివె నాకు విశ్వాసకరులె
ఏలరావణుపై వానియేపు పోయె
అనుచు చింతించుచుఁ బ్రమాదమందకుండ
రావణునివక్షమందు శరాలు కురిసె 542

రావణుఁడు కడు క్రుద్ధుఁడై రణధరిత్రి
రథము నెక్కియుండియె వేగ రాముసపుడు
ముసల గదలతోగొట్టి పూర్ణగతుల
విక్రమక్రమమును జూపె వక్రగతుల. 543

అద్రివయి సంతరిక్షంబునందు భువిని
తుములమై యొళ్ళు ఝల్లన సమరెరణము
సురలు దానవ యక్షులు నహిపిశాచ
రాక్షసులుచూడ నిశియెల్ల రణమెయయ్యె. 544

రాత్రియనక పవలనక రణముక్షణము
మానక ముహూర్తమేలేక మహితమయ్యె
రామరావణులంద నీ రామునికిని
జయమెలేమి మాతలిచేసె జ్ఞాపకమ్ము. 545

ఏమియెఱుఁగనటు లిటు వర్తింతువేల
వీనిఁజంప బ్రహ్మాస్త్రమువేయు వీర !
ఆ సురలు చెప్పినట్టి వినాశకాల
మయ్యె వీనికిప్పుడ యుంచు నరయుమోయి. 546

అటులు మాతలి జ్ఞప్తిచేయంగ రాముఁ
డపుడె పాముట్లు బుసగొట్టు నస్త్రముగొనె
తొల్లి భగవానుడా నగస్త్యుండ యిచ్చె
ఇది యమోఘాస్త్ర మిది బ్రహ్మయిడియె మున్ను. 547

అమితతేజస్వి బ్రహ్మయింద్రార్థమిద్ది
చేసె త్రిజగములు జయించు కోసమిడియె
దీనిపక్షాలగాలి, తుదిరవి యగ్ని
* మెయివిసు; గురుతమందర మేరులుండు. 548

ఇది మేనిచే మండు తనువున పులకముల్
చక్కఁ గఁ దనరార జాలువాఱు
హేమ భూషితమిద్ది యెల్ల భూతాలతే
జమునఁ జేయఁబడె భాస్కరవిభాసి
పొగగల కాలాగ్నిఁ బోలును దీప్తమౌ
నురగము వంటిది త్వరితకారి
పరనాగ హయభేది ద్వారపరిఘగిరి
భేది మేదో రక్తవితత మయ్యె

దారుణము వజ్రనాదము పోరునడఁచు
అఖిల విత్రాసనము బుసలార్చు పాము
కంక గృధ్ర గోమాయు భక్ష్యప్రదమ్ము
యమసమము కపినందన మసురనాశి. 550

ప్రబల లోకోత్తరేక్ష్వాకుభయ వినాశి
రిపు యశోహర మాత్మప్రకృష్టకరము
నయినయా మహాస్త్రమును మహాబలుండు
వేదవిధి విధానంబుగ వింటఁ దొడిగె. 551

అది రాముండు ధనుస్సునన్ దొడుగ భూతాళుల్ భయంబొందె నా
యుదనన్ ధాత్రి వణంకె రాముఁడటఁ గ్రోధావిష్టుఁడై చాప మ
య్యది సారించి ప్రమాద మొందకయె మర్మాఘాతమేనస్త్ర ము
న్మదుఁడౌ రావణు వక్షమందు యము నామాడ్కిన్ బడన్ వేసెనే. 552

* మెయి – తనువునమిను – మిన్ను – ఆకాశము.

వడినస్త్రంబు ప్రయుక్తమై తనువు రూపంబంత పొందన్ దురా
త్ముఁడెయౌరావణు రొమ్ము వ్రీల్చి రుధిరావ్వ్రింబొచుఁ బ్రాణాంతమై
పుడమింబొచ్చి పనిన్ ముగించి మరలన్ బూర్వంపు స్వస్థాన ము
య్యెడనే పొందె, దశాస్యు ప్రాణములతోనే తద్ధనుస్సుంబడెన్. 553

వ. అట్లు రాక్షసరాజును మహాద్యుతియును రావణుండు ప్రాణములు విడి వజ్రహతుండగు వృత్రాసురునివలె నేలఁగూలుటయు వారిని జూచి చావఁగా మిగిలిన రాక్షసులు అనాథులై భయత్రస్తులై నలుదిక్కులకుఁ బరువిడిరి. మరియు తరువులే యాయుధములుగాఁ గల వానరులు సుగ్రీవుని వధయును రాముని జయమును జూచి భయగ్రస్తులైన రాక్షసులు కొట్టఁబడి బాధపడి దిక్కులేనివారై జాలిగాఁ గన్నీళ్లు కార్చు ముఖములతో లంకవైపు పారిపోయిరి. అంత వానరులు జయగర్వముతో సంప్రహృష్టులై రాముని జయమును రావణుని వధను ఘోషించుచు మహాధ్వనులు గావించిరి. అంతరిక్షంబు నందు దేవదుందుభులు సౌమ్యముగా మ్రోగె. గాలిదివ్యగంధములు గొని సుఖముగా వీచెను. దుర్లభమై మనోహరమైన పుష్పవర్షములు అంతరిక్షము నుండి రాముని రథమునకు గప్పుచుఁ బడెను. మేలుమేలని మహాత్ములగు దేవతల స్తోత్రవాక్కు వినఁబడె సర్వలోక భయంకరుఁడైన రౌద్రుఁడైన రావణుఁడు కూలఁగా చారణులతోఁ గూడ దేవతలకు మహాహర్షము కలిగెను. రాక్షసరాజును జంపి రాముఁడు ప్రీతుఁడై మహాబలులైన సుగ్రీవుని అంగదుని కోర్కెలను సఫలము చేసెను. దేవులు ప్రసన్నులైరి. దిశలు నిర్మలమయ్యె ఆకాశము స్వచ్ఛమయ్యె భూమి కంపించుట మానె గాలి వీచెను. సూర్యుఁడు సుస్థిర కాంతికలవాఁడయ్యెను. సుగ్రీవుడు విభీషణుఁడు మొదలైన ముఖ్యసుహృదులు లక్ష్మణునితో పాటు వచ్చి లోకాభిరాముఁడైన రామునిని జయించుమని పలికి యభినందించి యథావిధిగఁ బూజించిరి. మహాతేజస్వియగు రఘుకుల నందనుఁడు రిపును జంపి ప్రతిజ్ఞ దీర్చి స్వజన బలముచే నావృతుఁడై దేవతలతోఁ గూడిన దేవేంద్రుఁడు వలె రాజిల్లెను. 554

ఇట్లు రామునిచే విజితుఁడై హతుఁడు నౌచు
అవనిఁ బడియున్న రావణు నన్నఁ జూచి
శోకవేగముతో నిండి క్రుక్కి మిగుల
నిఁక విభీషణుఁడట విలపించె మిగుల. 555

వీర! విక్రాంత! విఖ్యాత! విధివినీత!
న్యాయనిపుణ! మహారహ్యశయ్యాది యోగ్య!
అంగదయుత బాహులిల్ల వేలాడ సూర్య
రుచి మకుటమూడి పడఁగ బరుంటివేల? 556

నాఁడు నేఁజెప్పినట్లు యీనాఁడు జరిగె
కామ మోహాంధుఁడగు నీవుగాన వయ్యో
గర్వమున నప్రహస్తుఁడుగాని యింద్ర
జిత్తుగాని పరులు విశ్వసింపరైరి. 557

కుంభకర్ణుండును నరాంతకుండు నతిర
థుండగు నతికాయుఁడు నీవొకండవైన
స్వయముగాఁ దెల్పికొని నాదు వాక్కు వినరు
దానికిది ఫలితంబుగాఁ దప్పకయ్యె. 558

మేలినీతుల సేతువు కూలిపోయెం
ధర్మవిగ్రహ మీలాగు ధ్వంసమయ్యె
సత్వసారంబిటుల వినాశంబె యయ్యె
శాస్త్రముల స్వారస్యమే మరి కూలిపోయెం. 559

## —: అన్నకై విభీషణుడు విలపించుట :—

నేలపై నిట్లు నశియించి సోలనీవు
అస్త్రధారులలో శ్రేష్ఠుఁ డవనిఁ గూల
సూర్యుడిలరాలె శశిచొచ్చెఁ దమసు
చల్లఁబడె నగ్ని నుత్సాహమెల్లఁ బొల్లె. 560

రాక్షస వ్యాఘ్రమిట్లు సంగ్రామమందు
దుమ్ములోఁ బడి పొర్లుచుఁ దూలిపోవ
వీఁక వీరులేలేని యీలోకమందు
నింక మిగిలియున్నది యేమొ యెఱుఁగరాదు. 561

ధైర్యమే చివురుగ నొప్పు తలిరుగాఁగ
తపసె బలముగ శౌర్యమె తగిన వేరు
గలుగు రాక్షసరాజ వృక్షంబు నిపుడె
రామరఘుపుంగవపవనము భగ్నంగ నయ్యె. 562

విక్రమమె కొమ్ము,కులమె వెన్నెముక
కోపమె శరీరమగు వీపు కూకు దయయె
పూర్వభాగముగల దశముఖ గజేంద్రు
రామసింహము కూలిచి రాల్చె భువిని. 563

శౌర్యముత్సాహమె మండు జ్వాలలుగను
నిడుదయూరుపె పొగగాగ నిజబలంబె
పేర్చిమిగ బలి రావణ విసుత వహ్ని
[illegible] నార్పె రామజలద మిపుడె. 564

దైత్యు లనుతోకయును కకుదంబు కొమ్ము
గలిగి పరుల నడ్డుటతోను గంధ హస్తి
చపలతా కర్ణములు మంచి చక్షులొప్పు
అసుర వృషభమున్ రాము వ్యాఘ్రమడంచె. 565

అని సహేతుకముగను కృతార్థ నిశ్చ
యముగ పలుక విభీషణు నార్త వాక్కు
ఆలకించి రాముండు ధైర్యంబు గూర్ప
ఈవిధముగ వ్రాక్కుచ్చె నయ్యెడను మిగుల. 566

"ఇతండు నిశ్చేష్టుండై సహియింపలేదు
సమరమున చండవిక్రమ చర్యం జలిపె
మిగుల నుత్సాహమును జూపె మేని యుందు
మోహము త్యజించి చనిపోయె మోహముడుగు. 567

క్షత్రధర్మముగాని వృద్ధి సలుపం గోరు
వారు చనిపోవం జింతింపం బాడికాదు
ఎవనికిని నింద్రుండు జగంబులెల్ల వడంకె
అట్టి వాండు హతుండు కాంగ హడలుటేల. 568

ఇదివరకు నెన్నండును జయించుట యన
నొక్కరికె హక్కుగాదయా యుర్విపైని
గొప్పవారిచే వీరుండు కూల్చంబడుచు
వాడు పరులను గూడం జంపంగంగలండు. 569

ఇట్టి గతియె క్షత్రియోచిత మిదియె మున్ను
ధృతిని పూర్వులచేత సందిష్ట మయ్యె
క్షత్రియుండు సంగరములం జంపంబడిన
వాండు సుంతయేన్ శోచ్యుండు గాండు సుమ్ము. 570

రావణుండు మహాత్ముడౌ రాముచేతఁ
జంపఁ బడెనని విని శోకసాగరమున
బడియు విలపించుచును దైత్యవనితలెల్ల
వగల నంతిపురిని వీడి బయటబడిరి. 577

## —: రావణుకాంతలు ఏడ్చుట :—

ఎన్ని సార్లు వలదని వారించి నప్పు
డికిని వేల దుమ్ములఁబడి వికలలగుచు
దొర్లుచును జుట్టు విరఁబోసి దుఃఖముసను
నార్తలై వత్సహత గోవులట్లు పడిరి. 578

ఉత్తరంపు ద్వారముగుండ యుద్ధభువికి
రాక్షసులతోడఁ జని హతులను స్వపతుల
వెతకి కొనుచు హారాజ! సుత! యటంచు
హాప్రియా! నాథ! యని యార్చిరన్ని కడల. 579

మొంచెముల రక్తములచేత బురదయైన
యునిని స్వపతిన్ని వెదకుచు నశ్రుపూర్ణ
నేత్రములఁ ధర్త్ర శోకార్తి నినదములను
సలిపిరి హతయూథపకరేణుల విధాన. 580

అనిని నేలని బడియున్న శ్యామలాంజ
నాభుని మహాతను సువీరు నధిక కాంతు
రావణుని గాంచి వెసదశగ్రీవు సతులు
చినిన వనలతలు వేసఁ బ్రెళ్ళిపడిరి. 581

ఎన్నిసార్లు వలదని వారించినప్పటికిని
టికిని నేలదుమ్ములఁ బడి వికలలగుచు
దొర్లుచును జుట్టువిరఁ బోసిదుఃఖమునను
నార్తలై వత్సహత గోవులట్లుపడిరి 578

ఉత్తరంపు ద్వారముగుండ యుద్ధభువికి
రాక్షసులతోడఁ జని హతులను స్వపతుల
వెదకికొనుచు హా రాజ సుత యటంచు
హా ప్రియా నాథ యని యార్చిరన్నికడల 579

మొండెముల రక్తములచేత బురదమైన
యవనిని స్వపతిని వెదకుచునశ్రుపూర్ణ
నేత్రముల భర్తృశోకార్తినినదములను
సలిపిరి హతయూధప కరేణులవిధాన 580

అనినిధరాశిని బడియున్న శ్యామలాంజ
నాభుని మహాతను సువీరు నధిక కాంతు
రావణుని గాంచి పెన దశగ్రీవుసతులు
తెగిన వనలతలటుమేనఁ ద్రెళ్ళిపడిరి 581

ఒక్కతె ప్రేమఁ గౌఁగిలిడియున్నదియేడ్చుచు [illegible]
ఒక్కతె కాళ్ళు పట్టుకొనె నొక్కతె కంఠము గ్రుచ్చి యేడిచెన్
ఒక్కతె బాహులంబొడిచి యుర్విని దొర్లె [illegible]
ఒక్కతె మోముఁజూచి కడునొందెను మోహము [illegible] 582

అలతుషారాలచేతను పద్మమట్లు
బాష్పములచేత మోము సర్వంబు తడియ
ముఖమునే చూచుచును నొకపొలఁతి యపుడు
తనయొడిని తలనుంచి రోదనముచేసె 583

ఎవనికి భయపడి యింద్రుఁడు పాఱెనో
యెవ్వఁడు యముఁ బరువెత్తఁజేసె

ఎవనికిభయపడి యింకఁ గుబేరుఁడు
పుష్పకాఖ్య విమానముఁ త్యజించె

ఎవఁడు గంధర్వుల ఋషుల వీరసురల
భయపెట్టవారును బరువులిడిరొ

ఎవఁడసురులు సురలిలనాగులన భీతి
యేమాత్రమును బొందకెపుడు తిరిగె

ఎవఁడు దేవదానవ రాక్షసవిభులకును
జంపరానట్టివాఁడై యశస్సు పొందె
అతఁడు నరుచేత హతుఁడయ్యెనట్టి పతిని
అరసిదుఃఖితలై యేడ్చి రసురసతులు 845

వ॥ ఇతఁడు హితవాదులగు సుహృదుల మాట పెడచెవినిబెట్టి తన చావుకై సీతను తెచ్చెను. రాక్షసులాచంపఁబడిరి. ఈమేమందఱమును ఒక్కమాఱుగా చంపఁబడితిమి. హితము పలికిన విభీషణుని రోషములో అజ్ఞానమువల్ల ద్రోహివై నీవధ తెచ్చుకొంటివి. ఆ సీతనే కనుక నీవుతిరిగి యిచ్చివేసినచో మూలముట్టుగా ఈ ఘోరవ్యసనము రాకపోయెడిది గాదే. తనమాట చేసినందువల్ల విభీషణునికోరిక తీఱియుండెడిది. రాముఁడు నీ కులమునకు మిత్రమయ్యెడి వాఁడు. మేము విధవలము కాకపోయెడివారము. అందఱికోర్కెలుతీఱెడివి. శత్రువులే లేకపోయెడివారు నీవు కోరినదిగాని నీ కోర్కెగాని జరగలేదు. దైవమే అన్నియుఁజేయును. హతుఁడు దైవముచేతనే హతుఁడగును. ఓమహాబాహూ! దైవయోగ

ము వల్ల నీవును వానరులును రాక్షసులును నశించిరి. అర్థముచేతఁగాని కామముచేతఁగాని విక్రమముచేతఁగాని ఆజ్ఞచేతఁగాని దైవగతినితప్పింప నెవరికిని శక్యముగాదు అనియిట్లు రాక్షసరాజు భార్యలు ఆడు లేళ్ళవలె భాష్పములచే వ్యాకులములైన కళ్ళతో దుఃఖార్తలై యేడ్చిరి.

## —: మండోదరీ విలాపము :—

ఇటుల రాక్షసస్త్రీల్ విలపించుచుండఁ
బెద్దభార్య మండోదరి ప్రియునిజూచి
దీనయైయచింత్యపుఁగర్మ పూనురాము
చేహతుఁడగుపతి కయియేడ్చెను కరంబు 585

ఓ మహానుభావ! కుబేరసోదరుండ
అలుగు నీముందు దేవేంద్రుడైన నిలఁడు
ఋషులు బ్రాహ్మణుల్ గంధర్వు లింకచార
ణులును నీముందునిర్భితి నిలువలేరె 586

రణమున నరమాత్రుండైన రాముచేత
గెల్వఁబడిరాక్షసేశ! సిగ్గిల్లవేల
శౌర్యమునఁద్రిలోకిని గెల్చిపైపరాక
సిరులఁ నొప్పు నిన్వనిఁ దిర్గు నరుఁడె చంపె 587

మర్త్యులకు గోచరముకాని మహినికామ
రూపివై తిర్గునిన్ను మర్త్యుండురాముఁ
డనినినష్టుఁజేసెను నీ దావంత తగదు
ఇదియు రాముకర్మగ విశ్వసింపలేను.

అన్నివిధములనున్న నిన్నాతఁడెదురు
కొనుటనమ్మ జనస్థానమునను పెక్కు
రాక్షసులతోడఁ గూడిన భ్రాతఖరుఁడు
దునుమఁ బడెఁగాన నీతఁడు మనుజుఁడగునె 589

సురలు గూడను లంకను జొఱగలేరె
అట్టిది హనుమచొఱబాధనపుడెపడితి
ఘోరవానరులటు లబ్ధిఁగూడసేతుఁ
గట్టినపుడె రాముసమర్త్యుఁగాఁదలంతు 590

పోనిరాము వేషాన యముండెయిటుల
స్వయముగావచ్చి నీదునాశమున కూహ
చేయరాని మాయను జేసె, శత్రుచేత
నెదురు కొనఁబడితివె, శక్రుకేదిశక్తి 591

వ॥ నిజముగా నీతఁడు మహాయోగి పరమాత్ముఁడు సనాతనుఁడు ఆది మధ్యాంతరహితుఁడు గొప్పవానికంటెఁ గూడ జాలగొప్పవాఁడు. తమస్సును దాటినవాఁడు ధాతయె శంఖచక్రగదాధరుఁడు శ్రీవత్సవక్షుఁడు. నిత్యశ్రీమంతుడు జయింపరానివాఁడు శాశ్వతుఁడు. ధ్రువుఁడు సత్యపరాక్రముఁడు. విష్ణువె మానవరూపముదాల్చి వానరులుగానైన దేవులచే పరివృతుఁడయ్యె. సర్వలోకముల కీశ్వరుఁడైనయతఁడె సాక్షాత్తు లోకములకు హితము చేయఁగోరి మహాద్యుతియై రాక్షస పరివారము గల నిన్నువధించె. నీవిదివరలో ఇంద్రియములను జయించి త్రిభువనంబులను జయించితివి. అది జ్ఞాపకముంచుకొని యిపుడాయింద్రియములే నిన్ను జయించినవి. రామునితో విరోధము తగదనినేనెంత చెప్పి

నను వింటివిగావు. దానికిదిఫలితము. రాక్షసశ్రేష్ఠ! ఐశ్వర్యము దేహము స్వజనము నశించుటకై సీతను హఠాత్తుగా కామించితివి ఓ దుర్మతీ! అరుంధతిని రోహిణినిమించి మాన్యయగు సీతను బలాత్కారముగా ఎత్తుకుని వచ్చియనుచితమైన పనిచేసితివి. వసుధకంటెను ఓరిమిగలిగి లక్ష్మికంటెనుసంపదగలిగినపతివ్రతయు సర్వానవద్యాంగినియగు సీతను శుభను దీనను అడవిలో ఎవరులేని సమయమున కపటముగాఁదీసి కొనివచ్చి యాత్మీయ వస్తువులను దూషించు నీవు సీతవిషయక కామమునుపొందకయె ఓప్రభూ! ఆపతివ్రతచే తపస్సుచే దహింపఁబడితివి. ఆతనుగాత్రిని నెత్తుకొనివచ్చుచుఁ దగులఁ బడితివిగావు. అట్టినీ మహిమ చూచి ఇంద్రుతోఁ గూడిన దేవతలందఱు నిన్నుఁ గూర్చి భయపడు చున్నారు -

ఒనరించు పాపకర్మకు
ననువగు కాలంబు వచ్చినపు డది గావిం
చినమనుజుఁడు ఘోరఫలం
బునుగనులే నెంతమాత్రమును సంశయమున్ 592

శు మొనరించిన మనుజుఁడు
శుభమొందును పాపిపొందుఁ జుమిపాపంబున్
శుభమునె పొందెను గాదే
విభీషణుఁడు నీవొగంటివేగద చెడుగున్ 593

అతిగారూపము గలిగిన
యితరసతులు నీకునుగల రెందఱొభువిలో
అతిమోహంబున నీవో
లతాంతశరునశముపొంది భ్రష్టుఁడవైతే! 594

జానకిదాక్షిణ్యముచేఁ
గానీ వంశంబుచేతఁ గానీ సౌంద
ర్యానను గానీ నాకుస
మాన యధిక గాదు మోహమతిచేఁ గనవున్ 595

అఖిలప్రాణులకును మృతి
ఖిల ధముల ననిమిత్తమయి రాదుగదే
సు ముగ నీకది సీతా
ముఖమెనిమిత్తముగ వచ్చె భువి నరునండే 596

జనకజ రామునితో నే
వనటయులేక విహరించుఁ బ్రాభవమొప్పన్
వనటన్ గనుచును నేనో
మునిఁగితి దుఃఖాబ్ధి నల్పపుణ్యనుగానన్ 597

చైత్రరథమునఁ గైలాససానులందు
మేరుమందరశైల సమీపదరుల
దేవతోద్యాన సీమలఁ దిరిగి తిరిగి
సు ముపొందితి నీతోడ శూరవర్య! 598

అనురూప విమానముతో
ననుపమగు శ్రీలఁదనరి యులరుల దండల్
ఘన వసనములూని కం
టిని దేశము లిపుడోచనె నిఖిలసుఖంబుల్. 599

అనుపమ భోగమ్ములఁ బొం
దినదానసె, కాని యిపుడొ దీనసైయైతిన్
జననాధుల శ్రీలోఁగర
ముమ చంచలము లయియుండు భువిలోనన్ఛీ! 600

నునుమెత్తనై మించి కనుబొమ్మలనుమించి
పొలుపుచర్మము నెత్తు ముక్కుగలిగి
చంద్రకాంతియు పద్మసౌందర్యమున్మీఱి
సూర్యతేజంబును శోభ పనరి
శృంగారభమకుటంబు చెలంగఁ దామ్రాస్యాన
దీప్తకుండలముల దీప్తి నొంది
పానభూముల మదవ్యాకులలోలాక్ష
మయి పలుపూమాల లలరవెలిఁగి

మధుర సుందరస్మితములు మహితమగుచు
శుభమెయగు నాటి నీమోము సుందరతయు
ఇపుడొ ప్రభు ! యదెల్లను నేమియయ్యె
సుంతయును ప్రకాశింపదు గ్రుక్కిపోయె. 801

రాముశరమున భిన్నమై రక్తమోడ
శీర్ణమేదస్సు మెదడులచేతఁ డడిసి
స్యందనంపు ధూళులను రూక్షమ్మెయగుచు
ఈవదన మెట్టిదుస్థితి నెనసె నకట. 802

! నాకన్నను నీచమౌస్థితి యిబుల్ గల్గెంగదా దీనను
త్కటమై ధన్యము వచ్చె నెట్టి వనుధావ్యాపుండగా నాథ! ...
కిటు దైత్యేశుఁడొ భర్త యింద్రజితుడు నాజాప్తులుం ...
పటుగర్వంబున నొప్పునా నకటయు యిట్లుంగన్ ప్రవర్తిల్లెనే. 803

మదమత్తారి విశుద్ధనుండు మిగులం బ్రఖ్యాతశౌర్యుండు నా
హృదయాధీశుఁడు మాకు దేనివలనన్ లేదేభయంబుంచుచా
మదిలో గట్టిగనుంటి నేమిది యనూహ్యంబు ...
బుదయించెన్ నరునల్ల నిప్పుడు ... 804

నిద్దమగు నింద్రనీల మాణిక్యమట్లు
నీలిదై యున్నతాద్రిని బోలియుండి
లలితకేయూర వైడూర్య రాజదంగ
దముల ముత్యాలమాలఁదనరె మేను. 605

అట్టిమేను విహారాల నందమీనె
యుద్ధభూమిని దీప్తమై యొప్పుచుండె
అదియె మెఱపులచేత నద్దమట్లు
అధికకాంతులచే వెల్గి యలరుచుండె. 606

అట్టిమేను నేఁడో దారుణాశుగములు
గుచ్చుకొన, పడియుండెను క్షోణిపైని
కరము స్పృశియింప శక్యముగాకయుండె
దాని గౌఁగిలించుకొన నెట్టులౌను నకట. 607

ముండ్లచే ముండ్లపందికిఁబోలె నీకు
మస్తుల నెరమెలేకుండ మేనఁ గుచ్చు
కొనినశరములు నరములఁ గోయఁగండి
వజ్రముతగిలిపడు గిరివలెను బడితి. 608

కలయొ యిప్పుది ఇది కలగాదు నిజము
అకట! రాముచే నెటు క్షయంబందినావు
మృత్యువునకుఁగూడను నీవు మృత్యువుగద
ఎట్లు మృత్యువశంబును నెనసినావు. 609

త్రైలోక్య భర్తవు త్రైలోక్య భయదుఁడ
వఖిలలోక జయివి యధిక బలివి
కైలాస కంపివి గర్విత హంతవు
లోక విక్షోభివి ప్రాణి రావి

వరిముందు నోజస్సునలర గర్జింతువె
స్వ భయద భటగోప్త వసురనేత
వావేల యక్షులహంత విష్టివినాశి
వా నివాతకవచా ద్యంతకుఁడవు

స్వజనరక్షివి ధర్మవ్యవస్థా వినాశి
వనిని సకలమాయల సృష్టినొనరఁజేతు
వసుర నరదేవకన్యల నెసహరింతు
వరుల కాంతావ్యథాదాత వా ప్తవశివి. 610

వ. మఱియు లంకాద్వీప రక్షకుఁడవు, భీతకర్ములను చేయువాఁడవు. మావంటి వారికి కామభోగముల నొసంగువాఁడవు, రథిక శ్రేష్ఠుఁడవు ఇంతటి ప్రభావము గలవాఁడవైన నీవు రామునిచేఁ జంపఁబడి నేలపైఁ బడి యుండఁగాఁ జూచి హతప్రియనగు నేను స్థిరురాలనై దేహము దాల్చి బ్రతికి యుంటిని. మహార్హ శయనములఁ బరుండఁదగు నీవిందు మన్నుపైఁ బడి పాటల వర్ణుఁడవై ఏల పడియుంటివి ? ఇంద్రజిత్తు లక్ష్మణునిచే జంపఁబడి నపుడే దీవ్రముగాఁ గొట్టఁబడితిని. ఇప్పుడు ఇంకను కూలఁబడిపోతిని. బంధు హీనను కాన నీవంటి నాథుఁడు లేకపోయి పతిహీననైతిని. కామభోగములచేఁ గూడ హీననై పతిహీననై శాశ్వత శోకమునఁబడి కుములుచుంటిని. 611

రాజ ! దుర్గమమైన మార్గమ్ము నిపుడు
పొందితివి, వ్యథార్త నను గొనిపొమ్ము కూడ
ఈవు లేకుండ నేను జీవింపలేను
కృపణ మందను నను వీడనెంతు వేల. 612

మేలిముసుగు లేకుండ నీప్రోలి పెద్ద
ద్వారమునగుండ నిట్లు వచ్చితినని
అగ్గితివె యిష్టదార ! సిగ్గైన విడచి
ముసుగులేకవచ్చిన యబ్జముఖులఁ జూడు. 613

ముసుగులేకుండ వచ్చిన బోంట్ల : జూచి
ఏల కోపగింప విధి క్రీడించువేళ
సాకుపడు సతుల్ నీకై విచారపడుచు
నేడ్తు రోదార్చువేల మన్నింపవేల. 614

రాజ ! వీరలను విధవరాండ్రఁజేసి
నావు, వీరలో గురువుల సేవసేయు
ధర్మపరలు పతివ్రతల్, తాపమొంది
వీరు శపియింపఁ, బడినావు వైరిచేత. 615

ఊపు బాధింపఁ దప్పావ మిట్లు తగలె
అల పతివ్రతలకు సత్రి లవనిపైకి
జారకెపవనను ప్రవాద యుర్వి నిజము
చాలమట్టుకు నిదియవన్ సత్యమిద్ది. 616

కపటమృగవేషమున రాముఁ గానలోన
ఆశ్రమమునుండి తప్పించి యుథికదూర
మట్టి రాము పత్నిని కౌఁగిలించినావు
ఇది పతివ్రతానిలక్షణ మేలకాదు. 617

పతితేరన మొప్పదైన సంగతమునందు
పేజిఁ గగ్గినట్టిలు గుర్తు నాకులేదు
ధాన్యమది తల్లక్రిందౌటవలన పిడికి
రాముహేవ పీకిన పాపంబుకంటు గుర్తు. 618

భూత వర్తమానములు భావులు నెఱుంగు
సత్యవాక్కు పూజ్యుడు విభీషణుడు మఱది
సీతఁగని విమర్శించి విన్నిచెనదె జరిగె
ఆతఁడన్నట్లె దైత్యక్షయంబె యయ్యె. 619

ఈ విభీషణు మాటలు నీవు వినియు
సరిగమిగులఁ గామక్రోధజన్యమైన
వ్యసనమునను ప్రసంగించి యతనిమాట
మొదలెత్రోయ మూలముననె ముప్పు వచ్చె. 620

అఖిల దైత్యజాతికి నాధుడన్నవాఁడు
లేనటుల నీవెచేసినా వింతశక్తి
యున్నవాఁడవె నాకు శోచ్యుడవె కావు
స్త్రీస్వభావాన జాలిగాఁ జింతఁగనుదు. 621

సుకృతమో దుష్కృతమొ చేసి శూరవర్య!
నీకుఁదగిన గతినిటు పొందితివి లెమ్ము
నేనొ నీ వియోగమునఁ జింతించుచుండి
నన్నుగూర్చియు నేనె చింతలను గందు. 622

హితముకోరెడి నీదు సుహృదుల మాట
భ్రాతలహితంబు వినవు హేత్వర్థయుక్త
మైనదియును శ్రేయస్కర మకటువునగు
నా విభీషణుని వచస్సు లకట వినవు. 623

కుంభకర్ణ మారీచులుకూడఁ జెప్పి
రింక నా తండ్రి చెప్పె గర్వించి వినవు
శ్యామలాబ్జాభ! పీతవస్త్రా! శుభాంగ!
స్వాంగములు నెత్తుటఁ దడువఁజడితి వేల. 624

నిదురఁజెందిన నరుడట్లు నిండువ్యథలఁ
గుందు నాతోడ మాటాడకుందు వేల
ఘన పరాక్రముఁడగు దక్షు కదనమందు
పరువిడని దైత్యసుత ! నన్ను నరయవేల. 625

క్రొత్తయవమాన మిటు రాఁగ గునుకుదేల
లెమ్ములెమ్మోయి యిపుడు నిర్భీతితోడ
సూర్యకిరణాలు లంకలోఁ జొచ్చుచుండె
ఇదిగొ ఈపైపు సరిగ వీక్షింపుమోయిః 626

వజ్రివవియట్లు నీదు గౌరవమ్ములంది
భానువర్చస్సు గలిగియు స్వర్ణజాల
భాసితమయి శత్రులఁజంపు నీ పరిఘయిదిగొ
శరములన్ వేలుగో్రీలి ధరనుబడియె. 627

రణభువిని ప్రియనటు కౌగిటదృఢంబ
హొదివి నిద్రింతు; వప్రియఁబోలె నన్ను
నేల పలుకరింపవు; నీవు నిట్లు చనఁగ
ఛీఛి ! నా హృది వేయిగాఁ జీలదేల. 628

ఇటుల విలపించి స్నేహార్ద్ర హృదయ యామె
అశ్రువులచేత వ్యాకులతాత్మ యగుచు
మూర్ఛిలుచు రావణు హృదయంబుననువాలె
ఎఱుపుసంజను మబ్బుపై మెఱుపువోలె. 629

వ. అంత ఆమె సపత్నులు ఎంతయు ఏడ్చుచు నేడ్చుచున మెయ్యా నెదార్చి పట్టుకొని యిట్లనిరి. "దేవీ ! లోకముల స్థితి శాశ్వతము కాదని నీకెఱుఁగవు గనుకనా. అవస్థ మారినపుడు రాజుల లక్ష్ములు చంచలమైనవి

దా" అని వారుపలుకుచుండ నామె బిగ్గరగా ఏడ్చి కన్నీటిజాలులతో తొమ్మ కడిపివేయు నంతలో రాముఁడు విభీషణునితో "నీ అన్నకు అగ్నిసంస్కారము చేయుము. ఈ స్త్రీలను మరలింపుము" అని యనఁగ ఆ మాటలు విన్న విభీషణుఁడు వినమ్రుఁడై ధర్మజ్ఞుఁడై బుద్ధితో విమర్శించి ధర్మార్థ సహితమైన వాక్యమును రాముని మాటప్రకారము చేయఁదలచి యిట్లనియెను. 630

## —: రాముడు రావణునికి సంస్కారము చేయమనుట

పరధర్మవ్రతమున్ త్యజించిన మృషావాదిన్ నృశంసున్ ఖలున్
పరకాంతారతు సంస్కరింపఁ దలఁపన్; భ్రాతాకృతిన్ గొన్న యీ
యరి సర్వాహితుఁడైన రావణుఁడు నా కన్నయ్యయై యుంటచే
కరమున్ నాకిటఁ బూజనీయుఁ డయినంగానీ తగం దర్చకున్. 631

తొలుతన్ నన్ను నృశంసుఁ డంచు జనులందుర్ గాని యువ్వాని చె
డలువిన్నంతట నేను చేసినది ప్రశస్తంబంచు వాకొంద్రులో
కులు తా, మంచు విభీషణుం డనెడి పల్కుల్ ధార్మికుండైన ని
ర్మల వాక్యజ్ఞుఁడు రాముఁడున్ విని యిటుల్ వాక్రుచ్చె సంప్రీతుఁడై. 632

ఈవు గూడ నాప్రియుఁడవు గానవివవలయు
నీప్రభావాన జయమును నేనుగంటి
ఇప్పుడె యవశ్యమును రాక్షసేశుఁడైన
నీకు హితమైనదియె నేను నెఱపవలయు. 633

ఈ నిశాచరుఁడో పూర్తిగా నధర్మ
మన్నృతమును చేసినట్టి వాడైనఁ గాని
ఎపుడు యుద్ధాలలో శౌర్యమెంతొ చూపి
నట్టివాఁడు తేజస్వియు నధిక బలుఁడు. 634

ఇంద్రుఁడు మొదలౌదేవుల్ జయింపరితని
లోక రావణ రావణుండును ఘనుండె
వైరముల్ వైరి చావుతో తీరిపోవు
నాపనియు తీరె నీకటుల్ నాకు హితుఁడె. 635

ఇంక వీనికి సంస్కార మీవు చేయు
శాస్త్రము ప్రకారము దశాస్యు సంస్కరింపు
ఇట్టి సంస్కారమె దశాస్యుడెనయఁ దగును
నీవును యశస్సు పొందిన నిపుణుఁ డవుదు. 636

వ. అని యిట్లు రాముఁడు చెప్పఁగా విని త్వరపడి విభీషణుఁడు తగిన సంస్కారమును రావణునికి చేసెను. మంచి గంధపుఁ జెక్కలతోను పద్మకము వట్టి వ్రేళ్ళతోను లేడి చర్మముతోడను కూడిన చితను వేదోక్తరీతిగా ఋత్విజులు కూర్చిరి. పిదపవేదవిహితమైన యంత్యేష్టినిచేసిరి. పిదప పితృమేధముగావించిరి. దక్షిణముగాఁ దూర్పుగానే అనగా ఆగ్నేయముగావేదియందగ్నిని పెరుగుతోఁ గూడిన స్రువమును ఋత్విక్కులందఱును వైచిరి. ఆ ఋత్విజులు రావణుని కాళ్ళ దగ్గర సోమలతను తెచ్చుటకై బండిని, తొడల మధ్య వఝ్లు దంచుటకై తోలును ఉంచిరి. విచక్షణులైన ఋత్విక్కులు దారుపాత్రలన్నిటిని అరణిని, ఉత్తరారణిని రోకలిని ఇతర పాత్రలను మహర్షి విహితమైన శాస్త్రవిహితముగా యథాస్థానముగా నుంచి అందు మేధ్య పశువును వధించి వ్రేల్చి దాని

మును నేతితోఁ దడిపి రావణు శరీరమునఁ గప్పిరి. పిదప విభీషణునితోపాటు రాక్షసులు దీనులై గంధమాల్యములతో వివిధ వస్త్రములతో రావణు శరీరమును అలంకరించి మొగమునఁ గన్నీళ్ళు కారుచు పేలాలు చల్లిరి. విభీషణుఁడు మంత్ర సహితముగా నగ్ని నంటించి స్నానము చేసి తడిబట్టతో గడ్డి పరకలుగల నువ్వులను నీటితో యథావిధిగ నేలపై నుంచి వానికి శిరసానమస్కరింపఁగా పిదప స్త్రీలను అతనిని సాంత్వ వాక్యములతో మరల మరల అనునయించి నడువుమని యనుచు అందఱు స్త్రీలు నగరమును ప్రవేశించిరి. ఆ రాక్షసస్త్రీలు నగరము ప్రవేశింపగా విభీషణుఁడు రాముని దగ్గఱకు వచ్చి నమ్రుఁడై యతని ప్రక్క నిలిచెను. రాముఁడును సైన్యముతోడను సుగ్రీవ లక్ష్మణులతోను గూడ ఇంద్రుఁడు వృత్రునివలె ఇట్లు శత్రువును జంపి సంతుష్టుడయ్యెను. 637

## —: రాముఁడు ఇంద్రుని రథమును పంపివేయుట :—

సురగంధర్వులు దానవుల్ మఱి రుక్షోటిన్ విమానాల సుం
దర భాగంబుల నుండి రావణువధన్ దర్శించి యారావణా
సురు ఘోరాంతము రాము విక్రమునచ్చో వానరోగ్రాజిబా
తురి సుగ్రీవుని మంతనంబుగని యెంతో పాడిముచ్చట్లకథల్. 638

అట నాలక్ష్మణు వీర్య మట్టియును నానాశక్తి వృత్తంబు ల
చ్చటి కళ్యాణకథల్, వచింపు కొనుచున్ సంతోష మేపార ముం
దటినే యట్టి మహామునులు రమంతన్ వచ్చినన్ గ్గి నా
రట రాముండా రథంబు నింద్రునికి నీ పంపెం పె నామాతనిన్. 639

అంత నారాముని యనుజ్ఞ నపుడె పొంది
మాతలి దివి వేగ ముదంబు సమ్మదము పొంది
రాముఁడంత లక్ష్మణుని ప్రేరణము చేత
వెలమి సుగ్రీవునటఁ గౌఁగిలించుకొనియె. 240

చేరి కపిముఖ్యు లర్చింప శిబిరమేగి
పరగ సత్యసంపన్ను లక్ష్మణుని బల్కె
సౌమ్య ! యనురక్తు నుపకారి పరసభక్తు
క్షితిని నభిషిక్తుఁ చేయఁ జేయుమన్న ! 641

సౌమ్య! యీరావణానుజున్ పరగ లంక
యందు నభిషిక్తుఁజేయుట యొరయు టిదియు
నాపరమవాంఛ యని యామహాత్ముఁడైన
రాముఁడన సరెయని లక్ష్మణుఁడని 642

స్వర్ణకుంభము గొని, దాని వానరులకు
నిచ్చి సంద్రపు జలములఁ దెమ్ముటకయి
ఆమహాసత్వుల కపుడె యానతీయ
వార్ధి జలములు తెచ్చిరి వారలపుడె. 643

అప్పుడొక ఘటంబును పరమాసనమున
నుంచి సౌమిత్రియు విభీషణునికి లంక
ఘట జలములతోడ నభిషేకంబు చేసె
రామునాజ్ఞ రాక్షసుల మిత్రాళి మధ్య. 644

చెచ్చెర విభీషణుఁడు నభిషిక్తుఁ డగుటఁ
గని దితిజ భక్తులు సచివుల్ గనిరి ముదము
ఇక విభీషణుఁడును రాముడిడిన రాజ్య
మొంది ప్రకృతుల నోదార్చి పొందె రాము. 645

అవలఁ బౌరులౌ రాక్షసులవని కొఱకు
అక్షతలును సుంద్రాక్ష్య దివ్యసుమాలు
నలరి తెచ్చినఁ గొని మంగళార్థమైన
మంగళద్రవ్యములు రామలక్ష్మణుల కిడిరె. 646

చేయువలసినయది చేసి శ్రేష్ఠవృద్ధి
గొనిన యావిభీషణు రాముడెంచి సర్వ
మతని ప్రియమునకై కొని ప్రాంజలి యయి
నిలిచిన నగాభుహనుమంతుఁ బలికెనిట్లు. 647

చని మహారాజగు విభీషణుని యనుజ్ఞ
గొని యువల సౌమ్యరావణు ఘనగృహంబు
చొచ్చి నాజయంబు తెలిపి మెచ్చసీత
సంతసపడ మాక్షేమము సరగఁ జెప్పు. 648

ఏనులక్ష్మణ సుగ్రీవు లెల్లఁగుశల
మని పచించి రావణు మృత్యు వనెడి ప్రియము
తెలిపి కపిముఖ్య! పిదప మైథిలి పచించి
నట్టి సందేశము గొని యరుగుదెమ్ము ! 649

హనుమంతుండటు రామునాజ్ఞ గొని దైత్య శ్రేణి పూజింప లం
కను వేఁ జొచ్చి దశాస్య గేహమున సంస్కారంబె లేకుండ దా
రుణ దుష్ట గ్రహయుక్త రోహిణి యటుల్ చూపట్టి యాచెట్ల క్రిం
దను నానందము లేక దైత్యవనితల్ గాపున్న సీతన్ గనెన్. 650

వినతుండై మెలమెల్ల వంగి దరికిన్ వేవచ్చి చేమోడ్చు నా
హనుమంతున్ గనిదేవి యూరకొనియున్నట్టే నిరీక్షించి జ్ఞ
ప్తిని నాపైఁ గని మోదమొందె నవలన్ దేవీప్రసన్నాస్యమున్
హనుమంతుండును గాంచి యెల్లఁ దెలుపన్ ప్రారంభమున్ జేసెఁగా.

క్షేమము రామలక్ష్మణులు క్షేమము వానరరాడ్విభీషణుల్
క్షేమము వానరాళి; యడిగెన్నిను క్షేమము సిద్ధకార్యుడై
రాముఁడు రావణుందునిమె రాముఁడు లక్ష్మణుఁ డావిభీషణుం
డేమరకెంతొ సాయపడ నెల్లకపుల్ కడుఁబోర దేవిరో! 652

వ. మఱియు నారాముఁడిట్లు నీకువచించె.

ఇటు నీకుం బ్రియమున్ వచించికడు దేవీ! గూర్తుసంప్రీతి నేఁ
బటు ధర్మజ్ఞ! రణానగెల్చుట మహాభాగ్యానఁ జీవించి, తి
చ్చట గెల్పొమనకయ్యె, జానకి ! యిఁకన్ స్వస్థాత్మవై దుఃఖమిం
కిట వర్జింపుము రావణుండొ హతుఁడయ్యెన్ లంకఁజేజిక్కెఁజూ. 653

నిద్రయాహారమును మాని నీవిముక్తి
కొరకు వార్ధిబంధించి దుస్తరప్రతిజ్ఞ
దాటితి దశాస్యునిల్లని తల్లడిలకు
సకల లంకసంపద విభీషణునిదయ్యె. 654

ఊరడిలుసీత! స్వగృహాన నుంటివిపుడు
అదెగనుమి యుత్సుకతఁ బొంగి యతఁడెవచ్చు"
నని హనుమచెప్ప శశిముఖి విని ముదాన
నొక్క గంతేసి పలుకలేకూరకుండె. 655

అంత నేమిమాడక యట్లెయున్న
సీతతో మారుతియొ యిటువచించె నపుడు,
దేవి! యేమి యిప్పుడును జింతింతువిట్లు
ఏల నాతోడ మాటాడకిట్టులుంటి. 656

అని హనుమ చెప్ప ధర్మాననలరి సీత
ఎంతొపొంగి గద్గదవాక్కులెసఁగఁ బలికె
భర్త ప్రియవిజయము విని ప్రమదమొంది
ఒక్కనిముసము పలుకలేకూరకుంటి. 657

ఇంతటి ప్రియముంబు నాకు వచించినట్టి
నిన్నె టుల నభినందింతునో నేనెఱుంగ
దీనికి సమంబు పృథివి నేదేనిగలదె
నీకు నిడఁ దగ్గదెంచియు నెరుగసౌమ్య. 658

ఏ హిరణ్యమొ స్వర్ణమొ యెన్నొ మణులొ
ఏ త్రిలోకరాజ్యమొ యైననిట్టి నుడికి
సమము గావంచు నప్పుడు జానకియన
అంజలిఘటించి ముందుండి హనుమ యనియె. 659

పతికి ప్రియహితంబున వలుదాన!
భర్తవిజయము కాంక్షించు పడతిమిన్న!
ఇట్టి స్నేహపూరిత వాక్యమీవె చక్కఁ
బలుకఁ దగ్గదానవు ధరాతలములోన. 660

వ. అని హనుమంతుండు పలుక జనకాత్మజయగు సీత విని మారుతితో నింకను శుభమైన మాటలిట్లుపలికెను. "మిక్కిలి మంచిలక్షణములుగలిగి మధురముగా భాసిలుచున్న మహావాక్యమును గ్రహణ, ధారణ, స్మరణ, ప్రతిపాదనములు, ఊహ, అపోహ, అర్థవిజ్ఞానము, తత్త్వవిజ్ఞానము అను నెనిమిది యంగములతోఁగూడిన బుద్ధికౌశలుర నీవే తగినవాడవు. పరమధార్మికుడవైన నీవు కొనియాడఁదగిన వాయుపుత్రుడవు. బలము, శౌర్యము, శ్రుతము సత్త్వము, విక్రమము, దక్షత, తేజస్సు, క్షమ, ధృతి, ధైర్యము, వినయము అనునివేగాక యింకనితరమైన వాడిగుణములు నీయందె శోభిల్లుచున్నవి. అని సీతపలుక విని మారుతి కంగారులేక ప్రాంజలియై సంతోషముతో సీతకెదురుగా నిలుచుండి యిట్లనెను. 661

ఇపుడే నీవిట నన్ను నుమతింతేన్-దిక్కులేకన్ వియో
గపు శోకంబున నీయశోకవనిలో గాసిల్లునిన్ సాధ్వి గ్రూ
రపు ఘోరంపుఁ గనుల్నిగిడ్చి మును క్రూరాచారలై ప్రేలి రె
చ్చి పయింబడ్డ కఠోర దైత్యసతులన్ జీల్తున్ వరంబిమ్మిటుల్. 662

పిడికిళ్ళంబొడుతున్ గరాలనడఁతున్ పెన్కాళ్ళతోఁ ద్రొక్కెదన్
కుడి మోకాలను గ్రుమ్మెదన్ చెవులు ముక్కుల్పీకి పెనుగోళ్ళను
క్కడగింతున్ సుయశస్విని! కురులపీకన్బీకి పెన్వళ్ళతో
చెడునాడించిన సర్వ దైత్యసతులన్ జీల్తున్ వెసన్ దేవిరో. 663

అని యామారుతి యట్లుచెప్పవిని ధర్మంబైన వాక్యంబు ని
ట్లని యాజానకి యాయశస్విని యనెన్ రాజాశ్రితల్వార ల
న్యుని యాజ్ఞన్ బనిచేయు దాసజనమందున్ వేరుకోపింత్రు నా
దు నదృష్టంబది మాఱఁ బూర్వకృతమద్దు ష్కర్మనయ్యె న్నిటుల్. 664

నేను చేసియుంటి ననుభవించి యిపుడు
చేసినది ప్రాప్తమగునిది స్థిరముసుమ్మి
ఏ నడంచు గానిదెల్ల నిపుడు సైతుఁ
జిత్తమందు రావణుని దాసీలపనుల. 665

రావణుఁడాజ్ఞ యిచ్చుటనె రాక్షసకాంతలు వీరునన్ను నె
న్నో విధమైన బాధలిడి యుండిరి యాతఁడు మృత్యువొంద వీ
రేవిధమైన బాధలిడ, రిప్పుడెఱుంగుమిదియోయి వాయు సూ
తా! విను వ్యాఘ్రమునన్నిధిని వృక్షముచెప్పిన ధర్మవృత్తమున్. 666

"పాపమును జేసి నటువంటి వారికెపుడు
ధేయుఁడుండు తాను పాపంబు చేయరాదు
నియమ రక్షణ చేయుట నీతిసుమ్మి
చెడును చేయువారికిఁ జెడు చేయరాదు" 667

పాపియొ మఱి నపాపియొ వధ్యుఁ డవుతఁ
గాని యార్యుఁడు చూపనోఁ గరుణమొకటె
వానరా! ప్రపంచమున నెవ్వాఁడుగాని
చూడఁ దప్పేమి చేయనివాఁడెలేఁడు. 668

ప్రాణి హింసించి విహరించు నట్టివారు
కామరూపులునైన రాక్షసులు తాము
పాపములు చేయుచున్నను వారికెపుడు
చెడుగు నెంతమాత్రము గూడఁ జేయరాదు. 669

అని వైదేహి వచింప వాక్చతురుఁడౌ నావాయుజుం డా యశ
స్వినియౌ రాముని పత్నికిట్లనియె దేవీ! రామునిల్లాల్ యశ
స్వినివౌ నీవిటు లంట, యెంత తగి యొప్పెన్ మంచి దింకిప్పటికీ
వును సందేశము నిమ్ము రాముదకికిన్ బోదున్ గదా శీఘ్రమే. 670

హనుమంతుండిటు పల్కవల్క విని యప్డా సీతవైదేహి భ
ర్తను జూడన్ దలపోతునిప్పుడె కపీంద్రా! యంచు మెల్లంగ వా
కొన నాలించి ద్యుతిన్ వెలింగె కపిముఖ్యుం డా విదేహేశు పు
త్రిని సంతోషము పెట్టుచున్ పలికెన్ ప్రీతచిత్తంబుతో. 671

పరిపూర్ణేందు నిభాస్య మిత్రయుతు విఖ్యాతాఖిలామిత్రు శ్రీ
కరు రామున్ సహలక్ష్మణున్ శచియు స్వర్నాథు నింబోలె నీ
వరయంగాఁ గల వార్యురాల! యనుచున్ సాక్షాత్తు శ్రీఁబోలె భా
సురయౌసీతకు జెప్పి రాముదరికేఁ బ్రావె హన్మంతుఁడున్! 672

ఆ మహాప్రాజ్ఞుఁ డర్థజ్ఞుఁడైన హనుమ
అఖిల ధానుష్కవరు రాము నరసి యనియె
ఎందుకై యింతపని ఫలం బింతకలిగె
అట్టి దేవి నాకైను సీత నరయునగుడు. 673

ఆమె యశోక మగ్నయయి యశ్రులు కన్నుల నడ్డగింపఁగా
ఆమిథిలేశపుత్రి ఘనయుం బిది నీ మది నాలకించి యొం
తో ముద మొంది ప్రాక్పరిచితున్ నను నమ్మియు బల్ వచించె నే
నిమ్మదినాదు భర్తఁ గృతకృత్యు సలక్ష్మణుఁ జూడఁ గోరెదన్. 674

అని యామారుతి చెప్ప ధార్మికవరుండౌ రాముఁ డాలించి వెం
టనె ధ్యానంబును పొంది యశ్రువులు కండ్లన్ సుంతజాల్వాఱ వె
చ్చని దీర్ఘంబుగ నుస్సురంచు క్షితిపైఁ జక్షుల్ నిదానించుచున్
గని మేఘాభుఁడెయౌ విభీషణు దిక్కై పల్కె నీరీతిగన్. 675

దివ్యమౌ నంగరాగము దివ్యమైన
భూషలును దాల్చి తలస్నానము పొనర్చి
కొన్న మిథిలేశు పుత్రి నీక్షోణి కిపుడు
సత్వరము తీసికొని రమ్ము జాగువలదు. 676

అని రాముండనఁగా విభీషణుఁడు రాజాంతఃపురంబేగి క్ర
న్నన స్త్రీలకుం జెప్పి పంపెనిటు స్నానంబాది ప్రకల్పించ కా
లును భూషల్ మెయిందాల్చి పల్లకిని నారోహించియే తెమ్ము నీ
కును భద్రంబగు భర్త నిన్ను నరయుం గోరెన్ సుమీ మైథిలీ! 677

అని విభీషణుఁడు తెలుపనపుడు నేను
స్నానమాడక పతిఁ గనందలఁతు నిపుడు
అసురవిభు!" యని జానకి యనఁగ నపుడు
ఆ విభీషణుఁ డనె సీత కంజలించి. 678

'ఎట్లు రాజైన భర్త వచించె నట్లె
[illegible]" ననియా విభీషణుఁడు పలుక
నా పతివ్రత జానకి యట్లె యనుచు
సాధ్వియై భర్తృ భక్తి పనగఁ బలికె. 679

ఇఁక స్త్రీలున్ తలస్నానమాడిన విదేహాశాత్మజన్ సీతఁ బా
యకవల్ భూషలలంకరించి బహుమూల్యంబైన చీనాంబర రా
ులకడున్ గట్టగఁ బెట్టఁ బల్లకిని నారోహింపగాఁ జేసి పూ
నికఁ గావన్ భటు లా విభీషణుఁడు నెంతే శ్రద్ధఁ దెచ్చెన్ సతిన్. 680

అతఁడు దరికేగి ధ్యానంబు నందునున్న
యట్లు తెలిసి గూడను నామహాత్ము రాము
దరిని బ్రణమిల్లి ప్రీతుఁడై తాను సీత
వచ్చినట్లు నివేదించెను భక్తి మీఱ. 681

రాక్షసగృహంబునందుఁ జిరంబయున్న
సీతయిటకు వచ్చినయట్లు చెవులఁబడఁగ
రాము హృదయంబునందు హర్షంబుదైన్య
మాగ్రహము నొక్కమాఱుగ నపుడె కలిగె. 682

పిదపఁ బ్రక్కనెయున్న విభీషణునటఁ
జూచి సవిమర్శగా సమాలోచనంబు
చేసి యావిభీషణునితోఁ జెప్పెనిటుల
రాముఁడెదఁ బ్రహర్షమె లేనిలాగు తోఁప. 683

సతము నా జయమ్ముగోరు సౌమ్య! రాక్ష
సాధిపా! నాదరికి విదేహసుత వచ్చుఁ
గాకన విభీషణుఁడు సీతరాకకొరకు
దూరముగఁ దప్పుకొనఁ బ్రజన్ దొలగఁజేసె. 684

రాజు దుస్తులు తలపాగలను ధరించి
హస్తములనొత్తు బెత్తములచటఁ దాల్చి
ఇటునటులఁ దిరుగుచు నెల్లయెడల నార్చి
భటుల జనులఁ దప్పింపఁ బరువులిడిరి. 685

భటులు బెదరించి తప్పింపఁ బనులుమిగుల
సలిపి ఋక్షరాక్షస కపిసంఘములను
దవ్వుగాఁ దప్పుకొనఁ జేయుధ్వనులు వెడలఁ
బెనుతుఫానులఁ గొట్టుకొను వనధిఁబోలె. 686

అటుల దవ్వుగఁ దప్పుకోనఁజూచి సహచు
రాజు భటుల జాలిని నోర్వక రాముఁడాపి
చూపులన్ దగులంబెట్టుచున్న యట్లు
ప్రాజ్ఞుని విభీషణుని గసరిపలికె విసిగి. 687

ఏల ననులక్ష్యపెట్టక యీజనంబు
నిట్లు బాధపెట్టెదవు చాలింపుమింక
ఇట్లు వీరిని దొలగఁద్రోయింప మాను
వీరలందఱుగూడ నావారుగాదె. 688

అంతఃపురములు గానీ
దొంతరపలువలు ప్రహరులుఁ దూగెడి తెఱలేన్
ఇంతటి యాచారములే
నింతులనడ్డవిక నడ్డునింతులనడతే. 689

వ్యసనమందుఁ గష్టములందు నాజులందు
రాజుల స్వయంవరములందుఁ గ్రతువులందు
పెండ్లిసమయంబు నందింతిఁ గండ్లఁ గనుట
ఎంత మాత్రము తప్పని యెంచరెవరు. 690

ఈమె రణభూమినున్నది యెంతొ కష్ట
మందునుండె విశేషించి యిందు నాదు
దగ్గఱనెయుండెఁ గావునఁ దన్నిఁగనుట
ఎంతమాత్రము తప్పని యెంచరెవరు. 691

కావున విభీషణా! త్వరగానె యిపుడు
నాదరికిఁ దీసికొనిరమ్ము నన్నుఁగూడ
స్నేహితుల బృందములు నాచెంతనున్న
తరుణ మందీమె కనుఁగాక సరిగనిపుడె. 692

సవిమర్శంబుగ రాముఁడిట్లు వచియించన్ జూచివైదేహి నం
త వినీతుండయి యావిభీషణుఁడు చెంతన్ సౌమిత్రిచే
రువ సుగ్రీవుఁడు నాంజనేయుఁడును లోలో – రాముఁ డా రీతి న
న్నవి యాలించి యటన్ కడున్వ్యథితులై నాల్లె నిశ్చేష్టులై 693

పతియందేమి యపేక్షలేనిటు తోచన్జేయు తద్దారుణేం
గితముల్ కన్గొని సీతపైని మదిలో స్నేహంబు నజ్జానకీ
పతికిన్ లేనటు వారలెంచిరి, యింకన్ వైదేహి లజ్జన్ మునిం
గి తలన్వంచి స్వగాత్రముల్ ముడిచి వెన్కేపోయె దైత్యేశుకున్. 694

జనులెల్లన్ గుమిగూడియున్న సభ లజ్జన్ కొంగుచే మోము నె
ల్లను నాజానకి కప్పుకొంచుఁ జనిభర్త న్నార్యపుత్రా! యటం
చును వాక్రుచ్చుచునేడ్చి, విస్మయము హర్షోద్రేకమున్ స్నేహమున్.
దనరన్ సౌమ్యపు భర్తమోము పయికిన్గాంచెన్ సుసౌమ్యాస్యయై. 695

–: రాముఁడు సీతను పరుషములాడుట :–

వ. పిదప జాలకాలముచుండి చూడనట్టి, ఉదయించిన పూర్ణచంద్రునివలె మనోహరమయిన ప్రియుని మోమునుచూచి స్వచ్ఛమైన చంద్రునివంటి ముఖముగలయామె తనమనస్సునందలి బాధను పోఁగొట్టుకొనెను. 696

ముడిచికొని నమ్రయై పార్శ్వముననె నిల్చు
జానకిఁగని రాముఁడు నడఁచలోననున్న
యల్కచేఁ జెప్పెనిటు నాజినరిని గెల్చి
భద్రురాల! గెలుచుకొంటి వడిగనిన్ను. 697

పౌరుషమువల్ల నెదియొనర్పంగ వలెనొ
అదె యిపుడుచేసినా, నిదేయంతు పగకు
వడిగ నా నిరసన తుచ్చివై చినాను
అరిని నవమాన మొకమాటె యడఁచినాను. 698

ఇపుడు నాపౌరుషమును జూపించినాను
ఇపుడు నాశ్రమసఫలమయ్యెను జగాన
నేఁడును ప్రతిజ్ఞ నెఱవేర్చినాఁడఁ గాన
అన్నిటికి నేసమర్థుఁడ నౌదునిందు. 699

నేనులేనప్డు చలచిత్తుఁడైన మూర్ఖ
రాక్షసుఁడు నిన్నపహరించి లంక నునిచె
దైవవశమున జరిగిన తప్పుపనికి
అడరి గెల్చితి మనుజుఁడనైన నేను. 700

వచ్చిన యవమానంబును
హెచ్చిన తేజస్సుచేత నెవ డణఁచండో
లొచ్చగు తేజసుగల యా
యుచ్చక పురుషు పురుషార్థమేమిటి జగతిన్. 701

వ. సముద్రమును లంఘించి లంకనుమర్దించిన యాహనుమంతుని మహాకార్యమెంత శ్లాఘింపఁదగినది. యుద్ధమున విక్రమము చూపుచు నా హితమును ఆలోచించి చెప్పుచున్న సుగ్రీవునిపరిశ్రమ నేడెంతసఫలము• నిర్గు యిన యన్నను వదలి స్వయముగా నన్ను జేరిన భక్తుడయిన విభీష ణుని పరిశ్రమ సార్థకము. 702

అని రాముండనుచుండ జానకియుఁ జాలొ నశ్రులన్‌దడ్సి గా
డిన లేడింబలెఁ గండ్లువిప్పుకొని యుండెన్; జానకిన్‌జూచు రా
మునికింకన్ మదిఁ గ్రోధమెచ్చఁగఁ గిరంబున్ నేయిపోయంగజ్వా
లను చేగ్రక్కుచు నుండునగ్నివలె గండ్లంగట్టె నారాముడున్. 703

కనుబొమ్మల్ కడుఁజిట్లి నడ్డముగ వక్రంబైన నేత్రాలఁ గ
న్గొనుచున్ వానరదైత్యమధ్యమున నతిన్ క్రూరోగ్రమై పీరు ప
ల్కెను రాముండనె "శత్రుదిక్కృతిని నిర్మూలించు మర్త్యుండు దే
నిని గావించు, నదే ద్విషత్సరణముండిన్ గెల్చి నేఁ జేసితన్. 704

జీవలోకంబునకుఁ బ్రవేశింపరాని
దక్షిణదిశ తపోభావితాత్ముఁడైన
యాయగస్త్యుచే నిర్జితమైనయట్లు
నైవరయె సీత! జితమైత శత్రునుండి. 705

భద్రురాల! నేఁబడినట్టి పాటెల్ల
నీకును విదితమై యుప్పఁగాక యుప్పుడు
అదియునెల్ల సుహృదుల వీర్యంబువల్లఁ
జన్నతి నిది నీకొఱకై తె చేయలేదు. 707

వృత్తమును-సెల్లెడల నుండి వెడలెడి యప
వాదు నుండి-రక్షించు పనికిఁ గాను
ఖ్యాతమగు నాకులము కపఖ్యాతిరాక
యుండుట కిదెల్లను జేసియుంటిఁ జుమ్మి 708

నడతలోను శంకితవౌచు నాదు నెదుట
నుంటి విటు, నేత్రరోగి ముందున్నదీప
మటుల ప్రతికూలనైతి వియ్యది దృఢంబు
కనుక జానకి! మదనుజ్ఞఁ జనుము స్వేచ్ఛ. 709

ఇవిగొ పదిదిక్కు లెటకైన నేగవచ్చు
భద్రురాల! నీతోనాకుఁ బనియె లేదు
పరుల యింటనుండిన స్త్రీనెవండెయైన
వంశమునను బుట్టిన మగవాఁడు కొనునె. 710

అందులోను తేజస్వియై యమరు వాఁడు
రావణుని యొడి నుండియు జాతి భ్రష్టవగుచు
చెడుది యగు దృష్టిచేఁ జూడఁబడిన నిన్ను
తగ సుహృదులు మెచ్చుకొనుచిత్తమునఁ గొనునె. 711

మాది యింత గొప్పది కులంబనుచుఁ జెప్పు
కొనెడి నేనైతె యెటులు గైకొందు నిన్ను
ఎందుకైతె నీవిపుడు నిర్జింపఁ బడితొ
అట్టి కీర్తియు నేనిలఁ బెట్టుకొంటి. 712

నాకు నీయందు నేమి మనస్సులేదు
ఇచట నుండియు స్వేచ్ఛగనేగు మెటకొ
ఇదియు నేను బుద్ధిని నిశ్చయించుకొనియె
యిటుల వాకొనుచున్నాఁడ నిట్టు లిపుడు. 713

నీకు సుఖమైన యట్టులె నీవు సీత!
ధరణి లక్ష్మణుపైననో భరతుపైనో
లేక వానరరాజు సుగ్రీవుపైనో
మనసిడుము దైత్యవిభు విభీషణుని పైనో 714

ప్రథిత దివ్యరూపయు మనోరమయునైన
నిన్నుఁజూచి రావణుఁడు స్వనిలయమందు
చాలకాలముంచిన నిన్ను నైచునెట్లు
సీత! యనుచు రాముండు వచియించె మిగుల. 715

ప్రియమును దగినమాటలు నాలింపఁదగిన
మైథిలి చిరకాలమునకు మదికిఁ బ్రియము
కానిది ప్రియునుండెవిని బాష్పానఁదడిసి
గజకరహత సల్లకివోలెఁ గడు వడంకె. 716

అటు రోషంబున రాముడే యొడలు ఝల్లన్పించు క్రూరోగ్ర వా
క్కటు పల్కన్ మదినెంతయో వ్యధతురాలై పాపమా సీత యె
చ్చట నైనన్నును చెప్పుడున్ వినని రూక్షంబైన యాపత్తు పెన్
కటువాక్కెల్ల జనంబు మధ్య విని యింకన్ సిగ్గుఁజెందెన్ కడున్. 717

అపుడో స్వాంగమునందె క్రుంగునటులై యా సీత వే క్రుంగి వా
క్యపు శల్యంబులు గ్రుచ్చుకోఁగ శితశల్య స్వాంతపోలెన్ సుదుః
ఖ పుటావృత్తింబడు నశ్రులున్ పొరలుగాఁగ స్రమ్ములన్ గ్రుక్కి బా
ష్పపు స్వీయాస్యము తుడ్చుచున్ వడఁకుచున్ వాక్రుచ్చెనా జక్తతో. 718

అనరానట్టిది శ్రోత్రదారుణము సత్యంతోగ్రమున్ నన్నునే
మని యానీచపువాక్కు నీచపు జనుండట్టుల్ వినంబల్కె దె
ట్లని నన్నెంచుచు నుంటివో నృపకులా వీరా! నేనుగానింక నే
వు నిదే నమ్ముమి, యొట్టుపెట్టుకొనెదన్ పోనినాదుశీలంబుతో. 719

ఎ రో దుష్టపుస్త్రీలఁబట్టి యిపుడిట్లీ నీవు స్త్రీజాతినే
భువిశంకించెద, వీట్టిశంక విడుమిప్డున్నన్ బరీక్షింపుమో
యివిభూ! యన్యునిమేన్ స్పృశించితినిసంటే, నప్పుడో నాకునే
నవశాత్మన్‌గద నాకు స్వేచ్ఛయుటలేదా దైవమే దోషియా. 720

హృదయంబో మదధీన మాహృదయమైతే నీయెడన్ నిల్చెడిన్
మదధీనంబయికాక గాత్రములు నన్యాధీనమౌ నేమి చే
యుదు నేనప్పు డశక్తురాల నిటులెంతో కాలమున్ గల్సి నీ
దు దరిన్ వర్ధిలు నన్నెఱుంగుటమొలేదా హతన్ బూర్తిగా. 721

ఎపుడైతే హనుమంతు వీరు నను నన్వేషింపగాఁ బంపితో
యపుడే లంకనునున్న నన్నునిట వీరా! యేల వర్జింపవై,
తపుడున్ నీవనుమాటలన్ వినియు నన్నారీతి నర్జించియు
న్నపుడే యాహనుమంతుముందె బ్రదుకున్‌వర్జించి యుండుంగదే. 722

ఎది యేమౌనోయటన్న సంశయములో నీజీవితంబుంచి, యం
తది కష్టంబు వృథాపడన్ వలసియుండన్ బోదుగాదే సద్
హృదయుల్ వ్యర్థముగా శ్రమంపడఁబనే లేకుండెడిన్‌గాదె నీ
మదినీభావమె యున్నయట్లయినచో మానాభిమానప్రదా! 723

ఇట నరవ్యాఘ్రు! క్రోధాన హెచ్చి నీవు
మూర్ఖనరుడట్లు స్త్రీత్వమున్ ముందిడితివి
జనకుమిష భూతలినగు నాజన్మ, నీవు
వృత్తమును ముందిడవయితి వృత్తవిదుడ. 724

బాల్యమున బాలుడౌనీవు పట్టినట్టి
పాణిని ప్రమాణముగ గ్రహింపవు గదోయి
నీయెడల నాకుఁగలభక్తి నియతశీల
మెల్లయును నీవు వెన్కకే యాడ్చినావు. 725

అనుచుఁ బలుకుచు నేడ్చుచు నశ్రులొలుక
వడవడ వడంకుపలుకులు పలికిసీత
దీనుఁడై ధ్యానపరుఁడౌచు మౌనమూని
యుడరు లక్ష్మణునటఁ జూచి యనియెనిట్లు. 726

ఇపుడె చితిపేర్చు సౌమిత్రి! యిట్టివ్యధను
అంతమొందించు నయ్యు దీయౌషధంబె
మిధ్యగాఁగొట్టు దెబ్బల మిగులఁ స్రుక్కి
యింక జీవింపగా నుత్సహింపలేను. 727

నాగుణమ్ముల కప్రీతుడైనభర్త
యిట్టి జనసభలోనన్ త్యజించిపైవ
ఎటకుఁ బోవుటకైనను నిపుడుతగను
ఇంక నగ్నిహోత్రములోనె యిపుడుచొత్తు. 728

ఇటుల వైదేహిచే పచియింపబడిన
లక్ష్మణుండు నాశత్రు వీరాంతకుండు
అచట దైన్యవశంబునంది యిపుడు
రాము భావమెఱుఁగ రాము మోముచూచె. 729

రామునాకృతిచేఁ దెల్సి రామునికిని
సమ్మతిగ చితిన్ వీరలక్ష్మణుఁడు పేర్చె
రామునికి నధోముఖుని కల్గనని సీత
తాఁ బ్రదక్షిణమొనరించి దరిసెనగ్ని. 730

దేవులకు బ్రాహ్మణులకు వైదేహి మ్రొక్కి
అగ్ని దరిఁగేలు జోడించి యనియె నిటులు
నామనసు రాముపిడి పరుందలఁప దేని
లోకసాక్షియౌ నగ్నినన్ బ్రోచునాక! 731

నన్ను । బరిశుద్ధ శీలన్ మనస్సు నందు
నపరిశుద్ధశీలఁగ రాముఁ డాత్మనెంచెఁ
గానన న్ని యెడల నుండి కాంచి యిపుడు
లోకసాక్షియౌ నగ్నినన్ బ్రోచుఁగాక. 732

కనులచేఁ గాని మదిచేతఁ గాని కర్మ
చేనయిన సర్వధర్మ విజ్ఞానియైన
రాము నతిచరింపని శుద్ధురాలనేని
లోకసాక్షియౌ నగ్నినన్ బ్రోచుఁగాక. 733

భగవానుండగు సూర్యుఁడున్ శశియు నావాయ్వంతరిక్షంబులున్
పగలున్ రాత్రియు సంధ్యలున్ దిశలు విశ్వంబూను భూదేవి స
ర్వగులౌ నన్యులు దేవులున్ నను బవిత్రంబైన సచ్ఛీలు రా
లిగ భావించిన లోకసాక్షి యనలుండే నన్ను రక్షించుతన్. 734

అని యాయగ్నికి త్రిఃప్రదక్షిణముగా నేతెంచి నిస్సంగమౌ
మన సేపారఁగ సీత ముందు ననలున్ భక్తిన్ జొఱంగానటన్
జనముల్ బాలురు వృద్ధులున్ మిగులత్రస్తస్వాంతులై యగ్ని యం
దె నిరాటంకమ చొచ్చు నాజనకజన్ వీక్షించి రత్యార్తితో. 735

పుటముల్ పెట్టిన మేల్మి క్రొత్త కనకంబున్ బోలు నెమ్మేనిపై
పుటముల్ పెట్టిన మేల్మిబంగరు నగల్ పొల్పారి భాసింప న
చ్చట దీప్తాగ్నిని సర్వలోకముకనన్ సంకోచమే లేక ముం
దటనే చొచ్చుట ముజ్జగంబు కనెఁ బూర్ణాజ్యాహుతిన్ బోలెన్సతిన్. 736

సతులెల్లన్ జ్వలితాగ్నిలోఁ బడిన యాసాధ్విన్ నిరీక్షించి దుః
ఖితలై యేడ్చిరి మంత్ర సంస్కృత హుతాగ్నిన్ సుయజ్ఞంబులో
పతితంబౌ వసుధార నట్టులు దివంబందుండి శాపంబుచే
పతితంబౌ నరకాప్తదేవత నటుల్ స్వర్గుల్ నిరీక్షించిరిన్. 737

సీత యగ్నిలోఁ జొచ్చుటఁ జెంతఁ జూచి
రాక్షసులలోన వానర వ్రజములోన
నద్భుతం బయి విపుల హాహా రవంబు
దిశల వ్యాపించె నప్పుడు దిక్కు లద్రువ. 738

అపుడు ధర్మాత్ముడగు రాముడార్తు డగుచు
నాజనములాడు మాటలాలకించి
బాష్పములచేత వ్యాకులంబైన కనుల
నొక ముహూర్తము ధ్యానియై యూరకుండె. 739

పిదపన్ వైశ్రవణుండురాజు, పితృలన్ బేదించు వాఁడౌ యముం
డది గన్గొన్న సహస్ర నేత్రుఁడు సురాధ్యక్షుండు, సప్త ద్వీప
ద్వ్యధముండౌ వరుణుండు సర్వ్రపి మహాదేవుండు ముక్కంటియా
విధి లోకాల సృజించు బ్రహ్మవిభుడున్ వీరెల్ల నత్యంతులై. 740

స్వవిమానంబుల సూర్య సన్నిభములన్ జక్కంగఁ దామెక్కి మిం
చి విభూషల్గల దీర్ఘబాహు యుగమున్ శీర్షంబుపై కెత్తి లో
కవిభుల్ లంకను జేరి రాముని రామునిఁ జూచి కేల్మోడ్చి రా
ఘవుతో నా త్రిదశోత్తముల్ పలికి రీ సంస్తవ వాక్యంబులన్. 741

సర్వలోకకర్తవు జ్ఞాని సత్తముండవు
అనలమున సీతపడ నూరకౌట కేలొ
దేవగణవర్యు నిను గీర తెలియ లేల
బుతుధిరివి వసువు ప్రజాపతివి మహేశ. 742

త్రిభువనాది కర్తవు స్వయం ప్రభుడవు నీవు
రుద్రులందు నెనిమిదవ రుద్రుండవీవు
సాధ్యులందును నీవు పంచముండవు
ఇది తెలియువేళ నీవెను మ్మెల్లగితవి.

నీకు నశ్వినీ దేవులే నేర్మి చెవులు
సూర్యచంద్రులు నీకనుల్ శూరవర్య
ఎల్ల జగముల కాద్యంత దృష్ట్యుఁడీవు
జనకజ విడెదె సామాన్య మనుజుడట్లు. 744

అనుచు నాలోకపాలురు ననఁగ నపుడు
భువన విభుఁడు దేవతలలో ముఖ్యుఁడైన
ధార్మిక వరుండు రాము డత్తఱిని నట్టి
త్రిదశ ముఖ్యులతోడ నీరీతిఁ బలికె. 745

నను మానవునిగ దశరథ
తనయుండగు రామునిగను తలఁతును మదిలో
కని నేనెవఁడ నెవనివాఁ
డనో యెటు వచ్చితినో పూజ్యుఁడవు వాకొనుమీ. 746

వ. అని యిట్లు వలుకు కాకుత్థ్సుడగు రాముని జూచి బ్రహ్మవిదులలో వరుఁడగు బ్రహ్మ యిట్లనియె. “శ్రీరామా! సత్యపరాక్రమా! సత్యము చెప్పెద విను'మని యిట్లనెను. 747

నీవు నారాయణదేవుఁడ, వీవు శ్రీ
మంతుఁడవును, చక్రమహితుఁ డీవు
ఈవు విభుఁడ, వేక శృంగ వరాహమ,
విఁక భూత భావి విద్వేషి హరుఁడ
వీ వక్షరుండవు, నీవు బ్రహ్మ మనంత
మందును మధ్య సత్యాత్ముఁ డవును
నీవు లోకంబులకెక్కువౌ ధర్మమ,
వీవు విష్వక్సేన దేవుఁడవును

వేలకాళ్ళు నూఱుతలలు వేలకనులు
గలుగు శ్రీమంతుఁడవు భూతగణముదాల్తు
వద్రిసహిత భూమినిదాల్చు నసఘుఁడీవ
యవనిఁ దుది నీట శేషుండవయి ధరింతు. 742

దానవ గంధర్వ తద్దేవయుతమగు
మూడులోకములూను ప్రోడవీవ
నేను నీహృదయమ నీసరస్వతిదేవి
నీదు నాలుకయౌచు నెగడుచుండు
నెఱిఁ బరబ్రహ్మమౌ నీదు రోమములును
దేవులౌదురు ప్రభు! దివ్యరూప
నీ ఱెప్పపాటగు నిఖిలమునకు రాత్రి
నీవు మేల్కొనుట నెఱయుఁ బవలు
వేదములు నీదు సంస్కార వితతి యగును
నీవులేనిది యేదియు నెగడదిందు
సర్వజగమును నీమేనె సరిగఁజూడ
ఈ ధరాతలి నీదు స్థిరమాకృతియగు. 743

ఈవహ్ని నీయల్క శ్రీవత్సమను చిహ్నమున్
నునుపుఁ జంద్రుఁడు త్వదనుగ్రహంబు
మును మూఁడెయడుగుల మూఁడులోకంబులు
నాక్రమించిన మహావిక్రముఁడవు
గొప్పరాక్షసు బలిన్గూడ బంధించి యా
దేవేంద్రు రాజుఁగాఁ దీర్చినావు
సీతయె లక్ష్మియౌ శ్రీవిష్ణువవు నీవు
క్షితిఁ బ్రజాపతి దేవకృష్ణుడవును.

అవని రావణుఁజంప మానవశరీర
మిటులఁదొచ్చి ధర్మమునిల్పు నీశ్వరుడఁవు
ఇంతటి ఘనకార్య మొనర్చి, తిపుడె రావ
ణుని వధించితి వలరియె చనుముదివికి. 744

నీ ఘనవీర్య మమోఘ మ
మోఘము నీ విక్రమంబు భువిలోపల ఓ
రాఘవ! నీ దర్శనము న
మోఘ, మమోఘమ్ము స్తవ, మమోఘులు భక్తుల్. 745

తథ్యముగఁ బురాణ పురుషోత్తముని నిన్ను
నెవ్వరు భజింతురో వారలిహమునందు
పరమునందును సర్వాభి వాంఛితములఁ
బొందుచుందురు సదాభూతలాన. 746

ఈ యార్ష స్తోత్రంబును
ఈ యతిగఁ బురాతనమగు నితిహాసంబున్
ఏయపుడు నరులు కీర్తన
చేయుదురో వారుగనరు క్షితిఁబరిభవమున్. 747

వ. అని యిట్లు పితామహుఁడు చెప్పిన శుభవాక్యములను విని హవ్యములు ధరించువాడును, లోకసాక్షియు అందఱను పవిత్రమొనరించు వాఁడునగు నగ్నిహోత్రుఁడు చితను ద్రోసిపైచి వైదేహిని ఒడిలోనుంచుకొని మూర్తినిధరించి శీఘ్రముగాఁ బైకెగిరివచ్చి యపుడు బాలసూర్యునివలె నుండి నదియు మేలిమిబంగరు భూషణములు ధరించినదియు రక్తవస్త్రముఁ దాల్చి నదియు వంగిన నీలికురులుగలిగి నదియు వాడిపోని మాల్యములు భూషణములులు గలిగియున్నదియు నగునాయశస్విని సీతను రామునికప్ప 748
గించి యిట్లనెను.

కాని దశరథు నాత్మజుండైన రాముఁ
డెంతకామి బాలిశుఁడు నేఁడిట్టిసీత
నింతయేని శోధింపక యిట్టితాను
గైకొనియెనంచు సుజనులుకడు వచింత్రు. 754

జనకసుత మైథిలి యనన్యమనసుతోడ
నామనసుఁబట్టి యెప్పుడున్ నడచుననుచు
నేను నెఱుఁగుదుఁగాని యీయెల్ల ప్రజల
నమ్మికకు నుపేక్షించితి నగ్నిఁబడిన. 755

స్వీయతేజునఁ దన్ను రక్షించుకొన్న
యీవిశాలాక్షి నింతేని రావణుండు
జలధి గట్టును బలె దాటఁజాల డింక
అగ్నిశిఖనటు దుష్టుఁడు నంటఁలేఁడు. 756

వ. ఈశోభనురాలు రావణుని యంతఃపురము నందలి యైశ్వర్యమును గోరినదిగాదు. సూర్యునితో ఛాయ వేఱుగా నుండనట్లు ఈనాతో వేఱుగానున్న రాలై యుండునదికాదు. జనకసుతయగు నీమైథిలి మూడు లోకములందును విశుద్ధురాలయి ఆత్మవంతుని చేత కీర్తివలె విడువ శక్యమైనదిగాదు. లోక మాన్యులు స్నిగ్ధులునైన వీరి శుభవాక్కుప్రకారము నేనుచేయవలసియున్నది అని రాముఁడు విదితమగు నట్లు పలికి మహాబలులచే ప్రశంసింపబడుచు స్వకర్మ చేత మెచ్చుకొనఁబడి ప్రియతోఁ గూడి మహాబలుఁడయి సుఖార్హుఁడగుచు సుఖ మును పొందెను. 757

ఇటు రాముండు శుభంబుగాఁ బలుకఁగా నింకన్ శుభంబొప్ప నం
తట నీశుండు వచించె "దీర్ఘభుజ! పద్మాక్షా! మహావక్ష! యు
ద్భట శత్రుందమనా! మహాస్త్రధర! మాభాగ్యంబుచే నీ వయిం
తటి యుత్కృష్టపుఁ గర్మ చేసితివిగాదా లోకముల్ మెచ్చఁగన్. 758

వ. నీవు నాపైని అనుగ్రహము చూపదలతువేని నాయందె కనుక నీకు స్నేహమున్న యెడల నాకోరిక మన్నింపదగును. నేను నీకు అనుచరుఁడను. నీకు ఆజ్ఞ యిడుటకాదు. నాయందు అనుగ్రహము చూపుమనుటయు అపుడు రాముఁ డిట్లనియె సౌమ్య! నీయందు స్నేహము లేకకాదు. నీవు నన్ను పూజించినట్లుగానే గ్రహింపుము. నాసోదరుడగు భరతుని జూచుటకునామనస్సు తొందర పడుచున్నది. నాకు శిరసానమస్కరించి నన్ను వనము నుండి అయోధ్యకుఁ దీసికొని పోవుటకు వచ్చి ప్రార్థించిన భరతుని ప్రార్థనను అంగీకరింపనైతిని. తల్లి కౌసల్యను సుమిత్రను యశస్విని యగు కైకేయిని గురువులను సుహృదులను పౌరులను వారి సుతులను జూడ మనసు ఆతురపడుచున్నది. వెంటనే పుష్పక విమానమును రప్పింపుము. నీమాట ప్రకారము చేయులేక పోవుచున్నందుకు నన్ను మన్నింపుము. నాపయికోపపడకు. అని రాముఁడనుటయువిభీషణుఁడట్లేయని సకల విధాలంకార శోభితమగుపుష్పకమును రప్పించి పుష్పక విమానము వచ్చినట్లు రామునికి నివేదించి యొక్క ప్రక్కగ నిలిచి యుండెను. 768

వ. అంత వినయముతో ఒకప్రక్కగా నిలిచియున్న విభీషణుని దరిగా నిలిచి లక్ష్మణుఁడు వినుచుండ విభీషణ! ఈ వానరులు సకలవిధముల ప్రయత్నములు చేసినారు. కనుక వీరిని రత్నములతోను వివిధ భూషణములతోను సత్కరింపుము. ఎవరికిని జయింపరానిలంక ప్రాణభయమువీడి వెన్నుచూపక యీవానరులచే జయింపఁబడినది. కనుక వీరికి రత్నాదులు బహూకరించి వీరి ప్రయత్నము సఫలముచేయుము అనఁగా విభీషణుఁడు వారికి అనేక బహుమానములు సమర్పింపఁజూచి అపుడు రాముఁడు సీతను తనయొడిలో నుంచుకొని ధనుర్ధారియగు లక్ష్మణుతో విమానమెక్కి సుగ్రీవ ప్రభృతుల దగ్గఱ సెలవుగయికొన అపుడు సుగ్రీవాదులు రామునితో అయోధ్యకువచ్చి తన యభిషేకము చూడగోరుటయు రాముడు విభీషణునిజూచి నీవును వీరందరు అయోధ్యకు వచ్చెదరుగాక విమానమెక్కు డనుటయు సపరివారముగా వారందఱు విమానమెక్కి అయోధ్యకు బయలుదేఱిరి. 769

మహాఘాతకములను నశింపజేయునది. ఇక్కడనే మహాదేవుడయిన సముద్రుడు అనుగ్రహము చూపెను. ఇక్కడనే ఈ రాక్షసరాజు విభీషణుఁడువచ్చి మాతోఁ గలిసెను. సీతా! ఇదిగో చిత్రకాననములుగల కిష్కింధ. ఇది రమ్యమయిన పట్టణము. ఇక్కడనె నాచే వాలి చంపబడెను.

## —: సీత తారాదులను, కపులను అయోధ్యకు రప్పించుట :—

అనియనఁగా సీత కిష్కింధాపురమును జూచి స్నేహముతో రామునకిట్లనియె "తార మొదలగు సుగ్రీవ ప్రియభార్యలతో పాటు వానరులు తమతమ స్త్రీలతో అయోధ్యకు రాగోరుచున్నాను. అపుడు రాముఁడట్లేయని రాముడనఁగా ఆ రాముని వాక్కు ననుసరించి సుగ్రీవుడు వానరులు అలంకరించు కొన్ని తమతమ భార్యలతో విమానము నెక్కి బయలుదేఱిరి. అపుడు రాముఁడు సీతకు అయా ప్రదేశములు చూచుచు సీతా! ఇది ఋష్యముక పర్వతము స్వర్ణ ధాతు మండితమై మెఱపులతోఁ గూడిన మబ్బువలెనున్నది. చూడుము ఇక్కడనే సుగ్రీవునితోఁ గలిసి స్నేహము చేసికొని వానిని జంపితిని. ఇక్కడనే చిత్రకానన మను పంపా సరస్సు గలదు. ఇక్కడనే నీవు లేకపోవుటచే దుఃఖముతో విలపించితిని. ఇక్కడనే ధర్మచారిణియగు శబరిని చూచితిని. ఇక్కడనే యోజనబాహువైన కబందుడు హతుఁడయ్యెను. నీకోసమిక్కడనే జటాయువునకు క్రూరుడై రావణునికి మహాయుద్ధమయ్యెను. ఇదిగో ఇక్కడ త్రిశిరుఁడు దూషణుఁడు అనువారు నాచేఁ జంపబడిరి. ఇదిగో మనమున్న పర్ణశాల. ఇక్కడనే కదా నీవు రావణునిచే హరింపఁబడితివి. ఇక్కడనే ప్రసన్న జలయగు గోదావరి కలదు. అదిగో అది యగస్త్యాశ్రమము ఇటనే మహాత్ముడైన సుతీక్ష్ణుని యాశ్రమము శరభంగాశ్రమమును గలవు. ఇక్కడకే యింద్రుడు వచ్చెను. ఈప్రదేశముననే విరాధుఁడు హతుడయ్యెను. ఇందు ఎన్నో తాపసాశ్రమములు గలవు. సూర్యవైశ్వానర ప్రభగల యత్రిమహాముని కులపతియుండెను.

ఇక్కడ ధర్మచారిణి అనసూయను జూచితిని ఇదిగో చిత్రకూటముఇక్కడ కైక పుత్త్రుఁడు నన్ను అనుగ్రహింపఁజేసికొనుటకై వచ్చెను. ఇదిగోయమున. ఇక్కడనే భరద్వాజుని యాశ్రమము గలదు. ఇదిగో త్రిపథగమైన గంగ ఇది నానా పక్షిగణకీర్ణమైన పుష్పించిన కాననములతో విరాజిల్లుచున్నది. అదిగో వాతండ్రి రాజధాని యయోధ్య అనగా వానరులందఱు విభీషణుడు ఆ పురమును పైకి ఎగిరి ఎగిరి చూచిరి. మహేంద్రుని యమరావతివలె నాయయోధ్య పాండురములైన సౌధపంక్తులతో విశాలకక్ష్యలతో గజతురగ సంకులమైకను పట్టెను. 773

## —: రాముడు భరద్వాజాశ్రమమున నాగుట :—

కడకుఁ బదునాల్గవ యేడు గడచిపోవ
పంచమిని రాముఁడిక భరద్వాజు నాశ్ర
మమ్ము చని భరద్వాజుని మహితభక్తి
మ్రొక్కి యామునీశు నడిగె ముందు నిటుల. 774

ఓయి భగవానుడ యాయయోధ్య యందు
కడు సుభిక్షము నారోగ్యము నడరుఁ గాదె
యుక్తుడై భరతుండట నుండె నొక్కొ
తల్లులును జీవములతోడఁ దనరుదురొకా. 775

ఆన భరద్వాజుండు నగవానమున
తొణఁక హృష్టుఁడై రాముతోడఁ బలికె
భరతుడో మేననిండుగ బురద పూసి
కొని జడలు పాదుకలూని కను నిన్నె. 776

వ, నీకయి భరతుండు వేచిచూచుచుండెను. మీ యింట నందఱును గుశలంబు, నీవు నారబట్టలుదాల్చి మహారణ్యమునకు భార్యా సోదరులతో కేవలధర్మకామివై కాలినడకను నడచి స్వర్గభోగములవీడి పిత్రాజ్ఞచే స్వర్గము నుండి జాఱిపడిన యమరుని బోలియుండి కైకేయిమాట ప్రకారముండి వన్య ఫల మూలికలే తినుచున్న నిన్నుఁజూచి నాకు బాధకలిగినది. ఇప్పుడో సమృద్ధార్థుఁడవయి శత్రువుల జయించి మిత్రగణ బాంధవులతో నుండఁగాఁజూచి నాకు అధికమయిన ప్రీతిగలిగినది. నీవు పడిన సుఖదుఃఖముల నెఱుంగుదును ఋషిజన రక్షణకయి జనస్థానములోచేసిన రాక్షసవధ మొదలుకొని నేటివరకు నీవు చేసిన ఘనమైన సకలపనులన్నిటిని నా తపస్సుచేఁ కనుగొంటిని. ఇదిగో నేనిచ్చు నర్ఘ్యమును గైకొనుము. నీకొక వరముగూడ నిచ్చెద నడుగుము. రేపు అయోధ్యకు వెళ్ళుదువుగాని, అనగా రాముఁడు దానిని శిరసాగ్రహించి అయోధ్యకు పోవునపుడు ఆ కాలములోనే వృక్షములు ఫలించి మధువులు కురియునట్లుగాను ఫలములు అమృత తుల్యముగా నుండునట్లును అనుగ్రహింపుమని రాముఁడుకోరగా నట్లేయని ముని యనుగ్రహింపగా పండ్లులేని చెట్లును పండ్లతో పువ్వులతో ఆకుపచ్చనివయి మూడు యోజనముల దూరము నిండిపోయెను, 777

## —: రాముఁడు హనుమంతుని భరతుదరి కంపుట :—

ఆ యయోధ్యఁ దలచుకొని యపుడు రాముఁ
డిట్లు హనుమంతుతో వచియించె హనుమ!
రాజమందిరంబునఁ గల్గు ప్రజ సుఖంబ
యున్న వారలెగడ కనుగొన్న పిదప 778

శృంగిబేర పురమునకు నేగి యందు
గుహుని నామాటగా నీవగుశల మడుగు
నేను క్షేమంబుగా రోగమేమిలేక
వ్యథయు లేనట్లుగ నెఱింగి హర్షమొందు. 779

ముదము పొందిరి గుహుడుయోధ్యపదవి భరతు
వృత్తి సెలవించు ప్రీతితో నింక నీవు
నాదు మాటగా భరతు క్షేమాదులడుగ
నాదు క్షేమాదులన్ని క్షుణ్ణముగఁ జెప్పు. 780

రావణుఁడు సీత నెత్తుక పోవుటాది
గా దితిజుండు చచ్చుట తుదిగా వచించి
నేనిటకు క్షేమముగా వచ్చు టెల్లఁ దెలిపి
యతని యాకృతి యెటులుండు నరయుమపుడు. 781

ఎల్ల కామాలతో నిండి సమృద్ధమైన
తండ్రితాతల నుండియుఁ దరలి వచ్చు
రాజ్యమెవ్వరి చిత్తమున్ లాగకుండ
రాజ్యసంగాన స్వారాజ్యర క్తి కలుగు. 782

వానికె కనుక రాజ్యాశయైన యెడల
అతఁడె రాజ్యమేలుత మేము నటకురాక
దూరముగ నుండు లోపలఁ దొరగనీవు
వాని మనసు తెల్సికొని రావలయుఁ జుమ్మి 783

వ. అని రాముడాదేశింప హనుమంతుడు మానవ వము దాల్చి గంగా యమునా సంగమ మధ్య ప్రదేశముచేరి గుహునితో సర్వవృత్తాంతము చెప్పి నేడు పంచమి. నేడు రాత్రి భరద్వాజముని యాశ్రమమున నుండిరాఁగా నీవు రాముని చూతువని చెప్పి యతడు సంతోషము పొందగా నటనుండి యెగిరి పరశురామతీర్థమును వాలుకినీ నదిని గోమతీనదిని దాటి భీమమైన సాలవనమును చూచి యట సమృద్ధముగా నున్న వేలకొలది జనపదములను దాటి చాలదూరముమేగ పుష్పలతో నిండియున్న నందిగ్రామ సమీపపుచెట్లను చేరి క్రీడలతేలు స్త్రీపురుషులుగల చైత్రరథతుల్యోపవనములను చొచ్చి అయో

ధ్యకు క్రోసుదూరమున నారబట్టలు లేడి చర్మము దాల్చి చిక్కి దీనుఁడై యాశ్రమమున బురద పూసుకొని జడలు దాల్చి బ్రహ్మర్షివలె తేజస్వియైపండ్లు దుంపలు తినుచున్నవాడై అమాత్యులు శుచులు కాషాయాంబరధారులగు పురోహితులు కూడి యుండ పాదుకలు ముందుంచుకొని రాజ్యము పాలించు భరతుని దరికేగి దోసిలొగ్గి హనుమ యిట్లనెను నారబట్టలు, జడలు ధరించి దండకారణ్యమందున్నయె వీనికై నీవిట్లు అనుశోచించుచుంటివో యాకాకుత్స్థుడు నీక్షేమమడిగెను ఇదిగో నీకిపుడె ప్రియమువార్త చెప్పెదను దాని విని నీవు ఈ దారుణశోకమును వీడెదవు ఈ నిమిషములో నింక మీ అన్నతోఁ గలిసి కొందువు

అతడు సీతను అపహరించిన రావణునిజంపి మహాబలులగు మిత్రులతో సమృద్ధార్థుడయి సీతాలక్ష్మణులతో వచ్చుచున్నాడు అని ఇట్లు చెప్పగానే వెను వెంటనే భరతుడు సంతోషమున పుట్టొంగి యానందమున మోహమొందెను. పిదప త్రుటిలోలేచి యూరడిల్లి హనుమంతుని కౌగలించుకొని యానందబాష్పములతో హనుమశరీరమును తడిపి యిట్లనెను, ఇంతటి సంతోషవార్త తెచ్చిన నీవు దేవుడవా, మానవుడవా, నీవిట్టి ప్రియము చెప్పినందుకు నీకు వందల వేలు గోవులు, నూఱు గ్రామములు చక్కనైన కుండలములు దాల్చి బంగారు భూషణములుగల ఉత్తమ కులజలయిన భార్యలను ఇచ్చెదను. అనిచెప్పి హనుమంతునివలన అన్న రాముని రాకను విన్నందులకెంతయో సంతోషించి ఎపుడు రాముని చూచునాయని మదిలో ఆనందముతో నిట్లనెను,

మాయన్న వనమునకేగి యెన్ని యేండ్లయినదో, ఇన్నేండ్లకు నా ప్రభువు వృత్తాంతమును చెప్పగా వింటిని, ఈ కళ్యాణగాథ అలౌకికమై నాకు తోచుచున్నది, బ్రదికియున్నచో నూఱేండ్లకయినను ఆనందము కలుగును, రామునికి వానరులకు సమాగమ మెట్లయినది? ఎందుకయినది? ఎక్కడ నయినది? అది అంతయు సరిగాఁ జెప్పుము, అని అడుగ హనుమంతుడు భరతుని దర్భాసనముపైని కూర్చుండబెట్టి, రాముని వృత్తాంతమంతయు వివరముగా చెప్పెను, తల్లి వరములడిగి ఎట్లు అడవికి వెళ్ళెను, ఎట్లు సుతుని శోకముచేత దశరథుడు మరణించెనో దూతలు దూరమునుండి నిన్ను ఎట్లు

విమానముపై కిష్కింధకువచ్చుట గంగనుసమీపించి మునిసన్నిధిని ఉండుట యనునవన్నియుజెప్పి, హనుమంతుడు, రాముడు రేపుపుష్యయోగమున నిన్ను జూడఁగలడు. అని హనుమంతుడు చెప్పగా విని దోసిలొగ్గి హర్షముపొంది నేటికి నాకోరిక తీరినది. అని భరతుడు సంతోషముతోకూడిన యీవాక్కును పలికెను. 786

పరమానందము గూర్చునట్టి వచనంబాలించి శత్రుఘ్నుకై
భరతుం డీ గతినంత నానతిడె సర్వంబైన దైవంబులన్
పుర చైత్యంబుల గంధమాల్యములతో బూర్ణంబవాద్యాలతో
పురమం దెల్ల జనంబు సర్వగతులన్ బూజింత్రు గాతన్నతిన్

స్తుతి పౌరాణికము గాథలన్దెలియు వల్సూతాళి వైతాళికుల్
తత వాద్యంబుల జాణలౌ గణికలున్ తండోపతండాలుగా
ప్రతిమార్గంబునఁ జక్కఁదీరి శశితుల్యంబైన యారాము సు
వ్రత వక్త్రంబును జూడఁగన్ నగరిలో బైల్దేరి ముందేగుతన్

వ. అనంతరము భరతుని వలుకులు విని పరవీరహంతయగు శత్రుఘ్నుడు స్వచ్ఛంద కర్మకారులను వలువేల మందినిట్లు ప్రోత్సాహపఱచెను. నందిగ్రామమునుండి యయోధ్య వఱకుఁ గల మెరక పల్లములను సరిచేయుదురుగాక. భూమి నంతయు మంచువలెఁ జల్లనగు నీళ్ళు చల్లుదురుగాక. అంతటఁ బూలు పేలాలు చల్లుదురుగాక. సూర్యోదయము మొదల్కొని పురమందంతట వీధులలో జెండాలు భవనములను శోభిల్లఁ జేయుదురుగాక. వందలకొలది మనుష్యులు బయలుదేఱి ముత్యాలతో పూవులు రంగురంగుల సుగంధచూర్ణములతో చల్లుదురుగాక అని యానతిచ్చెను. పిదప మరునాడు రాజభార్యలు అమాత్యులు, సేవకులు బ్రాహ్మణులు, క్షత్రియులు బార్లు తీఱి ముందేగిరి. ధృష్టి జయింతుడు విజయుఁడు సిద్ధార్థుఁడు అర్థసాధకుఁడు అశో

కుఁడు మంత్రపాలుడు సుమంత్రుడును బయలుదేఱిరి. మఱి కొందఱు బంగారు భూషణంబులు గల వేలకొలది మదపుటేనుగులతోడను. ఆడ యేనుగులతోడను గుఱ్ఱంబులు పూన్చిన రథంబులతోడను బయలు వెడలిరి. శక్తిఋష్టిప్రాస ములు జెండాలు ధరించిన యశ్వారోహకులు పదాతులు వేలకొలది బయలు దేఱిరి. అటు పిమ్మట వాహనము లెక్కి దశరథపత్నులుకౌశల్యనుముందుంచు కొని కైకేయితోడ నందిగ్రామమునకు వచ్చిరి. ఒకరేమిటి నగరమంతయు నందిగ్రామము చేరిరి. 787

గుఱ్ఱాల డెక్కల కోలాహలముతోడ
రథముల చక్రాల రవముతోడ
శంఖదుందుభుల ఘోషంబు తోడను
దద్దరిల్లెడు సర్వ ధరణితోడ
బార్లు తీఱిన విప్రవహరంబుతోడను
శ్రేణి ప్రముఖ వణిక్శ్రేణితోడ
మాలలు నుంగ్రాళ్ళు కేలఁ బూనిన వసి
ష్ఠాది మంత్రులతోడ జనులతోడ

కూడి భరతుండు ధార్మికకోవిదుండు
స్వశిరసున నన్న రాముని పాదుకలను
తెల్లనౌ మాలికలును దెల్ల గొడుగు
పసిడి వింజామరలు దాల్చి త్వరగ నడిచె. 788

ఉపవాసాలఁ గృశించి దీనుఁడయి యేదో చీర కృష్ణాజినం
బుపయిందాలిచి యున్నరాకవిని యా మోదంబుతోఁ బౌర మం
త్రి పురోధల్ వెనువెంట రాఁగ భరతుండీ యంజనా పుత్ర మో
మపు డీక్షించి యిటుల్ వచించెఁదనకా యున్న కన్పింపమిన్. 789

కపి చాపల్యముచేత నీవిటుల వక్కాణింపలేదే కదా
యిపుడా యన్నను రాము రాఘవుని నేనెందున్గనన్ జాలనా
కపు లైనన్ వర కామరూపధరులున్ గన్పింప కున్నారె నీ
కపి చాపల్యము సాజమౌట నిటు వక్కాణించి నా వేమొకో

వ. అని యిట్లు భరతుఁ డడుగ సత్య విక్రముడగు భరతునితో హను మంతు డిట్లనియె, భరద్వాజుడు అనుగ్రహించి వరమిచ్చుటచే మార్గమందలి చెట్లు పూలపండ్లతో తుమ్మెదలతో నిండిపోయి ఉన్నవి. ఆమునీముని సకల సైన్యమునకుఁ గూడ ఆతిథ్య మొసంగెను. అందుకు సంతసించి వానరులు ఘోషములుచేయుచు గోమతీనదిని దాటుచుందురనుకొందును. అదిగో దూర మున ధూళితో సాలవనము నిండియున్నది. చంద్రమండలము వంటి పుష్పక విమానమదిగోఁ గనిపించుచున్నది. రావణుని సబాంధముగాఁ జంపియున్న వచ్చుచున్నాడు. ఈ పుష్పక విమానము కుబేరునిది. దీని నిదివరలో రావ ణుఁడు హరించెను. సీతతో గూడి రామలక్ష్మణులు సుగ్రీవ విభీషణులు వెంటరా నిదే వచ్చుచున్నారు. జనులు రథాదివాహనములనుండి దిగి విమానమందున్న రాముని చూచుచున్నారు. అని హనుమంతుడు చెప్పగా భరతుఁడు ఉప్పొంగి పోయి దోసిలి వట్టుకొని విమానమున నింద్రునివలె నున్న రామునికి స్వాగతమిచ్చి అన్నకు ప్రణమిల్లెను. అపుడు రాముని అనుజ్ఞచే విమానము క్రిందకు దిగెను. అపుడు తనకాళ్ళ మీద పడిన భరతుని రాముఁడు లేవఁదీసి చిరకాలమునకుఁ గనిపించిన భరతుని గాఢముగాఁ గౌగలించుకొనెను. పిదప భరతుడు తనకు నమస్కరించిన లక్ష్మణుని సమీపించి కౌగలించుకొని తనపేరు చెప్పుచు సీతకు నమస్కరించి సుగ్రీవుని విభీషణుని జాంబవంతుని అంగదుని మైంద ద్వివిద నీల ఋషభ సుషేణనల గవాక్ష గంధమాదన శరభపనసులను భరతుడు కౌగిలించుకొనెను. వానరులు నరరూపములు ధరించి భరతుని క్షేమ మడిగిరి. అపుడు భరతుఁడు సుగ్రీవునిగౌగలించుకొని నీవుమానల్గురుసోదరులకు

అయినను సోదరుడను. అని యుపకారముల మెచ్చుకొని విభీషణుని సాంత్వ వాక్యములతో మన్నించిమా యదృష్టవశముచే నీసాయముచేమిక్కిలిదుష్కర్మ జరిగినది అనెను. పిదప శత్రుఘ్నుడును సీతాలక్ష్మణుల పాదములకునమస్క రించెను. అంత రాముడు శోకముచే చిక్కి చింతతోనున్న తల్లి పాదములపైఁ బడి సుమిత్రకు యశస్విని యగు కైకకును ఇతర మాతలకు నమస్కరించి పురోహితుడగు వసిష్ఠునికి నమస్కరించెను. పిదప పౌరులందరు స్వాగత మిచ్చి పట్టిన అంజలులు ముకులించిన తామరమొగ్గలవలె ప్రకాశించినవి. పిదప భరతుడు పాదుకలను దెచ్చి రాముని పాదములకు తొడిగి అన్నా రాజా! ఇదిగో నీరాజ్యమును రక్షించి నీరాజ్యము నీకు అర్పించుచున్నాను. అయోధ్యకు రాజవై యిప్పుడువచ్చిన నిన్నుఁజూడగా ఇపుడు నాజన్మధన్యమైనది. నాకోరిక తీరినది. నీవు కోశాగారమును బలమును జూడుము ఇదివరకు కంటె పదిరెట్లుగా నీతేజస్సుచే చేసితిని. ఇట్లు పలుకుచున్న భ్రాతృవత్సలుడైన భరతుని జూచి వానరులు విభీషణుడును ఆనంద బాష్పములను విడిచిరి. పిదప సంతోషముతో రాముఁడు భరతుని తన యొడిలోఁ గూర్చుండఁ బెట్టుకొని విమానముతోపాటు సైన్యము రాగా భరతుని యాశ్రమమునకు వెళ్ళి దిగి ఇంక "నీవు కుబేరుని పొందుము. నీకు అనుజ్ఞయిచ్చుచున్నాను. అని విమానమును వేడ్కొలుప అదియును ఉత్తరదిక్కుగా కుబేరుని యాలయమునకు వెళ్ళెను.

పిదప ఇంద్రుడు బృహస్పతి పాదములపైవలె తన గురువు పాదములపైఁబడి గురువుతోపాటు రాముడు వేఱయిన యాసనమునఁ గూర్చుండెను.

పిదప కైకేయికి ఆనందమునువర్ధిల్లఁజేయు భరతుడు శిరస్సున అంజలి పట్టి సత్యమె పరాక్రమముగాగల యన్నతోనిట్లనియె. నీచేనాతల్లి పూజింపబడి నది. ఈ రాజ్యము నాకిమ్యఁబడినది. నీవు నాకెట్లు ఇచ్చితివో యట్లే మరల నీకిచ్చుచున్నాను. ఒంటరిది, బలీయమైనదియైన వృషభముచేత మోయబడిన

బరువును చిన్నగున్నవలె నేనీరాజ్యమును మోయనుత్సహింపను. గొప్ప జల ప్రవాహముచే తెగగొట్టబడి జారిపోవు జలసేతువువలె బంధింపరాని యీ రాజ్యమనెడి గండిని తగు ప్రయత్నముచే పూడ్చనిచో గట్టఁబడదు. 191

తనయింటన్ మొలవేయఁగాఁ బెరిగిపెద్ద ద్రుమానుతోఁ గొమ్మ కొ
మ్మను పూల్‌పూచియు పండ్లతో ననుభవింపన్ రాకయేయున్నచో
మనమద్దానిని పెంచియేమిటి ఫలంబౌ నట్లె జన్మించి నీ
వును మాతోఁ గడువృద్ధిపొందితి, జగంబున్ బ్రోవరా వేమయా. 921

ఇపుడే నీయభిషేకమున్ జనములెంతేఁ బొంగి మధ్యాహ్నమం
దపు రూపంబగు తేజుతోవెలుగు నాయాదిత్యునిం బోలె స
ర్వపు లోకంబునుజూచుఁ గావుతను తూర్యాలన్ సుగీతధ్వనిన్
విపులంబౌపలు కాంచిభూషల ధ్వనిన్ వేమేలుకొమ్మీ భువిన్. 193

వ. ఎంతవఱకు జోతిశ్చక్రము తిరుగునో ఎంతవరకు వసుంధర యుండునో అంతవఱకు నీవె సర్వమునకు స్వామివి. అనిపలుక భరతుని మాటలను విని పరపురంజయుఁడయిన రాముడు అట్లేయని ప్రతిగ్రహించి శుభాసనమున గూర్చుండెను. పిదప శత్రుఘ్నుని మాటనుబట్టి కేశాలంకరణ నిపుణులును సుఖహస్తులగు నునువారుత్వరగా రాఘవులనిద్దఱను సేవించిరి. మొదట భరతుఁడును లక్ష్మణుడును స్నానముచేయుగా వానరేంద్రుడగు సుగ్రీవుడును రాక్షసరాజు విభీషణుడును స్నానముచేయుఁగా రాముఁడు జడలను విడదీయించి చిత్రమాల్యములు అనులేపనములుగలిగి విలువగల వస్త్రములుధరించి శ్రీలతో రాజిల్లెను. 194

ఇక్ష్వాకు కులవృద్ధినెంచు శత్రుఘ్నుడు
రామలక్ష్మణులకుఁ బ్రతిదికూర్చె

దశరథ స్త్రీలెల్లఁదగ సీతకు బ్రతిది
స్వయముగాఁ జేసిరి చక్కగాను

కౌసల్య తుష్టయై కపిపత్నులకునెల్ల
శోభనకర్మలఁ జూచిచేసె

శత్రుఘ్నుమాటచే సరిగ సుమంత్రుఁడు
ప్రత్యంగ సుందర రథముపూన్చె

సూర్యమండలమటు చక్క శోభగనిన
దివ్యమగు నుత్తమరథంబుఁ దేఱిచూచి
సత్యమె వ్రతముగాగ నిత్యమెసగు
రాముఁ డాజానుబాహువు ప్రథితుఁడెక్కె. 795

సురపతి సమరుచుల్ సుగ్రీవ మారుతుల్
స్నాతులై కుండలాల్‌జాఱఁ జనిరి

భూషలు కుండలాల్ పొలుపీన సుగ్రీవ
సతులు సీత పురిగాంచఁగఁ జనిరి

దశరథు మంత్రులు తగు పురోహితు ముందు
నుంచి చక్కఁగను మంత్రించి రవల

విజయుఁ డశోకుఁడు విదిత సుమంత్రాదు
లెంచిరి పుర రామవృద్ధికొఱకు

జయము పొందగఁదగు పూజ్య సత్యవాక్కు
రామునభిషేకమునకు కళ్యాణమునకును
ఎయ్యదెయ్యది యిక నాచరింపవలెనొ
అదియొనర్పుడని యమాత్యులరిగి రంత. 796

హరిత వర్ణయుతమౌ నరదంబుపై నెక్కి
యింద్రుడఖిల రాముఁ డేగఁ బురికి

భరతుండు పగ్గాలుపట్టెఁ శత్రుఘ్నుడు
గొడుగూనె లక్ష్మణుడడరి విసరె

చంద్రుఁబోలు నికొక్క చామరము నసుర
పతి విభీషణుడును పట్టివీచె

ఋషిగణంబులు దేవులెల్లరు మింటను
రాము మెచ్చఁగ శ్రావ్యరవము వెడలె

పిదప శత్రుంజయంబను ద్విపవరంబు
వానరపతి సుగ్రీవుడు త్వరగనెక్కె
కపులు మర్త్యరూపూనియుఁ గిరులనెక్క
అరిగె పురికి రాముఁడు సుతూర్యములు మ్రోయ. 797

వ. అనంతరము రథమునఁ బ్రకాశించు సతిరథుడయిన రాముని జనులు చూచిరి. సోదరులతోఁగూడిన రాముని అభినందించి, సుమిత్ర మొదలయిన వారు రామాభిషేకమునుగూర్చి యాలోచించిరి. అమాత్యులతో బ్రాహ్మణులతో ప్రకృతులతోఁగూడిన రాముఁడు నక్షత్రములతో చంద్రునివలె విరాజిల్లెను. తాళము స్వస్తికము మొదలగు వాద్యవిశేషములు మంగళధ్వనులు రామునిముందు మ్రోగుచుండెను. 798.

ద్విజులు అక్షతలు, బంగారము, గోవులను, మోదకములను గ్రహించి ముందుగావెళ్ళిరి. రామునికి సుగ్రీవునితో స్నేహము, హనుమంతుని ప్రభావము, వానరులుచేసిన ఘనకార్యములు, రాక్షసబలము, విభీషణుని సమాగమమును, రాముడు మంత్రులకుఁ జెప్పెను. అదివిని అయోధ్యావాసులు ఆశ్చర్యపడిరి. వానరులతోఁగూడిన రాముఁడు ఇట్లు ప్రజలకుఁ జెప్పుచు హృష్టపుష్టజను

లతోనిండిన నయోధ్యను ప్రవేశించెను. అప్పుడు రాముని అభ్యుదయము కొరకు పౌరులు ఇంటింట నెత్తయిన జెండాలుకట్టిరి. పిదప రాముడు ఇక్ష్వాకు లెల్లరు అధిష్ఠించిన తండ్రిభవనముచేరి తల్లి కౌసల్యకు సుమిత్రకు కైకేయికి నమస్కరించి ధార్మిక శ్రేష్ఠుడయిన భరతునితో నిట్లుచెప్పెను. ఉద్యానవన ములతోఁగూడిన ముక్త వైడూర్యములుదాపిన నా భవనమును సుగ్రీవునికిఁ జూపుము అని. అదివిని భరతుడు సుగ్రీవుని చేయిపట్టుకొని ఆ యింటిని ప్రవే శపెట్టెను. అంత పరిచారికలు శత్రుఘ్నునిచే ప్రేరింపఁబడి ప్రదీపములను, పర్యంకాస్తరణములను గ్రహించి ప్రవేశించిరి. అపుడు రామానుజుఁడు ఇట్లు ఓ ప్రభూ! రామాభిషేకమునకు దూతను ఆజ్ఞాపింపుమని సుగ్రీవునితో అనెను. అపుడు సుగ్రీవుడు నలుగురు వానరముఖ్యులను సర్వరత్న భూషితములగు నాలుగు బంగారు బిందెలనుతెచ్చి వానియందు నాలుగు సముద్రములనుండి తెచ్చిన నీరునింపి తెల్లవారుజాముననే కనిపెట్టుకొని యుండమని ఆజ్ఞాపింపగా ఆ మహాబలులు వానరముఖ్యులగు జాంబవంతుడు, హనుమంతుడు, వేగదర్శి ఋషభులు ఆకాశమునకెగిరి జలపూర్ణకలశంబులను దెచ్చిరి. మఱియు ఐదు వందల నదులనుండి నీరుతెచ్చి బిందెలునింపిరి. అందు సత్త్వయుక్తుడయిన సుషేణుడు తూర్పుసముద్రమునుండి సర్వరత్నపూర్ణమైన కలశంబులు నీర నింపి తెచ్చెను. ఋషభుడు దక్షిణసముద్రమునుండి రక్తచందన శాఖలతో గూడిన కాంచనఘటమునింపి తెచ్చెను. గవయుఁడు పడమట సముద్రము నుండియు, నలుడు ఉత్తరసముద్రమునుండి రత్నకుంభమునజలము తెచ్చెను. అట్లుతెచ్చిన ఆ నీటిని పురోహితునికి శత్రుఘ్నుడు నివేదింపగా పిదప ప్రయ తుడును వృద్ధుడునగు వసిష్ఠుడు బ్రాహ్మణులతో రాముని రత్నాసనమున కూర్చుండఁబెట్టెను.

పిదప వసిష్ఠుడు వామదేవుడు జాబాలి కాశ్యపుడు కాత్యాయనుఁడు సుయజ్ఞుఁడు గౌతముఁడు విజయుఁడు అను పురోహితులు పసుపులు దేవేం

ద్రునివలె ప్రసన్న సువాసనలు వెదజల్లు నీటిచే నరవ్యాఘ్రుఁ డయిన రాముని అభిషేకించిరి. ముందుగా ఋత్విక్కులు బ్రాహ్మణులు పిదప కన్యలు మంత్రులు యోధులు వణిక్ప్రముఖులు ఉప్పొంగి సంతోషముతో ఆకాశమం గుండు లోకపాలురు కలిసి సర్వదేవతలను అభిషేకించిరి.

ఆ రామునికి శత్రుఘ్నుడు తెల్లని గొడుగు పట్టెను. సుగ్రీవుడు ఒక తెల్లచామరమును చంద్రుని వంటి ఋంకొక చామరమును విభీషణుడును వేసెను. ఇంద్రుడు ప్రేరేపింపవాయుదేవుడు నూఱుపద్మములుగలిసిమెఱయు చున్న బంగారు మాలను సర్వరత్నములతోఁ గూడిన మణిరత్నభూషితమైన ముత్యాలహారమును రామునికిచ్చెను. దేవతలు పాడిరి. అప్సరసలు ఆడిరి. భూ ము పీదికెను. చెట్లు పండ్లిచ్చెను. పువ్వులు గంధములు చల్లెను.

అపుడు రాముఁడు ద్విజులకు నూఱువేల గుఱ్ఱములను ఆవులను ధేనువు లను నూఱు ఎద్దులను దానమిచ్చెను. మఱి ముప్పదికోట్ల బంగారు నాణెము లను నానాభరణములను వెలగల వస్త్రములను బ్రాహ్మణులకు ఇచ్చెను. 799

సుగ్రీవుకు రవి రశ్మిఁలబోలి కెంపుల
హేమ భూషితమాల రాముడొసగ

వైఢూర్య మణిచిత్రవజ్ర విభూషమౌ
నంగదముల నిడ నంగదునికి

మనివరజుష్టమై మహితమౌ హారంబు
శీతాంశురుచులీన సీతకీయ

శుభ్రవస్త్రాలను శోభిల్లు భూషలు
నరయుచు జానకి హనుమకిచ్చి

మఱియుఁ బ్రియుని మాటికిమాటి కరయుచుండి
కపులఁగనుచు జానకి తనగళమునుండి
హారమునుదీయు నింగితాలన్ని తెలియు
రాముడో సీతఁజూచి యీలాగుపలికె. 800

ఓ సుభగురాలు! జానకి! యుల్లమందు
ఎవనిగూర్చి సంతుష్టవై యొసగినానొ
ఎవనిలో బుద్ధివిక్రమ మెసగియుండె
నట్టి వాయుపుత్రునకు నాహనుమకిమ్ము. 801

వ. అని రాముడుపలుక విని అసితేక్షణయగు సీత ఆ హారమును హనుమంతునకిచ్చెను. అంత చంద్రాంశుగౌరమైన హారముచేత తెల్లనిమబ్బుచేత పర్వతమువలె నాహనుమంతుడు శోభిల్లెను. పిదప ద్వివిదమైందులకు నీలునికి సర్వ కామగుణములనుజూచి ఇచ్చెను. పిదప వానరవృద్ధునకు వానరేశ్వరులకును వస్త్రములు, భూషణములిచ్చి గౌరవించెను. అంత విభీషణుడు సుగ్రీవుఁడు, హనుమంతుడు, జాంబవంతుఁడు సర్వవానర ప్రముఖులును ఎవరిని కష్టపెట్టని రామునిచేఁ దగునట్లు గౌరవింపబడినవారయి రాముఁడిచ్చిన సర్వకామములచేతను, పుష్కల రత్నములచేతను తమ మనస్సులు సంతుష్టి హొంద మహాత్ముడయిన రామునికి నమస్కరించి వారు వచ్చినట్లు అందఱును వీడ్కొని, రామునిచేత వీడ్కొలియ్యబడి కిష్కింధకు వెడలిపోయిరి.

సుగ్రీవుఁడు రామాభిషేకమునుజూచి కిష్కింధకేగెను. కులధనముహొంది విభీషణుఁడు లంకకేగెను. అతడు రాజ్యమంతయు హొంది మహాయశుడయి హతశత్రువయి శాసించెను. రాముడును పరమోదారుడయి రాజ్యము శాసించుచు ధర్మజ్ఞుడు, ధర్మవత్సలుడయిన లక్ష్మణునిజూచి యిట్లనెను. ధర్మజ్ఞ! నాతోగూడ పూర్వరాజులు అధిష్ఠించిన యీభూమిని పొందుము. నాతోగూడ

తండ్రితాతలు ధరించిన రాజ్యమందు యువరాజువయి రాజ్యభారము వహింపుము అని. అంత లక్ష్మణుడు ఎంతగా నియమముతో చెప్పినను ఏమాత్రము అంగీకరింపక పోవుటచే మహాత్ముడయిన రాముడు యౌవరాజ్యమందు భరతుని నియోగించెను. 802

పౌండరీకాశ్వమేధాలు వాజపేయ
మితర యజ్ఞములనుజేసి పృథ్వీధవుడు
రాజ్యము పదివేలేండ్లేలి, ప్రథితహాయస
దక్షిణలతో శతాశ్వమేధాలుచేసె. 803

ఇంతులు విధవలై యేడ్వరెపుడుఁ గాని
పాములచే నెందు భయమేలేదు
రోగాలపల్లను రోదింప రెవ్వరు
చోరులెలేనిదై మీఱె జగము
ఏయనర్థము పోకదెవరి కెచ్చోటను
బాలల పితృకర్మ గాల దెచట
వేలేండ్లు జీవింత్రు వేల పుత్రులఁ గాంత్రు
శోకాలు రోగాలు చూడరెటను

అఖిల లోకమానంద మయంబె యయ్యె
ప్రజలు సర్వులు గూడను ధర్మపరులె
రాముఁ గని చంపుకొనరు పరస్పరంబు
ఎందుఁగాని రాజ్యము రాముఁ డేలుచుండ. 804

రాముఁడు భువి నేలెడుతఱి
రాముఁడు రాముఁడు నిఖిలము రాముఁడె యనుచున్
రాము డఖిల జనకథలను
రామమయమె యయ్యెను నిఖిలంబగు జగతిన్. 805

సతతము పూవులు విచ్చును
సతతము తరులు పండ్లతోడ శాఖల నింపున్
సతతము గాలియు సుఖమౌ
సతతమ్ము సకాలముననె జలదము కురియున్ 806

తమతమ కర్మంబుల ని
త్యము సంతుష్టులగుచు నాదరమున ని
త్యమొనర్తు విప్రబాహుజ
లు మఱియు వైశ్యులును శూద్రులు నలోభులయి. 807

అందఱు ప్రజధర్మరతులు
అందఱు సల్లక్షణయుతులయి యుండురుగా
అందఱు ధర్మపరాయణు
లెందును రాముండు రాజ్యమేలుచునుండన్. 808

పదివేలేండ్లును మఱియును
పదినూఱేండ్లు భువిని తన భ్రాతలతోడన్
పద పడి శ్రీమంతుడు రా
మ ధరాపతి సర్వరాజ్యమది యేలించెన్. 809

ముని వాల్మీకిచే రచిత మ
యిన యార్షము నాది కావ్యమిది ధన్యంబౌ
ఘన కీర్తిం గూర్చు రాజుల
కును విజయంబు భువిని గూర్చును మిగులన్. 810

ఎవడీ రామాయణముం జ
దువునో వినునో యానరుండు దుష్కృతమున నుం
డి విడిపడును, సుత రాముం
డౌ వఱలు సుతులను ధనము గను ధనేచ్ఛుండున్. 811

రామాభిషేక వృత్తము
నేమనుజుఁడు లోకమందు నిటులన్ వినునో
ఆ మనుజుడు నృపుఁడగునెడ
నీమహి జయమొందు రిపులనెల్ల నణంచున్. 812

రామునిచేఁ గౌసల్యయు
అమాత సుమిత్ర లక్ష్మణాత్మజు చేతన్
ఆ మాతకైక భరతుని
చే మాదిరి స్త్రీలవుదురు జీవిత పుత్రిల్. 813

ముని వాల్మీకిచే రచిత మ
యిన యార్షముము నాదికావ్య మెవ్వడు విను నా
మనుజుడు శ్రద్ధాళుండై
తనకోపము గెలిచి కష్టతతులను దాటున్. 814

విన(ప్రవాసము తుదనెనసి బంధు సమాగ
మంబుల సర్వకామముల పొందు
విన సంతసెలి సురల్ ప్రీతిని గాంతురు
స్వగృహాల గ్రహములు శాంతిపొందు
ప్రభువులును జయింతు, పరదేశమేగెడు
వారలు నిత్యము స్వస్తిగాంత్రు
విని పుష్పవతులై వనితలు నుత్తమ
తనయులనెప్పుడు గనుచునుంద్రు.

ఎలమి నీపురాతనేతిహాస పఠన
నర్చచేయువార లఖిలమైన
పాపతతులనుండి త్వరగ విముక్తులై
దీర్ఘమాయు వొంది దీప్తిగాంత్రు. 815

నిరతము శిరసా మ్రొక్కుచు
సరసత ద్విజుముఖమునుండి క్షత్రియ వైశ్యుల్
ఇరవుగ శూద్రులు వినదగు
నరయుదురు సుతులముఖములు నైశ్వర్యములున్. 816

రామాయణమిది సర్వము
వేమారులువిని చదివెడివిజ్ఞుల సతమున్.
రాముఁడు విష్ణు సనాతన
ధీమతి, నారాయణాదిదేవుడు మెచ్చున్ 817

ఈ మహాకావ్యము శుభంబు నెవఁడు వినునొ
అతఁడు స్వకుటుంబవృద్ధి ధనాదివృద్ధి
ధాన్యవృద్ధిని నుత్తమదార సుతుల
నుత్తమసుఖంబు సర్వార్ధ మూర్విఁబొందు 818

చిర మాయువు నారోగ్యము
సరసయశసు బుద్ధిసుఖము సౌభ్రాతృతయున్
వరతేజిడు నీకావ్యము
నిరతము వృద్ధిపరులు కడునియతిని వినవొ. 8[illegible]

ఇదియును నెపుడో జరిగిన
యది యాఖ్యానమ్ము, మీకు నగుత శుభంబుల్
ముదమున స్వేచ్ఛగఁ బలుకుఁడు
పదడి విష్ణునిబలంబు వర్ధిలుఁగాతన్ 820

ఈ రామాయణ కావ్యము
నేరిమి గ్రహించినయెడ, నియుతిని వినినన్
కూరిమి సమస్తదేవులు
ధారుణిఁ బితరులును తుష్టి దర్పయుఁ గాంతుర్ 821

పరమఋషి రచించిన శ్రీ
రాముని సంహిత యిదికడుభక్తిని నే
నరుడు లిఖించునో తగనా
నరుడు త్రివిష్టపమునందు నయుతవసించున్ 822

శ్రీ శ్రీ శ్రీ

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

శ్రీరామచంద్రః శ్రితపారిజాతః
సమస్తకళ్యాణ గుణాభిరామః
సీతా ముఖాంభోరుహ చంచరీకః
నిరంతరం మంగళమాతనోతు.

ఇది

శ్రీ నారాయణశాస్త్రి జనక గురు దయా ప్రాప్త విద్యుఁడును వెంకమాంబా
పుత్త్రుఁడు నగు చర్ల గణపతిశాస్త్రిచే సరసముగ అనువదింపఁ బడిన
శ్రీ వాల్మీకి రచితమైన గణపతి రామాయణసుధ యందు
యుద్ధకాండము ఉత్తరభాగము సమాప్తము.

# ఉత్తరకాండ

వ. శ్రీ రాముఁడు రాక్షసులను వధించిన పిదప రాజ్యమును పొంది రాజ్యమేలుచుండగా తూర్పుదిక్కునుండి కౌశికుఁడు యవక్రీతుడు గార్గ్యుఁడు గాలవుఁడు కణ్వుఁడు మేధాతిథి పుత్రుడు మొదలగు మునులును దక్షిణ దిక్కునుండి ఆత్రేయుడు నముచి ప్రముచి అగస్త్యుఁడు అత్రి సుముఖుఁడు అను ఋషులును పడమట దిక్కునుండి వృషద్గువు కనషుడు ధౌమ్యుడు రౌద్రేయుడు వారి శిష్యులును ఉత్తర దిక్కునుండి వసిష్ఠుడు కశ్యపుడు అత్రి విశ్వామిత్రుడు గౌతముఁడు జమదగ్ని భరద్వాజుడు అను సప్త ఋషులును అక్కడి జనములును రాముని నివాసమునకువచ్చి ద్వారపాలునికి తమ రాకను రామునికి దెలుప బంపిరి. అంత రాముడు ప్రాంజలియై వచ్చి వారిని ప్రవేశపెట్టి పాద్యములచే అర్ఘ్యములచే వారిని సత్కరించి దర్భాసనములఁ బఱపించి అందువారు గూర్చుండ తానును గూర్చుండెను. కుశల ప్రశ్నలయిన తరువాత రాముడు రావణుని కుంభకర్ణాదులను జంపి లోకములకు క్షేమము కలిగించి నందుకును సర్వ భూతముల కవధ్యుడగు నింద్ర జిత్తును చంపినందుకును ప్రశంసించిరి. అపుడు రాముడిటు అగస్త్యుని ప్రశ్నించెను.

మీరందఱు ఇంద్రజిత్తును ఇంతగా పొగడుటకు కారణమేమి? అతడెటు వంటివాడు. ఇందులో రహస్యమేమియు లేనిచో అది నేను వినఁదగినచో తెలుపుఁడని రాముఁడు అడుగఁగా మహా తేజుడగు నగస్త్యుఁడిట్లు చెప్పెను.

---

తిక్కన్న పాపరాజు మొదలైన వారు దీనిని తెనిగించిరి. ఆధునికులు కూడ పద్య గద్యములలో వ్రాసిరి. ఈ రామాయణ సుధలో సీతారాముల చరిత్రకు ప్రాధాన్యమును తగ్గింపకుండ సంగ్రహముగ చాలవరకు గద్యముగానే నేను వ్రాసితిని. ఇందు రస ప్రాచుర్యమును బట్టి సీతారాముల విహారము నుండి కొంత పద్యభాగముగా వ్రాసితిని.

రామా! యిపుడు రావణుని కులమును వర దానమును చెప్పెద వినుము. పూర్వము కృత యుగమున పులస్త్యు డను బ్రహ్మర్షి యుండెను. అతడు ధర్మమును శీలమును బట్టి ప్రజాపతి పుత్రుడని చెప్పుటకుఁ దగి యుండెను. అతఁడు దేవుల కిష్టుడు. సర్వ గుణములు గలవాడును. అతఁడు తృణ బిందుని యాశ్రమమునకు వెళ్ళి మునిపుంగవుడై స్వాధ్యాయ నిరతుడై తపస్సు చేయుగా అట దేవ నాగకన్యలు రాజర్షి కన్నెలును అక్కడకు వచ్చి యతని తపస్సునకు విఘ్నము కలిగింప సాగిరి. అపుడు ఆ పులస్త్యుడు కోపించి నన్ను చూడవచ్చిన స్త్రీ గర్భము దాల్చును అని శపించి పలికెను. అది విని అందరును ఇంక ఆ ప్రదేశమునకు రాక వెడలిపోయిరి తృణ బిందుని కుమార్తె మాత్రము ఆ మాట వినక పోవుటచే ఆ శ్రమమున కునిర్భయురాలై - తన సఖి ఒకతె అక్కడకు వచ్చి కనిపింపక పోవుటచే ఆమెకై వెదకుచు తిరిగెను. అక్కడ తపస్సు చేయుచున్న ప్రజాపతి నోటినుండి వెలువడు వేదమును విని ఆ తపోనిధిని చూచి తెల్లబడిన శరీరము గలిగి గర్భ చిహ్నములు గలదయ్యెను. అపుడు తన స్థితిని చూచి విచారము గలదై యిది యేమి యిట్లు అయితినని, తనదండ్రి ఆశ్రమమునకు వెడలి, ఇది నాకేమి తెలియదు సఖురాలిని వెదకుటకు పులస్త్యాశ్రమమునకు వెళ్ళితి ననెను తండ్రి అపుడు దివ్య జ్ఞానముచే సత్యము తెలిసికొని పులస్త్యునిదరికివెళ్ళి యిట్లనెను. ఓ భగవానుడా! స్వగుణములచే భూషితురాలగునా యీ కుమార్తెను భిక్షగా గ్రహింపుము. నీకు ఈమె సేవ చేయును అని చెప్పి తృణ బిందువు వెడలి తన ఆశ్రమమునకు వెళ్ళెను. అపుడా పులస్త్యుడు ఆమె గుణ శీల ములకు మెచ్చి పుత్రుని నొసగెను.

ఆ పుత్రుడే పౌలస్త్యుడు. అతనివల్ల వేదము వినబడుటచే విశ్రవసుడని తెలిసికొని భరద్వాజ మహాముని దేవ సమాన రూపయగు తన తన కుమార్తెను భార్యగా నిచ్చెను. పిదప వారికి పుట్టిన కుమారుడు వైశ్రవణుడని పేరు పొందెను.

అతడు వేల సంవత్సరములు ఒక యేడాది వలె తపస్సు చేయుగా దేవతలతో నింద్రునితో గూడ బ్రహ్మ వెళ్ళి తపస్సుకు మెచ్చి వర మడుగ

మనెను. నేను లోకపాలురలో నాల్గవవానినిగా నుండునట్లు అతడు వరము కోరెను సరేయని యతనికి ధనేశ్వరత్వమును సంచారమునకు పుష్పకవిమానమును గూడ నిచ్చెను. అపుడతడు తండ్రి దగ్గఱకు వెళ్ళి ప్రాంజలియై నాకెవరివల్లను పీడ కలుగని యట్లు వాసమును గల్పింపుమన తండ్రి ఇట్లనెను "దక్షిణ సముద్ర తీరమున త్రికూట గిరిపైని విశ్వకర్మ నిర్మించిన లంక యను పట్టణము గలదు. అది అమరావతి వంటిది. అది రాక్షసుల నివాసమునకై నిర్మింపఁ బడినది. అది బంగారు ప్రాకారము గలది. యంత్ర శస్త్రములతోఁ గూడినది. రుక్మ వైడూర్య తోరణములు గలది. విష్ణు భయముచే పాతాళమునకుఁ బోయి దానిని రాక్షసులు వదలి పోయిరి. అక్కడ నీవు నిర్భయముగా నుండవచ్చును. అనగా అతడు సంతోషించి వేల కొలది నైర్ఋతులతోఁ గూడి యక్కడ వసించెను". అని యగస్త్యుఁడనగా అగస్త్యుని మాట విని ఆశ్చర్యముతో "లంకకు పూర్వము రాక్షసులెట్లు వచ్చిరి. ఇదివరలో పులస్త్యుని నుండియె రాక్షసులు త్పన్నులయి" రని భగవానుడు చెప్పెను. అదెట్లు రావణ కుంభకర్ణాదుల కంటెను వారు బలవంతులాయేమి? వీరి పూర్వులెవరు. ఏ నేరమువలన విష్ణువు వారిని పాఱదోలెను. చెప్పుమని రాముఁడు అడుగ రామునితో నగస్త్యుడు ఇట్లు చెప్పెను.

పూర్వము ప్రజాపతి జలములను సృజించి వానిని రక్షించుటకై జీవులను సృజించెను. ఆ జీవులు ఆకలి, దప్పులు కలిగి వినయముతో ప్రజాపతిని సమీపించి "మేమేమి చేయుదుము అనగా" ఈ నీళ్ళను రక్షింపుఁడనెను. కొందఱు వానిని రక్షింతుమనిరి. కొందఱు వానిని భక్షింతుమనిరి. రక్షింతుమన్న వారు రక్షించుటను బట్టి రాక్షసులైరి. భక్షింతుమన్నవారు (యక్ష-భక్షించుట) యక్షులైరి. అందు హేతి ప్రహేతి అనువారు రాక్షసాధిపులైరి. ప్రహేతి అనువాడు. ధార్మికుడు అతఁడు తపోవనమునకు వెళ్ళెను. హేతి, భయఅను కన్యను పెండ్లాడెను. అతనికి విద్యుత్కేశుడను కొడుకు కలిగెను. అతడు సంధ కుమార్తెను కాల కలంకట అను దానిని పెండ్లాడగా ఆమె గర్భవతియై మందర గిరిదరికి వెళ్ళి గర్భమును అక్కడ విడిచి విడిచినట్లు మఱచి విద్యుత్కేశునితో విహరించెను.

అపుడు ఆ శిశువు ఏడ్చుచుండ నా దారినిపోవు పార్వతీ పరమేశ్వరులు విని వానిని తల్లితో సమ వయస్కుని జేసెను. వాడె సుకేశుడు.

ఆ సుకేశునికి గ్రామణి యను గంధర్వుడు దేవవతి యను తన కన్య నిచ్చెను. ఆ సుకేశునికి మాల్యవంతుడు, సుమాలి, మాలియను ముగ్గురు కొడుకులుదయించిరి. వారు ముగ్గురు మేరుగిరి దగ్గఱ ఘోర తపస్సు చేసిరి. దానివల్ల మెచ్చివారు కోరిన అజేయత్వము, శత్రు హంతృత్వము చిరంజీవిత్వము అను మూడు వరములను బ్రహ్మ యిచ్చెను. అంతట వారు దేవతలను బాధించి విశ్వకర్మనిట్లు అడిగిరి. నీవు దేవతలకు వలెనే మాకును గృహము నిర్మింపుమనగా విశ్వకర్మ దక్షిణ సముద్ర తీరమున త్రికూట గిరి దగ్గఱ సువేలమను గిరియొక్కటి కలదు. అక్కడ ముప్పై యోజనములు విస్తీర్ణము నూఱు యోజన పొడవు బంగారు ప్రాకారము గల లంకాపట్నము నిర్మించితిని. అక్కడ మీరుండుడ నెను. అక్కడ అపుడు వారు వేలకొలది యనుచరులతో నివసించిరి. ఈ కాలము లోనే నర్మద యను గంధర్వ స్త్రీ ధీ, శ్రీ కీర్తులతో సమానమైనద్యుతి గల తన కన్యలలో - మాల్య వంతునికి సుందరి అను నామెను సుమాలికి కేతుమణి అను దానిని మాలికి వసుధ అను దానిని భార్యగా నిచ్చెను. అందు సుందరీ మాల్య వంతులకు వజ్రముష్టి విరూపాక్షుడు దుర్ముఖుఁడు సుప్త ఘ్నుఁడు యజ్ఞకోపుడు మత్తుడు, ఉన్మత్తుడు అను పుత్రులు నల అను కూతురు గలిగెను.

కేతుమతీ సుమాలులకు ప్రహస్తుడు అకంపనుడు వికటుడు కాల కారుహ కుడు ధూమ్రాక్షుడు దండుడు సుపార్శ్వుడు మహాబలుడు సంహ్రాది, ప్రఘ సుఁడు భాస కర్ణుడు అను కుమారులు గాక, పుష్పోత్కట కైకసి కుంభీ నసి అను కుమార్తెలు గలిగిరి. వసుధా మాలులకు అనిలుడు, అనలుఁడు హరుడు సంపాతి అను కుమారులు పుట్టిరి. ఈ మాలి కొడుకులు విభీషణు నికి మంత్రులై యుండిరి. వీరందఱు వరమువల్ల ఇంద్రుని, ఋషులను నాగ యక్షులను బాధించుచు జగములఁ దిరుగుచు యజ్ఞములను పాడు చేయుచుండిరి. పిదప మాలి, సుమాలి మాల్య వంతులు వర గర్వితులై పెట్టిన బాధలు దేవులిట్లు శివునితో చెప్పిన నేనేవిష్ణువును నేనేరుద్రుడను

## రావణాదుల జన్మ

నేనే బ్రహ్మను నేనే ఇంద్రుండను అని చెప్పుచు దేవతలను మమ్ము బాధించు చుండిరి. అని బ్రహ్మదరికి వెళ్ళిచెప్పి యభయము, గూర్చు, మనగ బ్రహ్మరుద్రులు విష్ణువును సమీపించివారివల్ల గలుగు బాధలు చెప్పిరి. నారాయణుడు గరుడిపై నెక్కి యుద్ధములో రాక్షసులను మాలిని చంపెను. అపుడు సుమాలి మాల్య వంతులుసదా జయము పొంది లంకను విడిచి పాతాళమును జొచ్చిరి. వారు రాక్షసుల కంటె బలవంతులని నారాయణుడు తక్క వీరిని ఎవరు జంపలేరు అని యగస్త్యుడు రామునితో చెప్పెను.

కొంతకాలమునకు సుమాలి పాతాళము నుండి మర్త్యలోకమునకు వచ్చి తన కుమార్తెతో పాటు సంచరించుచు పుష్ప విమానమునెక్కి తండ్రియగు పులస్త్యుని జూడంబోవుచున్న ధనేశ్వరుని జూచి మరల మర్త్య లోకమునుండి పాతాళమునకుం బోయి యిట్లు చింతించెను. ఏమి చేసినచో రాక్షసులకు శ్రేయస్సుగలుగును. దేనివలన మేము వర్ధిల్ల దుము అని యాలోచించి అతడు కైకసి యను తన కూతుతో నిట్ల నియెను. పుత్రీ! నీవు యౌవనవతివైతివి. నీవు వెళ్ళి ప్రజాపతి కులోత్పన్నుడగు విశ్రవసుని వరింపుము. ఈ ధనేశ్వరుడు తేజస్సు భాస్కర సముడు అని చెప్పగా విని తండ్రి యందలి గౌరవముచే విస్రవసు వున్నచోటికి వెళ్లెను. ఇంతలో ఆవిశ్రవసువు అగ్ని మహా సించి నాలుగవ యగ్ని వలె నుండెను. అక్కడకు గైకసి వెళ్లి తలవంచు కొని అతి దారుణమగు వేళయని తలవక యాతని కాళ్ళదగ్గర బొటన వ్రేలితో నేల రాయుచు నిలుచుండెను. అప్పుడు పరమోదారుడగు నా విశ్రవసువు ఆమెను చూచి భద్రురాలి! నీవెవరి కుమార్తెవు ఎక్కడ నుండి వచ్చితివి. పనియేమి ఎందువల్ల వచ్చితివి. శోభనురాలా! సరిగా చెప్పుము. అనగా ఆమె దోసిలి పట్టుకొని యిట్లనెను. ఓ మునీ! నీ యాత్మ ప్రభావము చేత నాయుద్దేశ్యమును తెలియగలవు. నేను నా తండ్రి యాజ్ఞవలన వచ్చితిని. నాపేరు కైకసి. మిగిలినది నీవె యెఱుగ దగుదువు. అని అదివిని యాముని కొంత వడి ధ్యానించి "ఓ భద్రురాల! నీవు వచ్చిన కారణమును నేను తెలుసుకొంటిని. నీవు సుతుల గోరి వచ్చితివి. కాని నీవు దారుణ వేళయందు వచ్చితివి. నీకు క్రూర

కర్ములగు రాక్షసులు జనింతురు" అని. అంత ఆమె యిట్లనెను? భగవంతుడా! బ్రహ్మవాదియగు నీవల్లను ఇట్టి పుత్రులను కనగోరను అనుగ్రహింపుము. అని యామె యనగా ఆ ముని శుభాననులారా! నీకు చివరి కొడుకు ధర్మాత్ముడైనవాడు పుట్టగలడు లెమ్ము అనెను.

పిదప కైకసి దారుణమైన దశగ్రీవునికనెను. అపుడు అనేకోత్పాతములు గలిగెను పిదప మహాబలుడై మహాశరీరరుడైన కుంభకర్ణుని వికృతముఖియగు శూర్పణకను, ధర్మాత్ముడైన విభీషణుని గనెను. అపుడు విభీషణుడు పుట్టినపుడు దేవ దుందుభులు మ్రోగెను. సాధు సాధు అని శబ్దము ఆకాశమున వినబడెను.

దశగ్రీవ కుంభకర్ణులు మహౌజస్కులయి వనమునవర్ధిల్లుచూ లోకములకుద్వేగము కలిగించుచుండిరి. కుంభకర్ణున ధర్మవత్సలులైన మహర్షులను భక్షించుచుసంచరించుచుండెను. విభీషణుడుధర్మాత్ముడై స్వాధ్యాయములందు నియతుడై జితేంద్రియుడై యుండెను. ఒకసారి ధనేశ్వరుడైన వైశ్యవుడు తండ్రిని చూచుటకు రాగా కైకసి చూచి దశగ్రీవునితో నిట్లనెను. చూడు బిడ్డా! తేజస్వియగు కుబేరుని చూడుము. అతడు నీ తమ్ముడైనను ఎట్లున్నాడో చూడుము. నీవును అతని వలె గొప్ప వాడవుకమ్ము. అని అపుడు తల్లితో దశగ్రీవు డిట్లనెను. ఇదిగో ఇపుడే ప్రతిజ్ఞ చేయుచున్నాను నేను అన్నతో సముడను అధికుడనగుదును ఆ పట్టుదలతో దశగ్రీవుడు గోకర్ణాశ్రమము దగ్గర తమ్ములతోఁగూడి గొప్ప తపస్సు చేసెను.

కుంభకర్ణుడు వేసవిలో పంచాగ్ని మధ్యనుగిలిచి శీతకాలమున నీటిమధ్య నీటిమధ్య ఉండి వేల సంవత్సరములు తపస్సుచేసెను. విభీషణుడు ధర్మాత్ముఁడై ఒంటికాలుపైని నిలిచుండి వేయేండ్లు తపస్సు చేయగా అచ్చరలాడిరి. పుష్ప వృష్టి ఆకాశమునుండి పడెను. దశగ్రీవుడు నిరాహారుడై వేల యేండ్లు తపస్సుచేసి వేలవత్సరములు చివర తన శిరస్సొకటి అగ్నిలో హోమము చేసెను. ఇట్లు వేయేండ్ల చివర తొమ్మిది తలలు అగ్నిలో ప్రేల్చెను. పదవర్షసు హస్రముల చివర పదవ తలతెగవేయుబోగా పితామహుడు

సంతసించి దేవతలతో వచ్చి యిట్లనెను. నీ తపమునకు సంత సించితిని. వరమడుగుము, అని అపుడు దశగ్రీవుడు శిరస్సువంచి నమస్కరించి యిట్లనెను. ప్రాణులెప్పుడును మరణ మన్నచో భయపడుదురు కాన నాకు మరణము లేకుండ వరమిమ్ము అనెను. అపుడు పితామహుడు అమరత్వ మెవరికిని లేదు. ఇంకొక వరము కోరుకో అనగా-దశగ్రీవుడు కృతాంజలియై నేను సువర్ణ నాగయక్షి దైత్య దానవ రాక్షసుల వల్ల గాని దేవతల వలనగాని నేను మృత్యువు పొందినట్లు వరమిమ్ము. మనుష్యాది ప్రాణులు నాకు గడ్డిపరక వంటివారు. అనగా సరే అట్లే అగుగాక యని నీవు తెగగొట్టిన శిరస్సులు మరల వచ్చుగాక నీవు మనస్సులో కోరిన రూపము కలుగును అని చెప్పెను. పిదప విభీషణుతో నిట్లు మహుడు వరము కోరుకొమ్మనెను. అంత విభీషణుడు ఆపదలో గూడ బుద్ధి ధర్మమందుండు గాక నేర్చుకొనకుండనే నాకు బ్రహ్మాస్త్రము స్ఫురించుగాక యనగా సరేయని అమరత్వమునకు వచ్చితినని కుంభకర్ణునితో వరము కోరుకొమ్మనెను. ఇంతలో బ్రహ్మతో దేవతలిట్లనిరి. కుంభకర్ణునికి వర మీయరాదు. ఈ దుర్మతి లోకములను భయపెట్టుచున్నాడు. ఎఱుగవా! నందనవనములో ఎనమండుగురు అప్సరసలను పదిమంది మహేంద్రానుచరులను ఋషులు, మానవులు వీనిచే భక్షింపబడిరి గదా. వరము పొందినపుడే యిట్లు చేసినవాడు వరము పొందినపిదప భువనత్రయమును మ్రింగివేయడానికి కనుక వరమను మిషతో వీనికి మోహము కలిగింపుము. అట్లయినచో వీనికి శిక్షయు లోకములకు రక్షయు శుభమునగును అని అపుడు బ్రహ్మ ఆలోచించి సరస్వతిని వాని ముఖమున ప్రకాశపెట్టి నిద్ర పొందుటకై అనేక వరములిమ్మని యనిపించెను. పిదప ఆ కుంభకర్ణులకు దేవతలచే మోహపెట్టబడితినే యని చింతించెను.

దశగ్రీవాదులు వరము పొందునట్లు తెలిసికొని భయము విడిచి పాతాళ లోకమునుండి మాల్యవంతుడు తన యనుచరులతో భూమిపైకి వచ్చెను. మారీచుడు, ప్రహస్తుడు, విరూపాక్షుడు, మహోదరుడును గూడ పైకివచ్చిరి. అపుడు సుమాలియు వాని మంత్రులును మారీచుడు, ప్రహస్తుడు, విరూపాక్షుడు, మహోదరుడును భయము విడిచి రావణుని దగ్గరకు

వచ్చి కౌఁగలించుకొని యిట్లనిరి. మన యదృష్టవశముచే మనమనుకొనిన పని నెఱవేఱినది. బ్రహ్మనుండి వరములు పొందితిమి. మేమిది వఱకు విష్ణువలన భయపడి లంకను విడిచి పాతాళమునకు పోతిమి. ఆ లంక మనకు తగినది. నా యన్న కుబేరుడు అందు నివసించెను. ఇపుడు ఆ లంకను మరల సామముచేఁ గాని, దానముచేఁ గాని పొందవీలయినవో మంచిది. నీవు లంకేశ్వరుఁడవుదువు. అని యనగా "మనకు ధనేశ్వరుడు పెద్దవాఁడు నీవిట్లన దగవు" అని రావణుడనే గాను కొంత కాలమునకు రావణునితో ప్రహస్తుఁడిట్లనెను. ఓ మహాబాహు నీవలిట్లు అన రా దు. శూరులకెప్పుడు సౌభాతృత్వము లేదు. దితి అదితి అను సోదరీమణులు కశ్యపుని భార్యలు అదితి త్రిభువనేశ్వలగు దేవులను కనెను. దితియు మనలను పుత్రులను కనెను. ఈ పురిదైత్యులది. దైత్యులను జంపి విష్ణువు దేవులకిచ్చెను. ఇది నీవు కడలే చేయుట లేదు. ఇది సురాసురులు చేసినదే. నా మాట విను. అనగా విని దశగ్రీవుడు సంతోషించి కుబేరుని దగ్గఱకు ఈ పురిమాది మాకిమ్ము అని దూతను పంపెను. అపుడు ఆ దూత వాక్యములు విని కుబేరుడు తనకు తండ్రి దీనినిచ్చెనని చెప్పి ప్రహస్తుని పంపి తండ్రి దగ్గఱకు వెళ్ళి యా సంగతి చెప్పగా రావణుడు వర గర్వితుడు. నీవు కైలాసమునకు వెళ్ళి సుఖముండుమనెను. సరేయని కుబేరుడు కైలాసమునకు వెళ్ళెను.

అపుడు రావణుఁడు సోదరులతో గూడి అభిషిక్తుడై తన చెల్లెలి యగు శూర్పణఖను విద్యుజ్జిహ్వుఁడను కాలకేయ దానవుని కిచ్చెను. ఒకనాడు రావణుడు వేటకువెళ్ళి మయుడను వానిని గలిసికొని వాని కుమార్తె యగు మండోదరిని అగ్ని సాక్షికముగా పెండ్లియాడి మయుడిచ్చిన యమోఘ శక్తిని గ్రహించెను కుంభకర్ణుడు వైరోచనుని మనుమరాలగు వజ్రజ్వాల యను కుమార్తెను పెండ్లియాడెను విభీషణుడు శైలూషుడను గంధర్వ రాజు కుమార్తె సరమను పెండ్లాడెను. మానససరస్సున చిన్నతనమున ఏడ్చుచుండగా సరస్సును గూర్చి వర్ధయ పెంచమనుటచే ఆ పేరునసరమ అని పిలువబడెను. మండోదరికి మేఘనాదుఁడను కలిగెను. పుట్టగానే ఆ బాలుని యేడ్పు మేఘనాదమువలె నుండుటచే అతనిని మేఘనాదుడనిరి.

పిదప కుంభకర్ణుడు అన్నతో "నన్ను నిద్ర బాధించుచున్నది. నాకేదైన ఒక గృహమును గట్టించుమనగా" అపుడు రావణుడు ఒక యోజనము వెడల్పు రెండు యోజనములు పొడుగుగల ఒక గృహమును కాంచన చిత్ర స్తంభములతో, వైడూర్య సోపానములతో గుహవలెఁ గట్టించెను. అక్కడ ఆ కుంభకర్ణుడు చాల వేల సంవత్సరములు పరుండి మేల్కొనక యుండెను. తర్వాత రావణుడు దేవులను ఋషులను బాధింప సాగెను. అది చూచి అట్టి పనులను మానమని కుబేరుడు దూతను పంపగా రావణుడు ఆ దూత శిరస్సును ఛేదించెను.

అనంతరము రావణుడు కైలాసమునకేగి యక్షులపైకి యుద్ధమునకు వెళ్ళెను. యక్ష రాక్షసులకు తుముల యుద్ధము జరిగెను. ఆ యుద్ధములో కుబేరుడు మారీచాదులపరిగెత్తించెను రావనుడదిసైపకఎదిరించి ఓడించి మనోజవముగల కుబేరుని స్వర్ణపుష్పవిమానమును హరించి ఆ విమానమునెక్కి కైలాసముదిగి కుమారజన్మస్థానమైన శరవణమునుజొచ్చెను. అంతట పుష్పక విమానము ఆగిపోయెను. ఎందుకు విమానమాగినదాయని యాశ్చర్య పడుచుండ వానరముఖుడును పొట్టిచేతులుగల ముండియగు నందికేశ్వరుడువచ్చి ఓ దశాననా! ఇక్కడనుండి వెడలిపొమ్ము. ఇందు సుపర్ణనాగయక్ష గంధర్వ రాక్షసులకీ పర్వతము అగమ్యమైనది మరలిపొమ్ము. అన్న నందికేశ్వరుని మాటలను గణింపక వానర ముఖుడగు నందిని అవమానింప ఆ నంది "నీవు వానరరూపుడనగు నన్ను పరిహసించితివిగాన నఖదంష్ట్రాయుధులగు వానరులు నీ పొగరడచెదరుతే నీవిదివఱకే నీ కర్మలచేతఁ జచ్చితివి. ఇంక నిన్నుఁ జంపుట యేలయను అంత రావణుడు ఈ పుష్పకము ఆగిన పర్వతమునే పెల్లగించెదనని భుజములు చాపి కదుప ఆ పర్వతమును గదలెను. దేవ గణములు కంపించెను. పార్వతికూడ చలించి మహేశ్వరుని పొదివి పట్టుకొనెను. అపుడు దేవప్రవరుడైన ఈశ్వరుడు బొటన వ్రేలితో ఆ పర్వతమును నొక్కగా ఆ దశగ్రీవుఁడు రోదించెను. అందుచేత నాటి నుండి దశగ్రీవుఁడు రావణుడనబడెను. అపుడు రావణుడు ఈశ్వరుని స్తుతింపగాఁ ఈశ్వరుడు సంతోషించి వరము కోరుకొమన నాకన్ని కోరికలు సిద్ధించిన నింక ఎవనిచేతను నశింపబడని ఖడ్గమిమ్ముఅనెను. అపుడు

ఈశ్వరుడు అట్టి ఖడ్గమిచ్చి దీనినెప్పుడు తిరస్కరింపకుము తిరస్కరించినచో అది నా దగ్గఱకే మరలివచ్చును అనెను.

ఆ రావణుడు మహీతలమున సంచరించుచు హిమాద్రికివచ్చి అక్కడ తపస్సు చేయుచు కృష్ణాజిన జటలు ధరించిన వేదవతియను పేరుగల గంధర్వ కన్యను జూచి, "ఎవతె నీవు ఎందుకీ తపస్సు" అనగా నామె అతనికి అతిథి మర్యాదచేసి యిట్లనెను. "నా తండ్రి యగు కు శ ధ్వ జ మహర్షి వేదాభ్యాసము చేయుచుండగా పుట్టితినిగాన నన్ను వేదవతి యం దురు. నాతండ్రి విష్ణువును అల్లునిగాఁ జేసికొన దలచెను". ఇది విని దైత్యరాజు దంభుడు రాత్రి నాతండ్రి నిదురించు చుండగా జంపెను. అపుడు నా తల్లి నా తండ్రి శరీరముతో సహగమనము చేసెను. నేను దీనురాలినై నారాయణుని భర్తగా పొంద తపస్సు చేయుచుంటిని. అనఁగా రావణుడు ఆమెను బలాత్కారము చేయబోయి చేతిచివరిలో ఆమె జుట్టు పట్టుకొనెను అపుడు ఆమె చేతి కత్తివలె కాగా చేతితో జుట్టును ఛేధించి అగ్నిలో బడుచు స్త్రీనైన నేను నిన్ను జంపుట యుక్తముగాదు. నీవధకై నేను అయోనిజనై పుట్టెదను అని పలికి ఆమె అగ్నిని ప్రవేశించెను. పిదప ఆ వేద వతి పద్మమువంటి కాంతితో పద్మమందుఁ బుట్టగా మరల రావణుడే ఆ బాలను తీసికొని యింటికి పోయి మంత్రికిచూపగా లక్షణజ్ఞుడైన యాతడు ఇది నీయింటిలో నున్నచో నీవధకై యగునన ఆ రావణుడు ఆ బాలను పెట్టెలో పెట్టి సముద్రములో వడవేయగా ఆపెట్టి క్రమముగా భూమిలో బడి జనకుని యజ్ఞభూమికివచ్చి జనకుని నాగలి ముఖమునుండి పైకి వచ్చెను. ఆమెయె ఈ సీత నీవు విష్ణువవు అని ముని యనెను.

వేదవతి యగ్నిలో బ్రవేశించిన పిదప రావణుడు దేవతలతో గూడి యజ్ఞము చేయుచున్న యు శీరబీజదేశ రాజగు మరుత్తుని జ యిం ప వెళ్ళెను. బృహస్పతి తమ్ముడగు సంవర్త బ్రహ్మర్షి యజ్ఞము చేయించు చుండెను. యజ్ఞమునకు వచ్చిన యి ం ద్రు డు నెమలియై, ధర్మరాజు కాకియై, కుబేరుఁడు కృపలాసమై వరుబరు హంసయై వెడలి పోయిరి. ఇట్లు ఇతర దేవతలు కూడ వెడలిపోవగా రావణుడు యజ్ఞమును కుక్కవలె

అశూచియై వ్రవేశించెను. రావనుడు మరుత్తుని యుద్ధమునకు పిలువగా రావణుని పుట్టు పూర్వోత్తరములు అడిగి తెలిసికొని యుద్ధము చేయబోగా యజ్ఞమును సగములో విడిచి వెళ్ళరాదని ఋత్విక్కు చెప్పగా మానెను. అపుడు మరుత్తుడు ఓడినట్లు తలచి శుకుడు ఘోషింప యజ్ఞమునకు వచ్చిన మహర్షులను భక్షించెను. రావనుడు వెళ్ళగా దేవతలు మయూరాది రూపములను విడిచిరి. పిదప ఇంద్రుడు నెమలికి వేయి కండ్లు కలుగునట్లును ధర్మరాజు కాకికి రోగము లేకుండునట్లు ఎవరును చంపకుండ చావు రానట్లును, నీవు భుజించిన గాని నరక వాస్యులు తృప్తి పొందనట్లు యముడును వరునుడు హంసలకు పూర్వమున్న నల్లని రూపము చక్కగా తెల్ల రూపముగా నగునట్లును, కుబేరుడు గిరి యందలి కలాపమునకు బం గారు రంగును శిరస్సున నిత్యము ద్రవముతో నుండునట్లును వరములిచ్చి వచ్చినట్లు వెడలిపోయిరి.

రావణుడు మరుత్తుని జయించి జయింపబడితి మనుడు విడుతునని మహేంద్ర వరములతో సమానులగు రాజులతోఁన మేము జయింప బడితిమని యనగా వారిని విడిచెను. దుష్యంతుడును రధుడుగాధిగయుడు పురూవుడు, వీరు జయింప బడితిమనగా తరువాత అయోధ్య చేరి అనరణ్యుని తోజయింపబడితి ననుము. విడుతుననఁగా అనరణ్యుడట్లనక రావణబలము యుద్ధములో తనబలమును నాశన మొనరింపగా అతడు విల్లూని రాగా నూరిచ శుకసారప్రహస్తులు పాఱిపోయిరి. పిదప రావణుని యుద్ధము లో పడగొట్టగా పడిసరే నీచే నేను పడగొట్టబడలేదు. కాలమువచ్చినన్ను పడ గొట్టినది. సరేకానిమ్ము. నాకులములో దశరధునికి రాముడు పుట్టి నీప్రాణములు తీయునుతే అని శపించెను. అదివిని దేవదుంధుభలు మ్రోగి వన పుష్పవర్షము పడినది.

పిదప మనుష్యులను భయపెట్టుచు రావణుడు భూమికిరాగా నారదుడు కనిపించెను. ఆనారదునికి రావణుడు నమస్కరించి కుశల ప్రశ్నచేసి రాకకుఁగారణమేమనగా రాక్షసరాజా! నీ విక్రమములకు సంతోషించితిని. కొంచేము చెప్పెదవినుము. ఈ చచ్చినట్లున్న మర్త్యులతో నీకు పనేమి,

అవధ్యుడమైన నీవు మానవులను కష్టపెట్టెదవేల జరావ్యాధి శతములతో నిండిన మనుజలోకము నెవడుచంపును గనుక, వీరు ఎట్లును చనిపోవు వారే. యముని లోకమునకుఁ బోవు వారే! కనుక యముని నిగ్రహింపుము. అతనిని నిగ్రహించినచో అందఱను గ్రహించినట్లే అని యనగా రావణుడు ఇట్లనెను. నేనిప్పుడు రసాతలమును జయింపబోవుచున్నాను. అమృతముకై సముద్రమును మథించి నాగులను సురలను వశపఱచుకొందును. అనగా నంయుడిట్లనియె ఈ మార్గము గుండ నీవు యమరాజపురమునకు బోవగలవు. అనగానరేయుని దశగ్రీవుడు యమలోకమునకు బోవగలవు. అనగా సరేయని దశగ్రీవుడు యమలోకమునకు బోయి యముని భటులచే బాధింప బడుచున్న జనకుని విడిపించెను.

పిదప యమునికి రాక్షసురకు ఘోర యుద్ధమయ్యెను చివరకు యముడుకోపించి తనదండమును రావణునిపై వడవేయగా బ్రహ్మవచ్చి ఓ వైవస్వతా! ఈ రావణుని పొంద దండము ప్రయోగించి నావరమును అబదముచేయకుము అని యనిచెప్పగా బ్రహ్మమాటవిని యముడక్కడనుండి అంతర్ధానమయ్యెను.

పిదప రావనుడు రసాతలమునకు పోయివానుకి మొదలైన నాగరాజులను వశపరుచుకొని యక్కడ ఉన్న నివాతకవచుల వదకువెళ్ళగా అపుడు నివాతకవచులు బ్రహ్మమాటమీద రావణునితో స్నేహము చేసుకొనిరి.

పిదప రసాతలమున అశ్వనగరమునకు పోయి కాలకేయులను జంపి రాక్షసులకి తినెడి శూర్పణఖభర్తయగు తనబావను తలభేదించి వరుణలోకమునకేగి వరుణ పుత్రులను పరాభవించి యుద్ధమునకు వరుణుని మంత్రి ప్రహసుసుడిట్లనెను ఓరావణా! మా మహారాజు వరునుని గాంధర్వ సంగీతమును వినుటకు బ్రహ్మలోకము నకు వెళ్ళెను వృధగా వరుణుని యుద్ధమునకు పిలుతువేలయనగా రావణుడు సంతోషముతో అక్కడనుండి లంకాభిముఖముగా వెళ్ళిపోయెను.

పిదపరావణుడు అయోధ్యాపతి మాంధాతులతొ ఘోరమైన యుద్ధమయ్యెను. అంతపులస్త్యగాలవమునులు వచ్చి వారి యుద్ధమును వారింపగా

వెళ్లిపోయిరి. పిదప దారిలో కనిపించిన నరేంద్ర ఋషిదేవదానవ పన్నగ యక్షమానవ కన్యకలను విమానములో ఎక్కించి వారి బంధువులను జంపుచుండెను. ఆస్త్రీలందరు కన్నీళ్లతో సముద్రముల నింపుచు నిట్టూర్పుచేత నిప్పులు వుండించుచు, ఎక్కడ వీడునన్ను జంపునో మావారిని జంపునో యని పుత్రులకోసము భర్తలకోసము ఏడ్వసాగిరి. వీడు స్త్రీ వలనే చచ్చునాక యని వారు శపించుటచే పుష్పవర్షము కురిసెను. దుంధుభులు మ్రోగెను.

ఇట్లు ఆస్త్రీల ఏడ్పులు వినుచు రావణుడులంకను ప్రవేశింపగా శూర్పణఖ తన భర్తను జంపి విధవను జేసితివని ఏడ్వగా నేను ఒడలు తెలియక నా వారు పరాయివారు అనితెలియక నీభర్తను జంపితిని ఏడ్వకు నీవు బాధిత యైన ఖరుని దగ్గర ఉండుము నీకు కావలిసినన్ని బహుమతుల నిచ్చెదను అక్కడ వాడు నీ యాజ్ఞ ప్రకారము నడచును. అనగా సరేయని అప్పటి నుండి ఖరుదగ్గరనుండసాగెను.

పిదపరావణుడు నికుంబిలయను లంకలోని యుద్యాన వనము చొచ్చి కృష్ణాజినములు దండ కమండలువులుదాల్చి తపస్సు చేయు, మేఘనాదుని అగ్నిష్టోమాదిసప్త యజ్ఞములనుజేసి పశుపతివలన కామగమనమను రథమును తామసియను మాయను అక్షయ బాణములను శత్రువిధ్వంస శాస్త్రము హొందెను.

పిదప వరుసకు సోదరియను కుంభీనసిని మధురాక్షసుడు తీసికొని పోయెనని విభీషణుడు చెప్పగావిని రావణుడు కుంభకర్ణాదులతో మధుపురమువెళ్ళగా కుంభీనసి తెలుసుకొని తనభర్తను జంప వలదని బ్రతిమాలగా సరేయనెను. అంత మధురాక్షసుడు రావణుని గౌరవింపఁగా వానితోఁగలిసి కైలాసమునకు బోవుచు నలకూబరుని దగ్గఱకుఁ బోవుచున్న రంభను బలాత్కరించగా నామెపోయి యీసంగతి నలకూబరునితోఁజెప్పెను. అంతకుృద్ధుఁడై నలకూబరుడు ఇంక నెవతినైనను తనపయికామములేనిదాని బలాత్కరించినచో వాని తల ఏడుముక్కలగుననిశపించెను. దానికి దేవతలు సంతోషించి దుంధుభులు మ్రోగించిరి. ఆ శాపమును విని ఆరావణుడు అప్పటినుండి జ్ఞాన

యందుఁగామములేనిస్త్రీని బలాత్కరింప మానెను. ఆ శాపము విని స్త్రీలు సంతోషించిరి.

కొంతకాలమునకు రావణుడు దేవలోకమునకు పోయి దేవతలలోను ఇంద్రునితోను యుద్ధము చేయగా ఇంద్రజిత్తు మాయతో ఇంద్రుని బంధించెను. అపుడు బ్రహ్మ వచ్చి యింద్రుని విడిపించెను. అమరత్వము కోరగా అమరత్వము ఎవరికిని లేదని బ్రహ్మ అనగా అపుడు ఇంద్రజిత్తు "నేను హవ్యములతో మంత్రములతో అగ్నిని పూజించి శత్రు జయమును గోరి యుద్ధమునకు దిగినపుడు అశ్వములతో ఒక రథము వచ్చుగాక అపుడు ఆ రథమందుండి యుద్ధము చేయుఁగా నాకు అమరత్వము వచ్చుగాక ఒకవేళ ఆ యజ్ఞము సమాప్తము కానపుడు యుద్ధముచేసినచో నాకు నాశనము కలుగనిమ్ము అనెను. అంత బ్రహ్మ అట్లే అనెను.

ఇట్లు అగస్త్యుడు చెప్పగా విని అయితే రావణునికి ఎక్కడను ఏ విధమైన యవమానము జరగలేదా. రావణుని ఎదుర్కొను వాడెవడును లేడా జగమంతయు గొడ్డుపోయెనా అని యనగా అగస్త్యుడనెను.

రావనుడు తాను వెళ్ళినచోటకెల్లను జయము పొందుచు భూమియంతయు సంచరించుచు కార్తవీర్యార్జును డున్న మాహిష్మతీ పురమునకు వెళ్ళెను. కార్తవీర్యార్జునుడు స్త్రీలతో నర్మదా నదిలో విహరించుచుండగా రావణుడు ఆ నర్మదానది దగ్గఱకు వెళ్ళి స్నానాది కృత్యములు తీర్చుకొని తానెప్పుడును కూడ తీసుకొనివెళ్ళు శివలింగమును ఇసుకమధ్యఉంచి గంధ పుష్పాదులను పూజించి సామగానము చేయుచుండెను.

సరిగా ఆ సమయమందే మహిష్మతీనగరనాథుడు కార్తవీర్యార్జునుడు నర్మదా నదిలో స్త్రీలతోఁగూడి ఆడ ఏనుగులతో గూడిన కుంజరము వలె క్రీడించుచుండియు తన చేతుల బలమెట్టిదో తెలిసికొనగోరి నర్మదా నదీ ప్రవాహమును అడ్డగించెను. ఆ నీరు వర్షాకాలమునవచ్చు వరదవలె పైకి పొంగగా రావణుడది చూచి కార్తవీర్యార్జునుని చేతులడ్డుటవల్ల నట్లయినదని శుకసారములవల్ల దెలిసికొని కార్తవీర్యార్జుని మీదకు యుద్ధము

శ్శెను. నీటిలోనుండి లేచి కా_ర్తవీర్యార్జునుడు తన సేనలను రాక్షస
చంపి తినుచుండుట చూచి గదతో రావణుని మీదకు రాగా ఇరువది
ుగల రావణుడు వేయిబాహువులుగల కా_ర్తవీర్యార్జునితో యుద్ధము
చు కా_ర్తవీర్యార్జుని బాహువులచే బంధింపబడెను. అపుడు పుల_స్త్య
విని కా_ర్తవీర్యార్జుని నుండి రావణుని విడిపించెను అని అగస్త్యుడు
యిట్లు ఒకరిని మించిన మరొకరు బలవంతులు కలరనియనెను.

ఇట్లు రావణుడు భూమియంతయు తిరుగుచు ఒకపుడు వాలిచే పాలింప
ష్కింధకు వచ్చి వాలిని యుద్ధమునకు బిలిచెను. అంతట వాలి
) తారుడిట్లనెను. ఇపుడు వాలి సముద్రములో సంధ్యనుపాసింపబోయి
సాగరముననుండెడు అక్కడకుఁ బొమ్ము అనగా పుష్పక మెక్కి రావ
దక్షిణతీరమునకు బోయి దక్షిణ సముద్ర తీరమున సంధ్యో పాసన
) వాలిని జూచి నిశ్శబ్దముగా వాని దగ్గఱకుపోయెను. అపుడా వాలి
త్తుగా జూచియు చూడనట్లు ఉండి తన జంకలో రావణు నిముడ్చు
పడమటి సముద్రమునకు బోయి సంధ్యవార్చి మరల ఉ_త్తర సాగర
సంధ్యవార్చి ఇట్లు నాల్గు సముద్రముల మున్గి కిష్కింధకు వచ్చి చంక
రావణుని విడువగా రావణుడు ఆశ్చర్యపడి వాలి బలమును మెచ్చుకొని
తో అగ్ని సాక్షికముగా దార పుత్రపుర రాష్ట్ర భోగాచ్ఛాదన భోజనము
సర్వమును మనకు అవిభ_క్తమగు స్నేహము కలుగుగాక అని చెప్పి
హము చేసికొనెను. అని చెప్పగా వినిరాముడు హనుమంతుని గొప్ప బల
ు మెచ్చి అతనిజన్మాదికమును గూర్చి చెప్పుమని యడిగెను.

అపుడగస్త్యుడిట్లు చెప్పెను. సూర్యు డిచ్చిన వరముచే బంగారమైన
ు రుపర్వతరాజ్యమును కేసరి శాసించుచుండెను. అతనికి అంజన భార్య.
) ఈ హనుమంతుని గనెను. ఒకమారు పళ్ళకై ఆమె అడవికి వెళ్ళగా
ిగొని హనుమంతుడు ఉదయించిన సూర్యుని జూచి పండనుకొని
ి వేల యోజనము లందున్న సూర్యుని వైపుగా పోయెను. కాని
ుమంతుడు నిర్దోషియని సూర్యుడతనిని దహింపలేదు. కాని సూర్యుని
తని పట్టుకొనదలచిన రోజుననే రాహువు సూర్యునిమ్రింగగోరి సూర్యుని

పట్టగోరు హనుమంతుని ఇంకొక రాహువుగా దలచి యింద్రుడువెళ్ళి వజ్రాయుధముతో గొట్టగా దవడ విఱిగి హనుమంతుడు ఒక కొండపైని పడెను. దీనికి కోపగించి పవనుడు గాలిని బంధింపగా ప్రజాపతి ఖిని హనుమంతుని తాకి బ్రతికించెను. అపుడు గాలి దిగ్బంధమును విడువగా సర్వ ప్రపంచము సంతసించెను. ఇంద్రుడు ఒక కుశమాలనిచ్చి యితడు వజ్రమునకవధ్యుడనెను. నా శతాంశుకళనిచ్చితినని సూర్యుడనెను. చదువ శక్తి గలిగినపుడు శాస్త్రాధ్యయనము చేయింతు ననెను. ఇతనికి చావు లేదని వరుణుడనెను. దండావధ్యత్వమును అరోగిత్వమును యముడిచ్చెను. ఇట్లు దేవతలువరమిచ్చిరి. పిదపహనుమంతుడు ఆశ్రమములో స్రువస్రుక్ఖండములను అగ్నిహోత్రము అజినములను పాడుచేయ సాగెను. అపుడు భృంగువుఅంగిరస వంశజులైన మునులు నీకు నీబలౌజస్సులు ఎవరైనను జ్ఞాపకము చేయునంతవఱకు తెలియువనిశపించిరి.

* వాలి సుగ్రీవుల తండ్రి ఋక్షరసుడు చనిపోగా అరాజ్యమును తరువాతవానికొడుకు వాలి రాజ్యమేలెను. పిదప సుగ్రీవునితో హనుమంతుడు స్నేహముచేసెను. ఇతడు సూర్యునివల్ల వ్యాకరణము గ్రహించెను. ఇతడు నవవ్యాకరణవేత్త.

---

* ఇక్కడ అధిక పాఠ సర్గలలో "ఋక్ష రజసుడు వనమందు ఉండి యోగాభ్యాసము చేయుచు బ్రహ్మ కన్నీటి చుక్కల వలన పుట్టినట్లు వున్నది"

అతడు సంచారము చేయు మేరు గిరి దగ్గర ఒక హ్రదములో దప్పిచే తీరు కొనుటకు వెళ్లి నీళ్లలో తననీద చూచుకొని వీడెవడు నన్నువమానించుచున్నాడని కోపగించి ఆ హ్రదములో దుటికి స్త్రీగానైనట్లును వానిచూచి సూర్యుడు అనంతరము ఆడకోతి తోకపైని శక్తినుంచ వాలిగా పుట్టినట్లును మెడపైని శక్తిఉంచగా సుగ్రీవుడుగాను పుట్టినట్లును కథగలదు. మరియు నారాయణుడు రాముడుగా నవతరించు నని సనత్కుమారుని వలన విని రామునిచేతిలో చావగోరి రావణుడు సీతను హరించినట్లు జయేచ్ఛతో వెళ్ళిన రావణుని శేతద్వీపములో స్త్రీలుకీట కమునువలె ఆడించినట్లును అక్కడ వవమానమునుపొంది, ఆ ద్వీపము మాహాత్మ్యమును నారదునివల్లవిని రాక్షసుడు తనలంకకు పోయినట్లును వర్ణింపబడినది.

ఇకఇట్లేమైంద ద్వివదనీలాదులు సురలపల్లఁగలిగింనవారే.

ఇట్లుచెప్పి అగస్త్యుడు మునులతో గూడి తన యాశ్రమమునకు వెళ్ళెను.

ఇంక తన పట్టాభిషేకమునకు వచ్చిన రాజులనుపంపి విభీషణ సుగ్రీవాదులకు అనేకకానుకలనిచ్చి తన హారమును హనుమంతునికిచ్చి వారి దేశములకు రాముడు పంపి పుష్పకమును గూడ గుబేరుని దగ్గఱకు పంపెను.

ఇకశ్రీరాముడు బంధులన్ బనిపియాహేమోజ్వంబైన పు
ష్పకమున్ వీడ్కొనిచొచ్చె జందనవిరాజత్పారిజాతాంచిచం
పకపున్నాగ కదళ్యశోకవకుళ సరచ్ఛ మందారలో
ధ్రకదంబాగురు దేవదారుతరులీలల్ మీ నుద్యానముల్

3

అట సర్వఋతువులఱు నమరుపువ్వులువిచ్చి
రసము చిప్పిల్లు పండ్లువ్రాలియుండు
అట దివ్యగంధాలనలరు చివురులొప్పు
గండుతుమ్మెద పిండ్లు మెండు ముసరు
అటఁబలు రంగుల నమరు పక్షులుకూయు
గండుగోయిల శ్రావ్యగాన మలరు
అట చిత్రమై యందందు నాట్యముల్
సలుపు మయూరముల్ పిలుచు చుండు

అట వివిధపు దిగుడుబావు లలరియుండు
అటను గరుడపచ్చల మెట్టు లందమీను
అటను విరియుతామర కొలఁకులు తనర్చు
అటను చక్రవాకములవిహార మొప్పు

కొన్ని తరులు పసిడి దొనలఁ
గొన్ని తరువులగ్ని శిఖలఁగొను రారి తగున్
కొన్ని తరులు నీలాంజన
సన్నిభములగు నచటి సరసారామమునన్

వివిధాకార ప్రాకా
ర వితానమ్ములు శిలాఫలకములతనరున్
పవడపు మణులనుదాపిన
వివిధ స్థలములు తనర్చి వింతలు గొలుపున్

పచ్చని బయళులు హెచ్చయి
విచ్చిన పువ్వులను మెచ్చు వెలసిన వనులన్
హెచ్చగు పూవుల చెట్టులు
నిచ్చలు నొండొంటి మించి నెఱవును తావుల్

పూవులు చిత్రవిచిత్రము
సైవనితగు ద్రారలెసగు నాకసమట్టుల్
ఆ విరిదోటయు నందన
మో విధికృతచైత్రరధమొయనందనరారున్

శుభమయి పూవుల గుత్తులు
ప్రభలను జిమ్మంగనాస్తరణగల శశిస
న్నిభమగు నాసనమున రఘు
విభుండు కూర్చుండియుండి ప్రీతితనర్చన్

ఆతణి ముంజేతనుగొని
సీతను, శుచియయిన యిక్షుసీధువు నింద్రుం
డా తత గతి శచినింబలె।
బ్రీతిని త్రాగించె రామ విభుడు విలాసన్

పచనముచేసిన మాంసము
రుచిగల పండులను కింకరులు వెసందేగా
రుచి రంగులు మధు వశలై
పచరింతురు నృత్యము నాట్యవాద్యక షణితిన్

హృదయాభి రాములగు నా
ముదితల సంతోషపెట్టి భూపతి రాముం
డెద ముద మొందె జనక తన
య దరినరుంధతిసతి దరిన వసిష్ఠుడటుల్

ఇటులన్ రాముడుఁదేవతానయతోనీడై న పై దేహితో
నిటవీలన్ విహరించుచున్ దినదినంబింపార దేవుండటుల
పటుపై సీతను హర్షపెట్ట విలసద్భావంబెదన్ గూర్చుచు
చ్చట భోగప్రదమైన శీతఋతువే చల్లంగనేగెన్గ్

పలుభోగాలమునింగి తేలుచుఁబ్రియుల్ భావావమైమర్చి మై
థిలిరాముల్ విహరించుచుండఁబదిలేల్ దీటైన సంవత్సరం
బులు కొంచెంబు నెఱుంగనట్లు ప్రతుదిలో బోవంగ్రమంబొప్ప శీ
తల భోగర్తువు వచ్చినట్లు చనియెన్ తత్రైవమికుల్ మోదిలన్

ఆక మధ్యాహ్నముదాక ధర్మపుఁబనుల్ వీక్షించి ధర్మానధా
ర్మికుడౌ రాముడు తక్కుకాలమును పేర్మిన్ మీటి శుద్ధాంత భూ
మికలందున్ గడుపున్, విదేహసతయు భక్తిదై ప్రీతిస్ దగన్ం
మిక కార్యంబులు చేసి యుత్తలను సేవించున్ సమానస్థితిన్

అవలన్సీత విచిత్రచేలముల నొయ్యారంబుగా దాల్చి యు
దివమంతన్ శచిదేవరాజునటు పృథ్వీనేత రామున్ప్రియున్
భువిసేవింపఁగ నాశుభాంగిఁగని యామోదంబునన్ రాముడె
క్కువ హర్షిల్లుచు మేలుమేలనుచు పల్కుల్పల్కి సంతుష్టుఁడై

తను గాత్రిన్విబుధాత్మజాభయగు సీతన్మెచ్చి యవ్వేళ ప్రీ
తిని బల్కెన్జనకాత్మజాత ! యిఁదె నీదేహంబునన్ సంతతిన్
గనుగుర్తుల్ గనుపెట్టుచున్నయవి యింకన్ నీవు కళ్యాణీ! నీ
మనసెద్దానినిగోరు, నేమిసలుపంభావింతువో చెప్పనన్

స్మితమొల్కన్ జనకాత్మ జాత వచియించెన్ రాఘవా! పుణ్యమై
న తపోభూములఁ గగ్గొనందలతు బండ్లన్ దుంపలన్దించును
గ్రత పంబుల్ పొనరించి తేజసులతో రాజిల్లి గంగానదీ
స్థతటాలన్ వసియించు మౌనులపథచ్ఛాయన్ నిలన్గోరెదన్

ఫలముల్ దుంపలటన్ భుజించెడి ఋషుల్వాసించు శాంతాశ్రమో
ర్వుల యందున్నిశియొక్కటేన్ గడుపగా లోలోన వాంఛింతునం
చెలమిన్ జానకి పల్కగా వినియున క్లిష్టంచెన కర్మమ్ము లుం
గల రాముడనె రేపె వెళ్ళెదవులే కాంతా! యవశ్యంబుగా

అని రాముండని ప్రియయగు
జనకజతోఁ బల్కి మిత్రసహచరుడై వెం
టనె మధ్య కక్ష్య దాటియుఁ
జనియెను కార్యాంతరంబు సలిపెడి పూన్కిన్

తరువాతి కక్ష్యయందు గూర్చుండిన రాజును విచక్షణలై హాస్యకారులు అనేక విధములైన కధ చెప్పుచు ఉపాసించిరి. విజయుడు మధుమత్తుడు కశ్యపుడు పింగళుడు కూటుఁడు సురాజు కాళియుడు భద్రుడు దంతవక్త్రుడు సుమాగధుడు అనువారు పరిహాసముతోఁగూడిన అనేక కథలను చెప్పసాగిరి. అపుడు కథా ప్రసంగములో దేశ విషయములను గురించి భద్రునిట్లడిగెను. "భద్రా! నగరములోను, దేశములలోను ఏయే వార్తలు ప్రజలు చెప్పు కొనుచుండిరి. పౌర జానపదులు నన్నుగూర్చి సీతనుగురించి భరత లక్ష్మణ శత్రుఘ్నులగూర్చిగాని కైకేయిని తల్లినిగూర్చిగాని ఏమనుకొనుచున్నారు. రాజుకెప్పుడును పర రాజ్యములతో ఏదో వాదులకు లోనగుచు చుందురు". అని రాముడడుగ భద్రుడు దోసిలొగ్గి అనియెను. "ఓ రాజా! పురజనులు శుభమైన సంగతులె చెప్పుకొను చుండిరి. సౌమ్య! రావణునిజంపి పొందిన నీ విజయమును ప్రజలు ప్రశంసించు చుండిరి". అని భద్రుడనగా "భద్రా పూర్తిగా ఏమియు మానకుండ పురజనులాడుకొనునవి శుభములుగాని యశుభ ములుగాని ఆడుకొను మాటలు చెప్పుచు వానిని విని శుభములు చేయుచు

అశుభములను పరిహరించెదను. స్వేచ్ఛగా నిర్భయముగా ఏ మాత్రము బాధలేకుండ జానపదులుఆడుకొను పాపములైన సంగతులనుగూడ చెప్పుము. అని రాముడనగా భద్రుండిట్లు ప్రాంజలియై చెప్పదొడగెను.

విను ము రామ! బజారులందును వనాళి
ఉపవనంబుల నలువీధు లుండుచోట్ల
జనులు నినుగూర్చి చెడు మంచి సంగతులను
చెప్పుకొనుచుందు రెల్లరు చేరినపుడు

రాముడిటులు చేసెను దుష్కరంపుఁబనులు
సంద్రముపయి సేతువుగట్టె జగతిదేవు
లైన దానవులైనఁ జేయంగలేని
పనులుచేసె నివ్వి శ్రుతపూర్వములుగావు

ఎదురుకొనరాని రావణుడిక మున్నె
భృత్యమిత్ర సహితము వధింపబడియె
వానరులను ఋక్షుల వశపఱచుకొనియె
రాక్షసులుగూడ జంపబడిరి. మూలంబుతోడ

చేసియుని రావణుని జంపివేసెగాని
రావణుడు చేసిన యుపచారంబు వెనుక
త్రోసి సీతనుగూడను తీసికొనియె
వచ్చియున్నాడు తన యింటికిచ్చతోడ

ఆతనికి నెటువంటిది సీతతోడ
సుకము. బలిమిదైత్యుడొడినుంచుకొని మున్ను
తీసికొనిపోయి లంకకు దితిజ వశత
నుంచు సీతఁదెచ్చియు నేవగించుకోడు

మా సతుల విషయమున నిటు
లే సైచవలసి యుండునేమో గద, రా
జే సంగతి చేసినదది
యే సరియింకను ప్రజలోనరింపగ దగుఁగా

ఇటులు అనేక విధములుగా జనులు సర్వ నగరములందు జనపదము లందుఁ జెప్పుకొనుచున్నారు" అని భద్రుడు చెప్పగా విని రాముడు మిగుల నార్తి చెందినవాడువలెనై స్నేహితులతో నిదియేమిటి మీరు చెప్పుడనియె. అపుడు వారు అందఱు నమస్కరించి దీనుఁడైన రామునితో అవును ఇం దులో సంశయము లేదు అనగా రాముడు వారి మాటలు విని వారి నంద ఱను నింటికిఁబంపివైచి బుద్ధితో నిశ్చయించుకొని ద్వారపాలకునితో సౌమి త్రిని భరతుని శత్రుఘ్నుని రమ్మని కబురంపెను. అంత వారు కంగారు పడుచు ఉలిక్కిపడి ఎందుకు అన్న కబురంపెనాయని త్వరగా పరువెత్తుకొని వచ్చి దీనుడై యున్న యన్న ముకమును జూచి అతడేమి చెప్పునా యని అతని ముకము వైపే చూడ దొడగిరి. అపుడు వెల వెల బోవు ముఖముతో రాముడు దీనులై యున్న తమ్ములతో నిట్లనెను. నన్ను సీతను గూర్చి పౌరులు జావదులు ఏమని యనుకొనుచున్నారో వినుడు. మీకు శుభమగుగాక. బాధపడకుడు నా మర్మ ములను జీల్చునట్టియా భయంకరాపవాదము ప్రజలలో బైలుదేఱినది.

నేనో మహాత్ములైన యిక్ష్వాకు వంశస్థుల కులములో పుట్టిన వాడను కదా! ఇంక సీత యో మహాత్ములైన జనకుల సత్కులములోఁ బుట్టినది.

దండకా వనములో రావణుడు సీతను హరించి తీసుకొని పోవుటయు వానిని చంపుటయు జరిగినది. మీరు వినుడు. లంకలో నున్న సీతను అయోధ్య కెట్లు తీసుకొని వెళ్ళెదను అని నాకు మనస్సులో తోచినది. మన నమ్మకమునకై సీత అగ్నిలో ఉఱికినది. సౌమిత్రీ! నీవును దేవ లును చూచుచుండగా ఇది జరిగినది: హవ్యవాహనుడగు అగ్నిహోత్రుడు వచ్చి యీమె పాపాత్మురాలు కాదు అని స్వయముగా చెప్పెను. సూర్య చంద్రులు చూచు చుండ సురుల మహర్షుల సన్నిధిని ఇంద్రుడు ఆమెను

నాకు అప్పజెప్పెను. సీత యశస్విని శుద్ధురాలు అని నా మనస్సుకు తెలియును. అందువల్ల సీతను తీసుకొని యయోధ్యకు వచ్చితిని.

సరి యిప్పుడో పౌరులలో జానపదులలో ఈ యపవాదము బైలు దేఱినది. ఇది విన్న నాకు చాల శోకము కలుగుచున్నది.

లోకములో ఎవనిని గూర్చి అపకీర్తి బయలుదేరునో వాడు ఆ యపవాదము ఉన్నంత వరకు అధమ లోకములలో పడును. అపకీర్తి చాల చెడ్డది. మహాత్ములందరు కీర్తి కోసమే ప్రయత్నము చేయు చుందురు. అట్టి అపవాదునకు భయపడితిని గాన నా జీవితమునైనను త్యజింతును. మిమ్ములనైనను సరే త్యజింపగలను. ఇంక సీత సంగతి లెక్కయేమి?

నేనిట్టి దుఃఖ సముద్రములో పడితిని. నా కింతకంటె గొప్ప దుఃఖ మేమున్నది. లక్ష్మణా! రేపు నీవు రథముపై సీతను ఎక్కించి మన దేశము చివర విడిచి పెట్టుము. గంగ అవతలి ఒడ్డున తమసా నదిని చేరి మహాత్ముడైన వాల్మీకి యాశ్రమము ఉన్నది. అక్కడ విజన ప్రదేశమున సీతను విడిచి రమ్ము. నీకు భద్రముగుగాక. నేను చెప్పినట్లు చేయుము. ఇంక నీవు సీతను గూర్చి ఏమియు, జెప్పవలదు. వెళ్ళు ఇందునుగూర్చి విచారణ వలదు. దీనిని కాదన్నచో నాకు చాల అప్రియము చేసినట్లే. నా కాళ్ళతోను నా జీవితముతోను ఒట్టే. నా యిష్టమునకు భిన్నము చేయువారు నాకు అహితులే యవుదురు. నా శాసనము అను సరించి నడవదలచినచో నన్ను నామాట మన్నింపుడు. ఇక్కడనుండి సీతను తీసుకొని పొండు. నామాట వినుడు. 'గంగ ఒడ్డున గల ఆశ్ర మములను జూతును అని సీత అన్నది కూడ. యీ కోర్కె నెవేరర్చ బడుగాక. అని పలికి కన్నీళ్ళుగల మొగమును కప్పుకొని తమ్ములు చుట్టు కొని యుండ ధర్మాత్ముడైన రాముడు హృదయమున శోకము నిండి పోవ ఏనుగు వలె నిట్టూర్చుచు తన గృహములోనికి వెళ్ళిపో యెను. పిదప లక్ష్మణుడు సుమంత్రునితోఁ జెప్పి సీతకు మెత్తని ఆస్త

రణము గల యాసనము రథమున నేర్పాటుచేసి సీత దరికి వెళ్ళి నీవు కోరినట్లు గంగా తీరమున వనములో ఋషుల ఆశ్రమములందు గడుపుటకు వెళ్ళుదువు గాని రథము నెక్కుము అనెను. అప్పుడు సీత లక్ష్మణుని వాక్కు విని అతులమైన సంతోషముపొంది విలువగల వస్త్రములను వివిధములైన రత్నములను తీసికొని బయలు దేరెను. లక్ష్మణుడు వానిని రథములోనుంచి సీతను రథముపై నెక్కించుకొని బయలుదేరెను. కొంత దూరమేగిన పిదప లక్ష్మణునితో సీత యిట్లనెను.

లక్ష్మణా! నాకు నశుభమౌ లక్షణములు
కనబడగ సాగె చాల, నా కన్ను నిపుడె
య దరు; నొడలు కంపించు, హృదయమిదియె
స్వస్థతయె లేనిదివలెఁ గన్పట్టఁ దొడఁగె.

ఉత్సుకత్వముతో పాటు నులికిపాటు
ఎక్కువయ్యె లక్ష్మణా! విశాలేక్షణుండ!
భువియు శూన్యమై తోచు నీ పూజ్యుడైన
భ్రాతకు శుభంబెగద భాతృవత్సలుండ!

అంద రత్తలు సుకముగ నుందురగద
పౌరులును జానపదులు శుభంబెయౌత
ఇటులఁ గేలొగ్గి మరల ప్రార్థించె సీత
లక్ష్మణుడౌ శుష్క హృదిని "భద్రంబ" యనియె

పిదప గోమతీ తీరమునఁగల యాశ్రమమందు రాత్రియుండి ప్రొద్దుట లేచి సౌమిత్రి సూతునితో ననె. సూత! రథము పూన్చుము శివుడు పర్వతమందు వలె గంగాజలమును శిరస్సున ధరింతును. అపుడు సూతుడు సీతను రథమెక్కించి వెళ్ళగా సగము దినము గడవగా గంగా జలమును జూచి లక్ష్మణుఁడు బారుమని ఏడ్వసాగెను. అపుడు మిగుల నార్తుడగు లక్ష్మణుని జూచి ధర్మజ్ఞురాలగు సీతయనియె.

యుండుమని చెప్పి కన్నీళ్ళతోఁ దడియుచు మనసు రాయి చేసుకొని సీతతో నిట్లనెను.

ఈపని చేయఁగ నా కా
జ్ఞాపించి మతియుతుడన్న నను లోకమునన్
ఈ పగిది నిజనిందకు
ప్రాపొనరించెనది శల్యముంబలె నొంచున్

ఇక వాకుఁ జావెవర మం
దుకె నుంటిని చావురాదు తొరగానా, కిం
తకు లోక నింద్యమైన వ
నికయి నియోగింవ దగను నేనీ కరణిన్

నను దయ, జూడుమి శోభన
నను గూర్చియుఁ బాపమను కొనందగదీవున్
అని లక్ష్మణుడం జలియిడు
చును భూమి వయిఁబడె జూవచుట్టగ నపుడే

విలపించుచు నిట్టుల ప్రాం
జలియయి చావదలతునను సౌమిత్రిని మై
థిలిగనుఁ గొని మదిలో మి
క్కిలి దుఃఖమును గొని యీపగిదిని వచించెన్

ఏమది లక్ష్మణ యిది నా
కేమి తెలియదయ్యె సరిగ నిటునిను యోగ
క్షేమముగల వానిగన
క్షేమంబేగద వచింపు క్షితిపతి కెందున్

మనుజేంద్రుని తోడే సరి
ఘనముగ నిటు దుఃఖమేల కలిగెను నీకున్
వినిపింపుమి నా యెదుటనె
నిను నాజ్ఞాపించు చుంటి నిక్కము జెపుమీ

అని యిటు దీనుండగు ల
క్ష్మణునికి వైదేహి మిగుల శపథం బిడి శా
సన మిడ తలవంచుకొనుచు
గనులన్ నీరూనుచుండ గడ కిటుచెప్పెన్

నినుగూర్చి సభామధ్యను
జనపదముల నగరమందు జానకి పతిదా
రుణాపవాదము వినియా
క్షణమె కుమిలి, నాకుఁ జెప్పిచనె గృహమునకున్

ఎవిదేవి రాజు హృదిను
న్నవౌ యావాక్యములు నేను నయముగ నీకున్
అవినుడు వంగను నేరని
యవి కావున మిన్నకుంటి కాంతరొ వానిన్

నీ వెటులున్ నిర్దోషవె
దేవీ పౌరాపవాదు ధృతిద్రోయగ తే
కీవిధి క్షితి నాధుని చే
నీవు త్యజింప బడితి మది నెంచకువేతే

రాజు నాజ్ఞచే నాశ్రమ ప్రాంతమందు
నీవు త్యజింపదగిన దానివిగనైతి
విట్టి పాపంబునే నిట్లు గట్టుకొంటి
నిదియె నీ కిచ్చు గర్భ దోహదము దేవి

ఇది గౌ నిదియు గంగాతీర మెనసి యుండి
బ్రహ్మ ఋషుల శాంతమగు నాశ్రమ పదంబు
ఇది పవిత్రము రమణీయమిదిగొ గనుము
ఓ సుశోభవ దుఃఖము నొందకమ్మ

రాజు నా తండ్రియగు దశరథుని కిష్టు
డగు సఖుండు మహాకీర్తి యగు మహర్షి
యతడు వాల్మీకి యటఁగలండతని యడుగు
జా డలాశ్రయించి సుఖమకూడి యుండు

జానకి యుపవాసపరపై సంతతంబు
రాము మది దలచుచు పతివ్రతవె యగుచు
నుండు మోదేవి! నీకును నుత్తమంపు
మేలు కలుగును నమ్ము మీ మేలుపొందు

దారుణములగు లక్ష్మణు తద్వచనము
లవనిజ చెవులఁ బడి వ్రీల్పనతి విషాద
మొందియంతనె నిలువంగ నోడి యప్పుడె
మొదలు నఱికినట్టి యరఁటిఁబోలి పడియె

అటులె యొక త్రుటి నిశ్చేష్ట నగుచునుండి
కనుల బొంగు నశ్రువులు చీకాకు గూర్ప
వ్యాకుల యయి దీనయటు లత్యంత మెడద
కుంది సీత లక్ష్మణుఁ గనుగొని వచించె

నా శరీరము లక్ష్మణా యీశుచేత
బాధ లొందుటకె సృజింపబడియె నిజము
ఎందుచేత నైతేనింక నిప్పుడకట!
యిట్టి దుఃకమూర్తియె ప్రదర్శింపబడెనొ

మును పే పాపము చేసి యుంటితినొ, యే పుణ్యాత్మునర్ధాంగితో
డను నేనున్ విడదీసి యుంటితినొ యాలాగేమి కాకున్న, నా
థుని చే శుద్ధ పవిత్రశీల వనియందుం ద్రోయగాఁబడ్డ దా
నిని నెట్లొదు నిదంత గూడ నెపుడోనేఁ జేయు పాపంబెయో

మునుపాయాశ్రమమందురామునడుగుల్ముందుంచుకొంచున్ జరిం
చినదావన్ మది దాని పై చియుఁ గడున్ జింతింతుగా యట్టిదా
నను ఈ యాశ్రమ భూమి నన్ను జన శూన్యంజేయ నెట్లుందు నా
వనటన్ దుఃఖితనేమి యంచెవనికిన్ వ్రాకుచ్చు కొందుంగదా

అడిగిన మునులకు నేమని
నుడువుదు, నేమంత సుకృతి వొనరించితి, ని
ప్పుడల మహాత్ముండగురా
ముడు నిన్నేల విడిచెనన ముందే మందున్

ఇపుడే సౌమిత్రీ నా
దు ప్రాణముల గంగ నీటఁదొరవడి విడువన్
అపడో నావతి రాజ కు
లపు మొలకయు శాశ్వతముగ భ్రష్టంబగుఁగా

సరె నీకిచ్చిన యాజ్ఞను
నెఱవేర్పుము, దుఃఖభాగినిని నను విడు మీ
నరపతి యాజ్ఞనె నిలుపుము
మరి నాదగు మాట కూడ మానక వినుమీ

సమముగ నత్తల కును హ
స్తములొగ్గి పదములపైని తల నాకయి యుం
చుము, మఱి యారాజునొ క్షే
మము నడుగుము నేనడిగిన మాడ్కిని నీవున్

అందఱకున్ తల వ్రాలిచి
వందనమును నాచరించి, వరధర్మమునన్
పొందుగ శ్రద్ధ గలుగు నృప
తిందగు రీతిని నిపుడిటు తెలుపందగుఁగా

"అనయమ్ము సీత శుచురా
లనియును నీయెడల భక్తురాలని సతతం
బును నీహితమును కోరెడి
దని సరిగా నెఱుగుదువు గదా రఘువీరా!

అపకీర్తికి భయపడు నీ
విపుడు నను త్యజించినాడవిక భువిగలయా
యపవాదము నేఁగూడఁ జె
ఱుప వలెఁగద నీవెగొప్ప లోకమునాకున్"

ధర ధర్మాత్ముండగునా
నరపతికిటునా పలుకుగ నయముగ జెపుమీ
నిరతము సోదరులను నెటు
లరయుదొ యటు పురజనులను నరయుము ప్రీతిన్

పురజనమును ధర్మంబుగ
నరయుటె పరధర్మమగును నందువలననే
ధరలోపల నీగీర్తియె
పరమోత్తమమయినదిగను ప్రవతథింబయ్యెన్

పౌరులఁగల యపవాదము
వేరులతోపాటు పెఱికివేయగఁ దలతున్
పౌరుల నపవాదమటుల
ధారుణి నామేనుగూర్చి తపియింప విభూ

పతియే దేవత స్త్రీలకు
పతియే ప్రియబంధువింక పతియే గురువున్
పతికిఁ బ్రియమగుపని విశే
షతఁ బ్రాణములొడ్డియైన జరపగవలయున్

అనినామాటగ రాముడున్ దెలుపగా నర్థుండిదేనేమరా
మునికిన్‌జెప్పెడు సంగ్రహంపు వచనంబుల్ నిండుచూలాలినౌ
నను నీవిప్పుడెగాంచి యేగుమనుచున్ వైదేహి లో గ్రుక్క ప
ల్కిననాలక్ష్మణు డుర్విపాళి పలుకన్ లేడయ్యె దీనాత్ముడై

బారుమని గొప్పచప్పుడు
మీఱగ నేడుచుచునే సుమిత్రాసుతుడూ
ర్పారగసీతను వలగొని
యోరుచుకొని క్షణము ధ్యానముండి వచించెన్

నను నేమనియనెదవు శో
భన! నీరూపంబును నిదివఱకును గనలే
దనఘా!నీ యడుగులె కం
టి, నెటుకనెద రాముండులేని నిన్ని చ్చోటన్

అని మరల నామెకును వం
దనమునుగావించి యెటులో నావనునెక్కెన్
కని నావనెక్కియును నా
వను నడుపగ నావికులను వదపడి పిలిచెన్

చనియవతలియొడ్డునకు, ల
క్ష్మణుడు వ్యథా భరముచేత జడుడటు రథమున్
గని త్రుటినెక్కి యనాథ వ
లెను దొరలెడిసీతఁ బొరిఁబొరిని తిరిగి కనెన్

మాటికిమాటికి దవ్వగ
నేటికవతల జనురథము, నికలక్ష్మణు న
చ్చోటఁగనికని పొగులు నా
బోటిని జానకిని జొచ్చె శోకంబతిగా

శోకభారాన వంగి యచ్చోట నపుడు
ఈయశస్విని సీతదిక్కేది లేక
నెమలి కేకలను బ్రతిధ్వనించు వనిని
అతిగ దుఃఖార్తయై బారుమనుచు నేడ్చె

అట్టులేడ్చుచున్న యాసీతను జూచి ముని కుమారులు సూక్ష్మ బుద్ధి యగు వాల్మీకి దగ్గరకుఁ బరువెత్తి మునిపాదములకు నమస్కరించి యామె యారోదన ధ్వని నంతయు నిట్లు నివేదించిరి. ఓ భగవానుడా! ఈమె ఏ మహాత్ముని భార్యయో తెలియదు. ఇట్టి దాని నిదివఱలో నెప్పుడును చూడము. లక్ష్మీదేవివలె సంమోహము వలన వికృతమైన మోముగలదై విలపించుచున్నది. భగవానుడా! అకాశమునుండి జాఱిపడిన దేవతవలెనున్న యామెను చూడుము. అ నదీతీరమునందు ఎవతెయోదుఃఖితయై యేడ్చుచు శోక పరాయణురాలయి యుండఁజూచితిమి. ఆమె అనాథురాలివలె దీన యయి యున్నది. ఆమె అట్టి దుఃఖస్థితికి తగినది కాదు. ఈ మెను మనుష్య స్త్రీగా అనుకొనము. ఆమెను సత్కరింపుము. మన యాశ్రమమునకు దగ్గరగనే యుండి నిన్ను శరణు చొచ్చినదని యనుకొందుము. ఎవరినైన రక్షకుని నిరీక్షించు చున్నది. ఆమె సాధ్వి భగవానుడా! వెళ్ళి ఆమెను రక్షింపదగుదువు.

అను నాముని కుమారుల మాటవిని బుద్ధితో నిశ్చయించి ధర్మవేత్తయ యిన యా వాల్మీకి తపస్సుచేధ్యాన చక్షువు గలిగి సీతయున్న చోటికిఁ బరువిడెను. అట శిష్యులతో పాటు నడిచివెళ్ళి అర్ఘ్యమును దీసికొని గంగా తీరమున అనాథురాలి వలె నున్న రాముని యిష్టపత్ని సీతను జూచి స్వతేజస్సుచే నానంద పఱచు వాడయి మధుర స్వరముతో నిట్లనెను.

నీవు దశరథుకోడలి, నీవురాము
ప్రియ మహిషివి, జనకరాజు ప్రియతమాజ
వో పతివ్రతా! స్వాగత మొగిని గొనుము
వచ్చుచునె నీవు తెలియంగఁ బడితి విపుడె

అంతయు దివ్యదృష్టి మెయినారసి నాఁడను దీనిహేతువున్
స్వాంతముచే గ్రహించితిని అంతయు నీదు జగత్ప్రసిద్ధ వృ
త్తాంతము నాకు నేడెవిది తంబుసునిర్మల దివ్యచక్షుచే
నింతయుఁ గంటిఁ జింత త్యజయింపుమి యుంటివి సీత! నాదరిన్

నాయాశ్రమమ్ము దరినే
యాయాతపసుల దాపసాంగనలున్నా
రాయత వాత్సల్యంబును
నీ యెడ బిడ్డనటు చూపి నిత్యము బ్రోతుర్

ఇదిగో నర్ఘ్యము నీవు గై కొనుమి యెంతే స్వేచ్ఛ నిశ్చింతవై
యిదె నీ యింటికిఁ జేరినట్లు మదిబాధేమీ యిటం బొందకే
యదనందుండుమి యంచు వాల్మీకి యనన్నా సీత మౌనీశునా
మృదు మాధుర్యయుతాద్భుతోక్తివినియట్లేయంచువాక్రుచ్చియున్

మునితోఁ బ్రాంజలి యౌచుమౌని వెనుకంబో వంగనా సీతవెం
టను ఏతెంచెడి మౌనిగాంచి మునికాంతల్ స్వాగతంబిచ్చి య
ట్లని రార్యా! యిదె మా నమస్సు చిరకాలంబయ్యె నేతెంచి మీ
కొనరింపందగునేది చెప్పుడది యెంతో భక్తిఁగావింతుమున్

అని యాతాపన కాంతలుంబలుకగా నంతన్ మునీశుండువ
ల్కెను ఈ కాంతయెసీత బుద్ధిసహితుండేయైన యారామునం
గన యామైథిలు పుత్రియాదశరథక్ష్మా ధీశుకుం గోడలీ
యన ఘూచార, యపాప, యీమె పతి త్రోయన్ వచ్చె నేఁ బ్రోవనౌ

ఈ మహితను మీరెంతయో ప్రేమతోడ
గాంచెదరు గాక నాదగు గౌరవమున
నా పలుకుచేత మీకును నీపెయెంతొ
పూజనీయు సుడి విశేషముగను నెపుడు

అని చెప్పి మాటిమాటికిని
మునిపత్నులకప్పఁజెప్పి పూతను సీతన్
తన శిష్యులతో నాశ్రమ
మును వాల్మీకి ముని చొచ్చె మోదంబెసగన్

**50–54–** సీత ఆశ్రమములోఁ బ్రవేశించినట్లుచూచి దీనుడైన లక్ష్మణుం డెంతయో ఘోరదుఃఖమును పొంది సుమంత్రునితో నిట్లనియె సుమంత్రా! చూడు పవిత్రురాలగు సీతను విడిచిపెట్టి రాముడెంతటి దుఃఖమును పొందగలడో గదా. ఇంతకంటె రామునికి దుఃఖ మేమున్నది సారధీ ఆహా దైవమును దాట శక్యము గాదు కదా. రాముడు సీతను విడువవలసి యున్నది కాబోలు దేవగంధర్వాసురులను జయింపగల రాముడు సదా దైవమునే యనుసరించు చున్నాడు. తండ్రి యాజ్ఞచే పదునాల్గు సంవత్సరములు వనములో ఉండ మరల నిపుడు సీతను అడవికి పంపివైచెను ఇంతకంటె కష్టమేమున్నది. ఇట్టి దుష్కకార్యమును రాముడుదక్క నింకెవడు చేయగలవుడు అని చెప్పగా సుమంత్రుడనియె. లక్ష్మణా నీవు దుఃఖింపకుము, ఇట్టి దుఃఖము తప్పనిదని యిదివఱకే నీ తండ్రి యెదుట బ్రాహ్మణులు చెప్పి యున్నారు. ఇదియే కాదు రాముడు నిన్ను సీతను భరత శత్రుఘ్నులను కూడ విడుచునని వసిష్ఠుని దగ్గర తన వంశోన్నతిని రాముని పరిపాలన గూర్చి దశరధుడడుగగా దుర్వాసుడిట్లు చెప్పెను.

పూర్వము దేవాసుర యుద్ధములో సురలచే అసురులు తరుమఁబడి భృగు పత్నిని శరణుజొచ్చిరి. అపుడు విష్ణువు ఆభృగుపత్ని శిరస్సును నరకెను. అంత భృగువు విష్ణువునకు నీకు భార్యతో వియోగము గలుగఁగలదని శపించెను. ఆశాప ఫలితముగా రాముడిట్లు సీతా వియోగమును పొందును అని. దుర్వాసుని వాక్యము సుమంత్రుని వల్ల విని లక్ష్మణుడు ఊరకుండి అయోధ్యకు వచ్చి తాను సీతను వాల్మీకి ఆశ్రమ ప్రాంతమందు విడిచిన సంగతి చెప్పి దుఃఖించు రాముని ఊరడించుచు నిట్లనియె.

విఱుగుటె తుది పెరుగుటకున్
ధరఁబడుటే తుది, యెగిరెడి దానికినెల్లన్
విరహమె తుది కలియికకున్
మరణంబే తుది ధరిత్రి మన బ్రిదుకులకున్

కనుకన్ భార్యలపై మఱి
తనయులపై ధనముపయిని దగు మిత్రులపై
అనయం బత్యా సక్తిని
గనరా దవ్వాని కెపుడుఁగల వెడబాటుల్

అని యూరట గలిగించి సీతను ఇంటఁబెట్టుకొనెననెడి యపవాదము వలెనే సీతయెడఁ గాముకుడై ప్రజల కార్యమును రాముడు మఱచెనని యపవాదము కూడ ప్రజలలో గలుగును గాన సీతనుగురించి విచారము మానుమని లక్ష్మణుడు చెప్పగా విని రాముడు విచారము మాని ప్రజాపాలన యందు నిష్ఠగలిగి కర్తవ్యమును చేయ నిశ్చయించికొనెను. తన దుఃఖము నడఁచుకొని రాముడు "ప్రజా కార్యముల విషయమై శ్రిద్ధగలిగి యుండక పోవుట వలనఁ గలిగిన యపచారమును గూర్చిన నృగుని కథను" లక్ష్మణునితో ఇట్లు చెప్పెను.

నృగుడు అను మహారాజు దూడలతోఁగూడిన ఆవులను కోట్లకొలదిగ బ్రాహ్మణులకు దానమిచ్చెను. ఆ దానమిచ్చిన గోవు మందతోఁగలిసి మరల ఆ నృగమహారాజు గోవులలోఁ గలిసెను. దానినింకొక బ్రాహ్మణునికి తెలియక రాజు దానమిచ్చెను. అపుడు గోవును గ్రిహించిన బ్రాహ్మణుడు తన గోవును వెదికి వెదికి చివరకు రెండవ బ్రాిహ్మణుని దగ్గఱ ఉండుట గాంచెను. ఇది నాదని మొదటి బ్రాిహ్మణుడును, నాదని రెండవ బ్రాిహ్మణుడును వాదించుకొని రాజు ద్వారము దగ్గఱకువచ్చిరి. కాని రాజదర్శనము కాలేదు. అందుచే నీవు ఊసరవెల్లివి కమ్మని రాజును శపించి వారిద్దఱు ఆ గోవును ఇంకొక బ్రాహ్మణునికిచ్చిరి. యదు వంశజుడగు వాసుదేవుల వలన శాప విమోచనమగునని యనిరి. అపుడారాజు ఆ శాపమును తెలిసి

కొని దుఃఖితుడై తన కుమారుడగు వసువునకు ప్రజలను నిత్యము ధర్మ ముగాఁ బాలింపుమని బోధించెను. అని చెప్పి కథలువిని తృప్తిలేని లక్ష్మ ణునికి ఇంకొక కథ యిట్లు రాముడు చెప్పఁదొడగెను.

ఇక్ష్వాకునందనుడైన నిమి అనువాడుకలడు. అతడు వైజయంతమను పురమందు నివసించి దీర్ఘసత్రమను యాగము చేయగోరి వసిష్ఠుని ఋత్విక్కుగా నుండగోరెను. అపుడు వసిష్ఠుడు అనెను. "ఇదివఱకే నేను ఇంద్రునిచే కోరబడితిని. కానఁ గొంత కాలమోపిక పట్టుము తరువాత నీ యజ్ఞము చేయింతుననెను. కాని నిమి అంగిరసుని భృగువునుపిలిచి గౌత మునిచేపూర్తిచేయించెను. హిమాద్రిదగ్గర యజ్ఞము అయిదువేలేండ్లుచేసెను. ఇంద్రుని యజ్ఞము పూర్తిచేసి వసిష్ఠుడు వచ్చి యజ్ఞము చేయింపదలచి వచ్చి గౌతము డాయజ్ఞము పూర్తిచేసినట్లు తెలుసుకొని కోపించి రాజదర్శ నను కోరి కొంచెముసేపు కూర్చుండి యుండెను. అపుడు రాజు నిద్రలో మునిగి యుండెను. రాజు కనిపింపక పోవుటచే వసిష్ఠుడు కోపించి నన్ను తిరస్కరించి యింకొకనిని ఋత్విక్కుగా నుండగోరితివి. కాన నీవు చైత న్యము లేని దేహము కలవాడవగుమని శపించెను. అది విని రాజు "తెలి యక పరుండిన నాకు శాపమిచ్చితివి". కాన నీవు చైతన్యములేని దేహము గల వాడవగుమని ప్రతిశాపమిచ్చెను.

ఇట్లు రాజును బ్రహ్మర్షియు ఒకరినొకరు శపించుకొని విదేహులై వాయువు లైరి. అపుడు ఇంకొక శరీరము పొందుటకై వసిష్ఠుడు వాయురూపముతో తండ్రిదగ్గరకువెళ్ళి "దేహములేనిచో సర్వకార్యములును లోపించును కాన నా కింకొక దేహమును ప్రసాదింపుమని కోరగా అతడు నీవు మిత్రావరుణుల వలనఁ గలిగినతేజస్సును ప్రవేశింపుమనెను. ఊర్వశిని జూచుటవలన గలుగు మిత్రుని తేజస్సు కుంభ మందుంచ బడెను. పిదప ఊర్వశిని జూచుట వలనఁ గలిగిన వరుణ తేజస్సు గూడ ఆకుంభమందె యుంచబడెను. ఆ కుంభమునుండి అగస్త్యుడుపుట్టెను. కనుక అగస్త్యుడు కుంభసంభవుడయ్యెను. ఆ కుంభములో మిత్రావరుణుల తేజస్సు కలిసి యున్నది. కాన మైత్రా వరుణియని యగస్త్యునికి పేరు కలిగెను.

బ్రహ్మ వాక్యమువలన మిత్రావరుణుల తేజస్సును వసిష్ఠుడు పొంది శరీరముగలవాడగుటవలన వసిష్ఠుఁడును మిత్రావరుణు డయ్యెను. ఊర్వశియందుఁ గలిగిన ప్రేమచే గలిగినవాడు గాన ఔర్వశేయుడు వసిష్ఠుడయ్యెను. మిత్రుడు ముందుగా ప్రేమించి పిలిచినను మిత్రుని విడిచి వరుణునియందు ప్రేమ గలదగుటచే మిత్రుడు నీ మనుష్య లోకమునకు పొమ్మని శపించుటచే ఊర్వశి పురూరవునితోఁ గలిసి యుండెను. అపుడు నహుషుడు కలిగెను. నహుషుని కొడుకు యయాతి. ఆతడు శుక్రశాపముచే వచ్చిన తన ముసలితనము శర్మిష్ఠ పుత్రుడగు పురువున కిచ్చి అతని యౌవనమును గ్రహించెను. పిదప ఆ పురువునికి రాజ్యము వచ్చెను. పురువు కొడుకు దుష్యంతుడు. ఇంక *నిమి దేహము లేనివాడై యుండగా పడియున్న అతని దేహమును మథించగా మైథిలుడు జనకుడు పుట్టెను.

పిదప భార్గవుడు చ్యవనుడు మొదలైన మహర్షులు వచ్చి "లవణా. సురుడు రుద్రుని వరమున శూలము సంపాదించి అందఱను బాధించుచుండెను. ఆ శూలము వధింపదగిన వానిని జంపి నిన్ను జేరును. ఆ శూలము చేతిలో నున్నంతవఱకు ఎవరును నిన్నుఁ జంపలేరని వరమిచ్చె.

* అతఁడు విదేహుఁడగుటచే విదేహుఁడనబడెను.

---

* ఈ క్రిందిదిఅధికపాఠము

రాముడు తనరాజ్యమును పాలించుచుండగా కుక్క వచ్చి తన్ను ఒక సన్యాసి కొట్టెనని ఫిర్యాదు చేసెను. ఆ సన్యాసికి ఏమి శిక్ష వేయుమని రాముడు అడుగగా వానిని కులపతిగా జేయుమనెను. ఎందుకిట్లు చెప్పితివని కుక్కను అడుగగా నేను కులపతిగా నుండి దేవతా బ్రాహ్మణులైన వారి పూజలో నుండి దాసీ దాసులతో శుభకాముడనై దేవ ద్రవ్యమును రక్షించుచుండి పిదప ధర్మమువీడి స్వహితము కోరుచు నృశంసుడనైతిని. అందుచే నాకీ శునకావస్థ వచ్చినది. కాన కులపతిగా నుండు వాడిట్టి స్థితిని పొందుచుండును గాన వానికి కులపతిత్వము నిమ్ము" అనెను. అందున్న వాడు దేవ బ్రాహ్మణధనమును దేవ ద్రవ్యములను హరించును అనెను.

పిదవ భార్గవుఁడు చ్యవనుఁడు మొదలైన మహర్షులువచ్చి "లవణా సురుఁడు రుద్రునియొక్క వరమున శూలమును సంపాదించి అందరిని బాధించు చుండెను. ఆశూలము వధింప దగిన వానిని జంపి నన్నుఁ జేరును. ఆశూలము చేతిలోనున్నంత వరకు ఎవరును నిన్నుఁ జయింప లేరనివర" మిచ్చెను. వానినుండి కాపాడమని ఋషులు కోరగా రాముఁడు శత్రఘ్నునికి చెప్పి శూలము లేకుండ పట్టణము ప్రవేశించునపుడు ద్వారము దగ్గర కాచుకొనియుండి శూలమును దెచ్చుగొాన నీయకుండ పోరాడుము అట్లయినచో వాఁడు మరణించునని యుపాయము చెప్పిరి. అంత శత్రుఘ్నుడు లవణుని వధించుటకువెళ్ళెను. మార్గములో వాల్మీకి శతృఘ్ననికి సౌదాసుని కథచెప్పెను సౌదాసుఁడు ఒక యజ్ఞము చేసెను. ఆ యజ్ఞములో వసిష్ఠరూపముధరించి రాక్షసుఁడు నరమాంసముపెట్ట మనెను నిజముగా వసిష్ఠుఁడే యిట్లుచెప్పెనని తలచి నరమాంసము పెట్టగా అది తెలిసికొని నీవును నరమాంసము తిందువని శపించెను. అంత సౌదాముడు కోపించి ప్రతిశాపమీయబోగా భార్యవారించెను, అంత ఆ సౌదాసుఁడు ఆ శాపజలమును తనకాళ్ళపై పోసికొనెను ఆ కాళ్ళు నల్లబడెను. కనుక అప్పటి నుండి కల్మాషపాదుడనఁబడెను. ఆరోజుననే సీత లవకుశులనుకనెను.

కుశ లవుల పుట్టుక

66— అర్ధరాత్రివేళ మునిబాలురు వచ్చి వాల్మీకికి రాముని పత్ని సీత యిద్దరుపిల్లలను కనెనని చెప్పిరి. అప్పుడు వాల్మీకిరక్షకై కుశల (దర్భల) గుప్పిడితో అ పెద్ద కుర్రవానిని మార్జనము చేసెను గాన వాఁడు కుశుఁడన బడెను. ఇంక రెండవ వానిని దర్భల లవముచే ( ముక్కచే ) మార్జనము చేసెను గాన వానిని లవుఁడని వృద్ధస్త్రీలు పిలిచిరి.

పిదవ అర్ధరాత్రి శతృఘ్నుఁడు ఆ గొప్ప ప్రియమైన సంగతి విని పర్ణశాలకు వెళ్ళి 'మాతా! మా అదృష్టమువలన నుంటివని కూడ అనెను. తెల్లవాఱఁగా శతృఘ్నుఁడు మునివద్ద సెలవు గైకొని వెళ్ళి యమునాతీర మున నేడు రాత్రులుండి ఋషుల యాశ్రమములందు వసించి యొకరాత్రి యుండి లవణాసురుని బలము గూర్చి భృగునందను నడగగా నతఁడిట్లు

చెప్పెను. ఒకసారి అయోధ్యాపతియైన మాంధాత స్వర్గమును జయించు టకు వెళ్ళెను. అపుడు "నీవు భూలోకమునె జయింపక వచ్చితి వేమి. భూలోకమును జయించి యాలోకములో లవణాసురుడున్నాడతనిని జయించి రమ్మని చెప్పగా మాంధాత యుద్ధమునకురమ్మని లవణునిదగ్గఱకు దూతను పంపగా ఆ దూతను లవణాసురుడు చంపి తినెను. అంత స్వయముగా మాంధాత వెళ్ళగా శూలముతోవచ్చి సేనతోగూడిన మాంధాతను భస్మము చేసెను. మరల ఆ శూలము యథాస్థానమునకు వచ్చెను అనిచెప్పి లవణా సురుఁడు చాల బలవంతుఁడు కాని నీవు శూలము లేని సమయము చూచి పోరుము. అంతటితో లవణుఁడు చచ్చుననెను. అంత రాత్రిగడవఁగా ఉద యమున ద్వారము దగ్గఱ నుండెను. అంత లవణుఁడు శూలము లేకుండుట చూచి యుద్ధమునకుఁ బిలిచెను. అంత ఇద్దఱకును ఘోర యుద్ధము జరి గెను. శూలము తెచ్చికొనుటకై లవణుఁడు ప్రయత్నింపగా శతుఘ్నుడు అతనిని వెళ్ళనీయక యుద్ధములో లవణుని చంపెను. అంత దేవతలు చూచు చుండ ఆ శూలము రుద్రుని చేరెను.

పిదప శత్రుఘ్నుఁడు ఆ రామములలో నిండిన యా మధురా నగ రిలో ఉండి పన్నెండు సంవత్సరముల పిదప రామునిఁజూడ అయోధ్య నగ రమునకు వచ్చుచు దారిలో వాల్మీకి యాశ్రమమునకువచ్చి లవణ వధముచే సంతోషించిన వాల్మీకిచే ప్రశంసింపఁబడి తంత్రీలయ యుక్తమైన రామ చరితామృత గానమునువినెను. ఆగానమును విని మైమరచిపోయి రాముని జూడ వాల్మీకి దగ్గఱ సెలవు గైకొని యయోధ్యకువెళ్ళెను. పిదప అక్కడ రాముని జూచి యేడురాత్రులుండి రాముడుపంప మధురాపరిపాలనకై మరల మధురకు వెళ్ళెను.

## బ్రాహ్మణ కుమారుని అకాలమరణము

ఇట్లు శత్రుఘ్నుని మధురకుపంపిన కొన్ని దినములకు ఒక వృద్ధుఁడు చనిపోయిన తన కుమారుని తీసికొని రాజ ద్వారమునకు వచ్చి 'అయ్యో! పుత్రా! పుత్రా! అని అనుచు నిట్లు విలపించెను. అయ్యో! క్రిందటి జన్మలో

నేనెట్టి పాపము చేసికొంటినోకదా, నా యయిదేండ్లకొడుకు అకాలమునఁ జని పోయెను. నేనును నీతల్లియు ఇంక ఎంతో కాలము బ్రదుకము. నేను అనృతముగాని హింసగాని చేసినట్లు ఎఱుఁగను. నాకు పితృ కార్యాలుచేయు కుండనే కొడుకు చనిపోయెను. రాముని దేశములోఁ దక్క నింకెక్కడను ఇట్లు అకాలమృత్యువు వచ్చినట్లు వినను. ఓ రాజా! చనిపోయిన నా కొడుకును బ్రదికింపుము. ఈ రాజద్వారమున దిక్కులేని వాడువలె భార్యతోపాటు చనిపోవుదును. బ్రహ్మ హత్యనుపొంది సుఖింపుము నీ సోదరులతో దీర్ఘాయువుపొందుము. ఇంతవరకు సుఖముగానుంటిమి. మేమిపుడు రాముఁనివశము పొంది కాలవశము పొందితిమి. నేడు ఇక్ష్వాకుల దేశము దిక్కు మాలినదైనది. రాజుచేసిన దోషములను బట్టి సరిగా పాలింపబడని ప్రజలు మరణింతురు. నేడురాముని రాజుగాపొంది నాబాలుఁడు చనిపోయెను, లేక జనులు జనపదములలో యుక్తమైన పనులు చేయు చున్నారు. వారికి కాలము వలని భయము లేదు. ఈ బాలమృత్యువు రాజ దోషమువలన వచ్చినది స్పష్టము. ఇట్లు ఆ వృద్ధుఁడనేక విధములుగా పలుకుచు ఆబాలుని కౌగిలించుకొని యేడ్చుచుండెను.

## శంబూకుని చరిత్ర

అటు జాలిగా నేడ్చుచున్న ద్విజుని రోదనము విని సంతాపము గల హృదయముఁతో వసిష్ఠునితో పాటు ఎనమండుగురు ద్విజులను మంత్రులను పిలువనంపి యీ బ్రాహ్మణుని రోదనమును దెలిపి బాలుని మృతికి కారణమేమి యడుగఁగా ఆ మహర్షుల సన్నిధిని నారద మహాముని యిట్లనియె. రాజా! పూర్వము కృతయుగములో బ్రాహ్మణులే తపము చేయుచుండిరి. బ్రాహ్మణుఁడు కాని వాఁడెవఁడును తపము చేయులేదు. అపుడు అందఱు అకాల మృత్యువు పొందక అందఱు త్రికాలజ్ఞులై యుండిరి. త్రేతాయుగములో క్షత్రియులును బ్రాహ్మణులతో సమానముగా తపస్సు చేయుచు వీర్యముచేతను తపస్సుచేతను అధికులై యుండి చాతుర్వర్ణ్య స్థాపనము చేసిరి. ఆ యుగములో ధర్మము ఒకపాదముతగ్గెను. వారు కృషియను అనృత వృత్తినవలంబించిరి. శూద్రులు సర్వ వర్ణములను సేవించుచుండిరి. ద్వాపరయుగములో వైశ్యులను తపస్సు ప్రవేశించినది. కలియుగములో

శూద్రులకు తపము చేయునధికారము గలదు. ద్వాపరయుగములో తపస్సు చేయుట శూద్రులకు అధర్మము. ఇపుడు ఒక శూద్రుఁడు తపస్సుచేయు చున్నాఁడు. అది అధర్మము అందుచే బాలుఁడు మృతుఁడయ్యెను రాజు ధర్మముగాఁ బాలించుచుఁ బ్రజల విద్యాతపఃసత్కర్మల ఫలితములో ఆరవభాగ మును పొందును. కనుక నీవు అన్వేషించి దుష్కృతము ఎక్కడ నున్నదో కనుగొనుము. ఇట్లయినచో ధర్మవృద్ధి యాయుర్వృద్ధియుఁ గలుగును ఈ బాలుఁడు బ్రతుకును అని.

ఆ నారదుని వాక్యమును విని రాముడు ఆ బ్రాహ్మణుని ఆశ్వాసించి పిదప మృతబాలుని శరీరమును సుగంధ తైలాదులచే జాగ్రత పెట్టించి పుష్పక విమానమునెక్కి యన్వేషించెను. దక్షిణదిక్కున శైవలమను వింధ్య సమీపగిరిదగ్గఱ ఒకసరస్సుకలదు. అచట అవాక్శిరుడై తపస్సుచేయు శూద్రుని శిరస్సును ఖడ్గమున ఛేదించెను. అంత దేవతలు పుష్ప వృష్టిని గురిపించిరి. అపుడు దేవతల వాక్కువలన ఆ మృతుఁడైన బాలుఁడు బ్రతికెను. అంత రాముఁడు అగస్త్యుని నమస్కరించి ఆ ముని యిచ్చిన ఆభరణము గ్రహించి ఆ మునివలన శ్వేతరాజు నుపాఖ్యానము వినెను.

పూర్వము త్రేతాయుగమున ఒకచోట ఫలములతోకూడియున్న యద్భుతమైన యరణ్యము గలదు. అచట ఒక సరస్సులో నేను ఒక శవమును జూచితిని. అపుడొకడు స్వర్గమునుండి వాద్యాదులతో దిగి ఆ శవమునుతిని విమానమెక్కి స్వర్గమునకు పోవుచుండఁగ నేనపుడు నీవెవరవు ఇట్లె నింద్య కర్మ చేయుదువేల అని యడుగఁగా ఆతఁడిట్లనెను. 'పూర్వము వైదర్భకు డను రాజు గలఁడు. అతఁడు సుదేవుడని ఖ్యాతి పొందెను. అతఁడు నా తండ్రి, అతనికిద్దరు భార్యలు ఒక భార్య యందు శ్వేతుఁడను పేరు గల నేనును రెండవ భార్యయందు సురథుఁడను కొడుకు గలిగితిమి. తండ్రి చనిపోగా జనులు నన్ను రాజును చేసిరి. పిదప నా యాయువు సంగతి తెలిసిన నేను మరణకాలము వచ్చెనని తెలిసికొని తమ్ముడు సురథునికి రాజ్య మప్పజెప్పి మృగపక్షులులేని వనమునకు వచ్చితిని. ఇక్కడ మూడువేలేండ్లు తపముచేసి స్వర్గము పొందితిని కాని అక్కడఁ గూడ ఆకలి దప్పికలు

నన్ను బాధింపక మానలేదు. అప్పుడు బ్రహ్మ నిట్లడిగితిని. మహాత్మా ఇక్కడ నెవరికిని ఆకలి దప్పికలు లేవు గదా నాకెట్లు ఆకలి దప్పికలు కలుగుచున్నవనఁగా బ్రహ్మ యిట్లనెను. నీవిక్కడి ఫలాదులను భక్షింపుము. పూర్వము నీవు భిక్షయడిగిన యతికి భిక్ష యిడితివిగాదు కాన నీకివి మిక్కిలి బాధ పెట్టుచున్నవి. ఆహారాదులచే పెరిగిన నీ శరీరమునె భక్షింపుము. అంతట నీకు తృప్తి కలుగును. అగస్త్యుడు ఇక్కడికి వచ్చినపుడు నీకీ స్థితి పోవుననెను. వచ్చి నీవిట్టి దుస్థితి పోగొట్టితివిగాన నీకీ యాభరణము కానుకగా నిచ్చుచున్నానని నాకీ యాభరణమిచ్చెను. వానిని తరింపఁ జేయుటకిది గ్రహించితిని.

అయితే ఈ వనము పక్షులు మృగములు లేకుండ నెందుకైనది విన గోరుచున్నానని రాముఁడనఁగా అగస్త్యుడిట్లనెను.

పూర్వము కృతయుగమున మనువను రాజు ఉండెను. అతనికొక కొడుకు గలఁడు అతఁడు ఇక్ష్వాకువు. వానికి చాలమంది పుత్రులుగలరు. వారిలో చివరివాడు మూఢుడు చదువురాని వాఁడునై యుండెను. వాని పేరు దండుఁడు. ఆ దండుడే వింధ్య శైవల పర్వతములమధ్య ప్రదేశ రాజ్యమును తండ్రి యివ్వఁగా అతఁడు అక్కడ మధుమంత మను పురమును నిర్మించి అందు నివసించెను. అతఁడొకమారు భార్గవాశ్రమమునకు వెళ్ళి అచట అరజ అను పేరుగల భార్గవకన్యను కామించి బలాత్కరించెను. పిదప భార్గవుడది తెలిసి ఆ దేశము వారమురోజులలో తగుఁలఁబడి పోవ శపించెను. అపుడక్కడి జనులు దూరమందున్న జనపదములకుఁబోయిరి. పిదప అది తగులబడి పోయినది. నాటినుండి అది యరణ్యమయి దండకారణ్యమని పిలువఁబడెను. పిదప రాముఁ డగస్త్యుని యనుమతి పొంది యయోధ్యకు వెళ్ళెను.

అయోధ్యలో రాముఁడు భరతుని లక్ష్మణుని పిలిచి సర్వ పాపనాశకమగు రాజసూయ యాగము చేయవలయునని నాకున్న దనెను. అపుడు భరతుఁడిట్లనెను ఈ యాగమువలన రాజ వంశములో ప్రాణులు నశించును కనుక ఈయాగము చేయరాదనెను. అపుడు భరతుని వాక్యములు రాముడు

మెచ్చుకొని బాలుఁడవైన నీశుభవాక్య ప్రకారమట్లే యనెను. అపుడు లక్ష్మణు డిట్లనెను. అశ్వమేధ యాగము శుభమైనది అది సర్వ పాపముల నుండి పవిత్రము చేయునది. పూర్వము వృత్తుని జంపుటవలన బ్రహ్మ హత్య పట్టుకొనఁగా నింద్రుడు అశ్వమేధ యజ్ఞముచేసి పాపము పోగొట్టుకొనెను. అపుడు బ్రహ్మహత్య వచ్చి దేవతలతో నన్ను నదులకు భూమికి యువతులకు బ్రాహ్మణ హంతలకు పంచి యిండనెను. అపుడు వారికది పంచి యివ్వగా ఇంద్రుడు పవిత్రుడయ్యెను గాన నీ వింద్రుని వలె నశ్వమేధ యాగము చేయమనెను అపుడు రాముఁడిట్లనెను. "అవును నీవు చెప్పినది నిజమె పూర్వము ఇలుఁడు పార్వతి వనము ప్రవేశించి "ఈ వనము ప్రవేశించిన పురుషులు స్త్రీలగుదు" రని శివుఁడుఅనుటచే స్త్రీయై పార్వతి యనుగ్రహముచే ఒక నెల స్త్రీగాను ఒక నెల పురుషుడుగాను అయి బుధునివలనఁ బురూరవు డను సుతుని కనెను. పిదప చ్యవనుని అరిష్టనేమిని దుర్వాసుడు మొద లగు మునులు కర్దముని కొడుకైన యిలునికొఱకు అశ్వమేధము చేయుచు ఈశ్వరానుగ్రహణ పొంది సార్వకాలిక పురుషత్వము ప్రాప్తింపఁ జేసిరనెను.

అంత అశ్వమేధ యజ్ఞము కొఱకు సుగ్రీవ విభీషణాదులను రాముడు రావించెను. కాంచనమయమగు సీతాప్రతిమనుచేయించెను. అంతఅశ్వమును సర్వదేశముల ప్రదక్షిణము చేయుటకు వదలెను. అశ్వరక్షకుడుగా లక్ష్మణుడు నెళ్ళెను. ఈ విధముగా జరుగు యజ్ఞమునకు శిష్యులతో వాల్మీకి వచ్చెను. వాల్మీకి ప్రేరణచేత కుశలవులు రామాయణమును గానముచేయఁగా రాముఁడు తెలిసికొని కుశలవులను రప్పించి రామాయణమును విని సంతోషించెను. పిదప వాల్మీకి రామునికి ఈ కుమారులు నీ కు మా రు లు సీత పతివ్రత ఈమెను స్వీకరింపుమనఁగా తన పవిత్రతను ప్రజలకుఁ దెలిపి లోకాప వాదము పోగొట్టమని రాముడు అనఁగా సీతవచ్చి నేను మనస్సుచేతను వాక్కుచేతను కర్మచేతను రామునిదక్క నితరునిన్మరింపనేని నాతల్లి భూదేవి నాకు దారియిచ్చి నన్నుఁ గొనిఁపోవుగాక అనగా భూమి బ్రద్దలయ్యెను. లోనుండి భూదేవి రత్నసింహాసనమున గూర్చుండివచ్చి సీతను తనలోనికిఁ దీసికొనిపోయెను. అపుడు దేవతలు పుష్పవర్షము కురిపించిరి.

అది రాముఁడుచూచి కోపించి భూమిని భస్మముచేయబోగా బ్రహ్మాదులు వచ్చి శాంతపఱచి కుశలవులపైని సీతమీదిప్రేమను నుంచమనిరి.

రాముఁడు ఏకపత్నీవ్రతుఁడై పదిపేలేండ్లు రాజ్యము పాలించెను. చాలకాలమునకు అశ్వమేధముచేసి కౌశల్య కాలధర్మమొందెను. పిదప సుమిత్ర కైకలును కాలధర్మము పొందిరి.

పిదప యుధాజిత్తు పిలిపింప భరతుడు పుత్రులతో మేనమామ యింటికేగెను. అక్కడ గంధర్వులను జయించి మరల రామునిదగ్గరకు ప్రియాణమై వచ్చెను. పిదప లక్ష్మణకుమారులను అంగదునిని పశ్చిమదిశకు చంద్రకేతనుని ఉత్తరదిశకు రాజులుగా జేసెను. లక్ష్మణ కుమారులను ఆ దేశములందుంచి మరల రాముని వద్దకేగెను.

అనంతరము మునిరూపముతో యముడువచ్చి మనమిద్దరము మాట్లాడ వలెను. అపుడు ఎవరును ఉండరాదు అని రామునితో బ్రహ్మ సందేశమును వినిపించి యింక వైకుంఠమునకు రమ్మనెను. అట్లు రాముఁడు యము డును సంభాషించు చుండ దుర్వాసుఁడువచ్చెను ఎవరిని లోపలకు పంపవలదు పంపినచో మరణదండనమే అని రాముడనెను కాని దుర్వాసుని వారించి నచో వంశమంతయు నాశనము అగునని శపించును. లోనికి పంపినచో దనకుమాత్రమె మరణదండన మగును దీనివల్ల వంశరక్షణ జరుగునని లక్ష్మణుడుతలచి దుర్వాసుని లోనికి పంపెను. దుర్వాసుడు వచ్చి వెళ్ళిన పిదప రాముఁడు తన నియమములను తలచుకొని శోకముతో దీనుడై ఏమియు మాటాడలేకపోయెను.

అపుడు లక్ష్మణుఁడు రామునితో నిట్లనెను "నాకొరకు చింతింపకు. కాలగతియిట్టిదే, నన్ను వధించి ప్రతిజ్ఞను నెరవేర్పుము. ఇది యంతయు ఇట్టిదే. దైవసంకల్పమే లక్ష్మణుని వియోగము అని వసిష్ఠాదులనిరి. అపుడు రాముఁడు లక్ష్మణుతోననెను. సౌమిత్రీ! ఇదిధర్మముకాదు, నిన్ను విసర్జించు చున్నాను త్యాగమువధయు రెండు యెకటేఅనిం అపుడు రాముడు బాష్పము లతో నిండి యింటఁ బ్రవేశింపకయే సరయూతీరమున వెడలి పోయెను. అతడు సర్వేంద్రియ శ్రోతస్సులను నిగ్రహించి నిశ్వాసముతీయక యుం

డెను. అపుడు తనపై దేవతలు పుష్పవర్షము కురిపించిరి. ఇంక ఇంద్రుడు లక్ష్మణుడును స్వర్గము చేరిరి.

లక్ష్మణుని విడచి రాముడపుడు శత్రుఘ్నుపుత్రులకు కుశలవులకభిషేకము చేసి భరతాదులుకూడ రాఁగా సరయూనదికిఁ బోయెను. అపుడు హనుమద్విభీషణులు ఆచంద్రార్కముగనుండ దీవించికూడ బయలుదేఱు సుగ్రీవునాపి సరయూ నదిలో దిగి బ్రహ్మదులు ప్రార్థింప వైష్ణవ తేజస్సును రాముడు ప్రవేశించెను.

ఇట్టిరామాయణము చదివినను వినినను వ్రాసినను సర్వ శ్రేయస్సులు కలుగును.

ఇది
వాల్మీకిచే రచింపబడి చర్ల గణపతిశాస్త్రిచే
సంగ్రహముగ అనువదింపబడిన
ఉత్తర రామాయణము
పరిపూర్ణము.

ఓం శాంతి శాంతి శాంతిః